# శ్రీ లలితా చింతామణి ద్వీప మహా అతి రహస్య నాట్యాలు
# కృష్ణనీలిమ

శ్రీ పురాణపండ రాధాకృష్ణమూర్తిగారి
ఆశీస్సులతో...

కృష్ణనీలిమ దీవెనలతో...

రచన

## శ్రీమతి మురుకుట్ల కామేశ్వరి




ప్రకాశకులు

శ్రీమతి మురుకుట్ల కామేశ్వరి

W/o శ్రీ ఎమ్. బి. వి. రావు

6-9-24/1, జోస్యులవారి వీధి

నర్సాపురం - 534 275

☎ 74752

శ్రీ లలితా చింతామణి మహా అతిరహస్యదీపం

డిసెంబరు 1999

కాపీలు 1000

కాపీలు కొరకు

**శ్రీమతి మురుకుట్ల కామేశ్వరి**
W/o శ్రీ ఎమ్. బి. వి. రావు
6-9-24/1, జోస్యులవారి వీధి
నర్సాపురం - 534 275
☎ 74752

వెల రూ. **125**/-

ముద్రణ
శ్రీ కనకదుర్గా ఆఫ్‌సెట్ ప్రింటర్స్
ధాన్యంబజార్, నర్సాపురం
☎ 75672

టైప్‌సెట్టింగ్
క్రియేటివ్ సర్వీసెస్
ఆంధ్రాబ్యాంక్ ఎదురుగా
నర్సాపురం. ☎ 73113

అగ్రజా,

అష్టాదశ పురాణంబుల్ అవనికి అందించిన విష్ణురూపాయ వ్యాసవే,

వేదవ్యాసులందించిన పురాణఫలములనుండి, ఉద్భవించినదేమన శ్రీరామమూర్తి పురాణపండ.

అగ్రజా, హనుమకు అనుజుడవై రామ క్షేత్ర వేదభూమి నుండి నవరత్నాలు వెలికి తీయతీవ్ర మానుషయత్నయజ్ఞరత్నమా, అన్నకోర్కె వేదాల ఆనతి, అయినను అవనిలో సాధింప హనుమన్నతోడుగా సాగుచుంటివి, అగ్ని పర్వతములు, సప్తసముద్రముల, మిన్ను విరిగి మీద పడినన్ వాయునందునుని వోలె సాగుచుంటివి,

దైవీక బంధమిది, నానాటికి ఇహము తెలియకుండె, జన్మకారకుని వాగ్దానమునకు కాఫీరాగము, నవమాసములు మోసిన జన్మనారి వాగ్ధానము నకు నారికేళపరనీరు కన్నవారికిచ్చిన వాగ్ధానమునకు కుడుముల్, కట్టుకొన్నవాని కిచ్చిన వాగ్ధానమునకు గృహలక్ష్మినై శ్రీలలితా పాదపద్మంబుల నాశ్రయించి జీవనము గడుపుచుంటి, నానిటి ఇహము అవగతముకాక అయోమయమ్మై, ఈ పవిత్ర శ్రీలలితా పాదపద్మంబుల్ వీడి ఎచ్చోటుకేగినా తెలియకున్నది.

అమ్మతెలిపె, సాలోక్య సామీప్య సారూప్య సాయుజ్య ఫలము. నాదర్పణము నీ కృష్ణ నామము వ్రాయించి బోధపరచెద ననుచుండె

అగ్రజా,

శ్రీపురాణపండ రాధాకృష్ణమూర్తి

(శ్రీ రామ భద్ర తేజః పుంజమా)

అనురాగముతో

అనుజ

శ్రీ లలితాదాసాను

దాసురాలు

## శ్రీ ఆదినారాయణ భట్టో
## శ్రీ ఆది మహాలక్ష్మి

మురుకుట్ల కామేశ్వరి అని దేహమునకు పెట్టిన పేరు, శ్రీ మురుకుట్ల బుచ్చి వేంకటేశ్వరరావుగారి ఇల్లాలిని కావాలని దైవాజ్ఞ సంతానం వేంకటలక్ష్మి, శైలజ, కుమారి సూర్య అరుణశ్రీ, ఫణిపురుషోత్తం నామధేయాలు!

భాష తెలుస్తుంది. తేజస్సుగా కనిపించి రూపాలు కనిపించి తేజస్సుగానే ఐదవఏట నుండి ఈ విధమైన ముద్రలు, ఇలాంటి ముద్రలు శ్రీ ఆదినారాయణ భట్టో, శ్రీ ఆదిమహాలక్ష్మి అని కోయజాతివారిలా కనిపించి వ్రాయిస్తున్నారు.

గోవర్ధనాచారి, కృష్ణతులసీ, శ్రవణనక్షత్ర అలాగే చిన్నబాబు ముద్దులొలుకుతు ఇలా నామం మణులతో చాలా అందంగా ఉండి విఘ్నాలు లేకుండా కన్ను మూసినా తెరచినా ముగ్ధ మోహనబాలుడు.

వికుంఠచారి అని అంటాడు.

ఇట్లు

మురుకుట్ల కామేశ్వరి

# శ్రీరామకృష్ణ గురు దేవస్తుతి

1. శ్రీరామకృష్ణ అవతార, దేహ స్వరూపే, అవతారమూర్తే, దేహస్వరూపే, మహావిలక్షణ మానవాతీత, ఊహాతీతాయ, తీవ్రకఠిన నియమ మహోగ్ర తపః సంపపన్నాయ, శ్రీరామకృష్ణ గురవేనమః.

2. విశిష్ఠగుణ సంపన్నాయ, చంద్రమణి పుత్రాయ, మహాశివ తేజోరూపేణ, భూలోకస్వయం ఉద్భవే, కామార్పు కూరుగ్రామేణ, శ్రీఖురామ ఛటోపాధ్యాయ, తపస్వీ, పితృదేహాయ, నమో శ్రీ రామకృష్ణగురవేనమః.

3. నిర్భయా శ్మశానేన తపః సంపన్నాయ, కాళీ, శివ దర్శిన, స్పర్శన, సంభాషణే కలకత్తా కాళీ ఆలయ స్థితాయ నమో శ్రీరామకృష్ణగురవేనమః.

4. సాక్షాత్ సరస్వతీ అంశేన శ్రీ శారదా మాతసతీ, ఉన్మాదస్థితేన, స్వీకారాయ, మహాకఠోర బ్రహ్మచర్య దీక్షణాయ, నమో శ్రీ రామకృష్ణ గురవేనమః.

5. దక్షిణేశ్వరాసమణి, కాళీ ఆలయ, ధ్యానాయ, సర్వకులమత, ఏకరూపిణేన దర్మితే, హీనకుల నిర్మాణ, ఆలయ పూజితే, సర్వజన హీనదృష్టేన అవమాన స్వీకారాయ, నమో శాంతి స్వరూప శ్రీ రామకృష్ణ గురవేనమః.

6. కామినీ, కాంచ దగ్ద బోధాయ, సద్గుణ – నిర్గుణ బోధాయ, నిరంతర భక్తి యోగాయ యోగినే దుర్గుణ విసర్జనే, సజ్జన గుణేన, శాశ్వత నిర్మల భక్తిమార్గ బోధాయ, శ్రీకాళీమాత తనయాయ, నమో శ్రీ రామకృష్ణ గురవేనమః

7. నిర్వికల్ప సమాధి స్థితే, మహాశక్తి స్వరూపే, సదా శ్రీ కాళీమాత దివ్య ఆనంద నాట్యాల ఆత్మపరమాత్మ సంయోగ సదాచిదానందే, ఘడియకాలమాత్రేణ నిర్వికల్ప మాధి స్థితి, ప్రజ్వలాయు, స్వర్ణదేహాయు, నమో శ్రీరామకృష్ణ గురువేనమః

8. న ఆహార, న శయన, న పానమ్ సదా నిశ్చల సమాధి స్థితి, నే దిగంబరాయ దేవాయ, నిరాడంబరాయు, సర్వదేవతా, దర్శన, స్పర్శన, సంభాషణ సాధకాయ, సాక్షాత్ దేవదేవాయ, నమో శ్రీరామకృష్ణ గురువేనమః

9. బ్రహ్మ, విష్ణు, శివస్వరూపాయ, సర్వదేవతా స్వరూపాయ దేవాధి దేవాయ వే స్వరూపాయ, సాక్షాత్ సర్వాంలకార, శ్రీకాళీమాత రూపాయ, నమో శ్రీరామకృ గురువేనమః

10. పరాబ్రహ్మనిష్ఠా, గరిష్ఠాయ, పరాబ్రహ్మాయ, ధనస్వీకార వివర్జితాయ, సర్వజ్ఞాన స్వరూపాయ, సర్వప్రాణి కోటి భాషార్థ గ్రహితాయ, నమో శ్రీ రామకృష్ణ పరమహంస గురువే నమః

11. బాల్యం, కౌమారం, యౌవ్వనాదులు, జాగ్రదాది, మారే సర్వ అవస్థలలోచిన్ముద్ర స్వరూప ఆత్మబోధాయ నమో శ్రీరామకృష్ణ గురువేనమః

12. నవవిధ భక్తి బోధకాయ సదా నామ, శ్రవణ, భావమననం, సంకీర్తనం, ధ్యానం, పరమపవిత్ర, గురు పరమేశ్వర, జ్ఞాన విరాగ, విభూది, నమో శ్రీరామకృష్ణ గురువేనమః.

13. భూమి, జలం అగ్ని, వాయువు, ఆకాశం, సూర్యచంద్రులు, విజ్ఞానులు, అన్నిటమిన్నగురవే, మహోన్నతం, విశ్వవ్యాప్తకం, మహోన్నత గురు శ్రీరామకృష్ణ పరమ హంస గురవే నమః.

14. తల్లి, తండ్రి, గురు, దైవ స్వరూప, గురు రూపేణేన, దైవ స్వరూపాయ, మహోన్నత తేజః సంపన్నాయ, సదా ఆత్మపరమాత్మ సంగమ, ఏకాంత నివాసాయ నమోగురవే శ్రీరామకృష్ణ పరమహంసాయనమః.

15. మాయా, దగ్ధాయా, నిజశాశ్వత భక్తిమార్గ దర్శికాయ మహోన్నత, ఉజ్వల జ్వాలా మాలితాయ, సదా భక్తి మార్గ బోధకాయ నమో గురవే శ్రీరామకృష్ణ పరమహంసాయనమః.

16. అజ్ఞానాంధకార వినాశాయ, దివ్య సహస్ర తేజః స్వరూపాయ, తీవ్ర చోరబుద్ధి, మానవేన, నిర్వికల్ప, సమాధిస్థితి, దీవెనాయ, నమో శ్రీరామకృష్ణ పరమహంస గురవే నమః.

17. భ్రాంతి నాశనాయ మూఢత్వ దగ్ధాయ ఇంద్రియాతీతా మాయా మోహాతీతాయ, సర్వదుఃఖ నాశాయ, ఇహ రోగ, భవరోగ నాశాయ, దివ్య శాశ్వత జ్ఞానప్రదాయ, నమో శ్రీరామకృష్ణ గురువేనమః

18. ద్వైత, అద్వైత, విశిష్టా ద్వైతాయ, మాధవ – గౌరీయ, సర్వమతాచార, ధ్యానాయ , విశిష్ణాయ, విజ్ఞానాయ, దివ్యకాంతి స్వరూపా, సదా శ్రీమాతా ధ్యాన సమాధి ప్రీత్యాయ, నమో శ్రీరామకృష్ణ గురువేనమః

19. అప్రమాయయా, అసమానాయ, అప్రతిమానాయ, మహోన్నత మకుటాయ, యతిరాజాగ్రేశ్వరాయ, పరమహంసాయ, పరమ పవిత్రాయ, జగన్మాత ప్రేమైక పసిబాలాయ, నమో శ్రీరామకృష్ణ గురువేనమః

20. సప్త జన్మ, మహాపాతకనాశనాయ, సర్వశక్తి సమన్వితాయ, నిజశిష్యప్రీత్యాయ, మహాశక్తిపాత నిధి దానాయ శిష్య వివేకానంద ప్రభువే, సర్వ సమర్థాయ, దేశవిదేశ

గురు ప్రతిభా నిరూపణాయ, మహోన్నత విద్యార్జితాయ, ఇహ-పరా విద్యా ప్రవీణాయ, వివేకానందాయ, మహానుభావే, నమో శ్రీరామకృష్ణ పరమహంసగురవే నమః.

21. అనంతరూపాయ, పరమశాంతాయ, మహాకళంక నాశాయ, కరుణా రూపాయ, పరమేశ్వరవరాయ, నమో శ్రీరామకృష్ణ గురువేనమః

22. ఆగమ, వేద పండిత, తర్క విజయే, సాక్షాత్ శ్రీ మహాభద్రకాళీ ప్రవేశ దేహాయ, అనేక విజయ తర్క పరంపరాయ, నిరహంకారాయ, నమో శ్రీరామకృష్ణ గురువేనమః

23. దివ్య గాన నాట్య, ఉన్మాదాయ, సాక్షాత్ స్వర్ణకేశ పాశీకాళీ, స్వరూప, దివ్యదేహ వీక్షణేన, విస్మితాయ, ప్రళయ, ఆనంద, ప్రణయ సర్వ ప్రళయ నాట్యరీతి గానరీతి కోవిదాయ నమో శ్రీరామకృష్ణ గురువేనమః.

24. అపూర్వతపః సంపన్నాయ, తీవ్ర పరితాపాయ, తీవ్రదుఃఖాయ, కాళీమాతా భక్తి, జ్ఞాన, శూరాయ, శివాయగురవాయ, మాయా విబంధనాయ, సర్వజపశక్తి త్యాగాయ, నిరుపమానాయ, నిస్స్వార్థ సర్వజ్ఞానప్రదాయ, నమో శ్రీరామకృష్ణ గురువేనమః

25. హనుమ దీక్షాసమయేన వాలాయ నిజభక్తి పరాయణ నిరూపణాయ, ఏసురూపాయ, రహీమ్‌రూపాయ, గురునానక్, సర్వకులమత దైవశక్తి, సద్గుణ – నిర్గుణ రూపేణ దర్శితాయ, నిజభక్తి శిష్య సందర్శితేన తవరూపాయానే కమ్ నమో శ్రీరామకృష్ణ గురువేనమః

26. అభేదరూపాయ, తీవ్ర రక్తస్రావ కఠిన రోగఓర్పితాయ, సర్వసాధన, ఫలాయ, సర్వావతార అగగణ్యాయ, అసమానాయ, తమో గుణనాశనాయ, నమో శ్రీరామకృష్ణ గురువేనమః

27. విషయతృష్ణ, సర్వ షడ్‌వర్గ నాశవరాయ, సంజీవినీరత్నాయ, భక్తవే, మహాఏకాగ్రత భక్తి ప్రసాదాయ, దివ్య, ప్రీతిగుణ దానాయ, సధ్యానాపజపేన, సర్వపాతక నాశనాయ, మహా చిదగ్ని దేహ స్పర్శేన మాత్రేణ, సర్వభక్తి నిరూపణాయ, నమో శ్రీరామకృష్ణ గురువేనమః.

28. మహోన్నత భక్తి సాధకాయ తీవ్రకఠోర దీక్షా అశ్వద్థవృక్షాయ అసమానాయ, రఘుకుల వంశ రఘువీర్ రూపాయ కృష్ణాయ, మహావీర ఏకాదశరుద్ర రూపాయ, శివగురవే, మహావిష్ణు గోవింద గురవే సాక్షాత్ సౌందర్య రాజేశ్వర రూపా నమో శ్రీరామకృష్ణ గురువేనమః.

29. ఇహ నాశనాయ - అమృత తత్త్వ మార్గ దర్శికాయ అమరత్వ అనేక మార్గదర్శికాయ, అమరత్వ అనేక మార్గదర్శికాయ, సర్వభక్త శిష్య ఆత్మ సాక్షాత్

కారకారణాయ, ఇహవిరక్తి పరాశక్తి ప్రదాయ ప్రబోధాయ, నమో శ్రీరామకృష్ణ గురువేనమః

30. దివ్య ఆనంద శ్రీ కాళీమాత నాట్య రూప తవదేహేన ప్రదర్శితాయ, సాక్షాత్ అద్భుత దివ్య పరాతేజః స్వరూప కేవల దేహేన సర్వదేవతా మూర్తియే ప్రదర్శికాయ నమో శ్రీరామకృష్ణ గురువేనమః

31. మహాగణపతి రూపేణ మృష్టాన్న భోజనాయ స్వల్పకాలే అనంత సుదీర్ఘ నిద్రేణ యోగస్థితే సదా శ్రీమాత గాన, నాట్య, కేళీ కలాపా పరమానంద పరానందాయ పరమాత్మరూపాయ, కేవల దేహ ధారిణే, గురవేన గురవే, మహాతీవ్ర సంక్షోభ కఠిన వ్రత దీక్షాయ, నభూతో, నభవిష్యతి నమో శ్రీరామకృష్ణ గురువేనమః

32. యుగాతీతా యుగ యుగాల పరమపురుషా సీతాదేవి, హనుమ సహిత ప్రథమ దర్శినాయ, తోతాపురీ గురువోన్నత పరాదివ్య శిష్యవేంద్ర, దివ్యాంశ సంభూత దేహమాత్రేణ నమో శ్రీరామకృష్ణ గురువేనమః

33. స్థిత ప్రజ్ఞాపసి బాల హృదయా భక్తి జ్ఞానవైరాగ్య నిలయ దేహాయ సదా కాళీమాత శిశువే బాలాయ త్రిగుణాతీతాయ, త్రినేత్రాయ, జ్ఞాననేత్రాయ, అంతర్– బహిర్ సర్వత్యాగాయ నిస్వార్థాయ, క్షమా రూపాయ, సర్వ శక్తి దేవత రూపా, అనేక యతివరేణ్య శిష్య పరివేష్టితే, ధర్మసంస్థాపనాయ భారత దేశమహాయోగి అగ్రగణ్యాయ నమో శ్రీరామకృష్ణ గురువేనమః.

గురుదేవా మమ వాంఛితామి – ఇహ విముక్తి . చింతామణి ద్వీప వాసినమ్

మమ ఆత్మా చింతామణి ద్వీపే కృష్ణనీలిమ నామ దేహాయ

ప్రథమే భూలోకే శ్రీ రంగనాథ సన్నిధే– శ్రీహారిక నామ దేహాయ

ద్వితీయే భూలోకే శ్రీరామచంద్ర సన్నిధే – రామతులసి నామ దేహాయ

తృతీయాం భూలోకే శ్రీకృష్ణ సన్నిధే – వంశీరవళి నామ దేహాయ

చతుర్థే భూలోకే శ్రీనివాస సన్నిధే – మంగతాయారు నామ దేహాయ

పంచమాం భూలోకే శ్రీరామకృష్ణ గురు సన్నిధే – నారాయణ నామ దేహాయ

షష్ట్యాం భూలోకే శ్రీ షిరిడి సాయి సన్నిధే – కమలామయి నామ దేహాయ

సప్తమే భూలోకే సాక్షాత్ శ్రీదేవి సన్నిధే – కామేశ్వరీ నామ దేహాయ

శ్రీ దేవి మూర్తి పతిష్టాతే సదా ధ్యానే భూలోక విముక్తేన శ్రీఘ్రమే చింతామణి ద్వీపవాస శ్రీదేవీ పాదపద్మయుగళం సేవితాం కాంక్షితాయ.

# తొలిపలుకు...

సర్వదేవతల ప్రార్థనల ఫలంగా చిదగ్నికుండమునుంచి ఉద్భవించింది. భండాసురుడు పెట్టే బాధలు విని కన్న తల్లిగా అమ్మలగన్న అమ్మ క్షణమాత్రం ఆలస్యం చేయలేదు. తీవ్ర తపస్సు చేస్తున్న కామేశుని కోర్కెలు ప్రజా దేవ రక్షణకు మహామాత రావలయునని, తన తపోఫలంః కాదివిద్య సమర్పించాలని తీవ్రఘోరతపస్సు చేసారు. క్షణమాత్రంలో 64 కోట్ల సర్వ దేవ మంత్రుల, సేనానుల, అనేకుల సృష్టించింది. తాను కామేశ్వరుని ఇల్లాలయ్యింది. అనేక ప్రాకారాలతో లోహ, ఇత్తడి, రాగి, కంచు, రజిత బంగారు, పుష్యరాగ, పద్మరాగ, ఇంద్రనీల, మరకత, ముత్యాల పగడ, రత్న, వజ్ర, వైఢూర్య, మహాప్రాకారల చింతామణి గృహము వేయి స్థంభాల చింతామణులతో చంద్రశిలాఫలకముతో, సూర్యచంద్ర మణులతో మహా మండపం నిర్మాణము చేసింది. ముక్తి, జ్ఞాన, శృంగార, ఏకాంత, మండపాలుగా విభజించింది. జ్ఞాన, మండపంలో జ్ఞానాన్ని, ముక్తి మండపంలో ముక్తిని ఏకాంత మండపంలో పన్నెండుగురు మంత్రులతో తానే స్వయం నిర్ణయం తీసుకుంటుంది. పరిపాలనా బాధ్యాతాయుతంగా నిర్వహించే మహాబుద్ధి కుశలురు సమయస్ఫూర్తితో వేవేగం అతిసమయోచిత సమర్థులున్నారు. అయినా అమ్మే స్వయంగా చూసుకుంటుంది. భండాసురుని వధించి దేవతల కోరిక తీర్చింది. అయితే మంచాధిశాయిని నాలుగు దిక్కుల బ్రహ్మవిష్ణు మహేశు రుద్రులు, ఫలక భాగంలో సదాశివుడు, ఇరుప్రక్కల వాణి లక్ష్మి వింజామర సేవ, గణేశకుమారుల శ్రీ చక్ర సింహాసన స్థితా, కామేశుడు సుస్థిరుడై ఆశీనుడై బల్లపరుపుగా పడుకొని ఉండగా అమ్మ కూచుని ఉంటుంది. ఈ మంచాధీశాయిని మండపం అగోచరము వ్యోమకేశనియై అమ్మ అతి గంభీర అచల అయితే అనేక రూపాల్లో తన కార్యకలాపాలు చేస్తుంది. ఇది మహామండపం మహామాయాలోకం. భారతయుద్ధంలో గెలుపెవరిది మకరధ్వజుడు శిరస్సు రూపంలో చూసి శ్రీ లలితా దేవిది అన్నాడుట మకరధ్వజుడు. మకరధ్వజుడే అన్ని దేవతా మూర్తులకు మకరతోరణమై ఉండేలా వరం కోరుకున్నాడు. ఈనాడు మకరతోరణం నాడు మకరధ్వజుని యక్షవరము. గంధర్వుడు కృష్ణ అవతారం అనవసరం అనడంతో, కృష్ణుడు శిరస్సు ఛేధించి పూర్తి యుద్ధానికి సాక్షిగా ఉండమని కోరాడట. అంతా అమ్మదే విజయం అనిచెప్పాడు.

శ్రీ లలిత కృపలేనిదే బ్రహ్మ విష్ణు మహేశులు సృష్టిస్థితి లయలు చేయలేరు. అగ్ని కాల్చలేదు, నీరు తడుపలేదు, లోకాలు స్థంబించిపోతాయి.

పంచార్ణరవ విద్య, కాది విద్య, షట్కోణ పూజిత, నవార్ణపూజిత, మహోన్న విద్యాధికురాలు అమ్మమాటాడితేనే కచ్ఛపి సరస్వతి దేవి వీణ సిగ్గు పడిందట. అంతటి మృధు మధుర స్వరమాధుర్య మమతా అనురాగ ప్రేమామృతమూర్తి. సర్వ బీజాక్షర సంయమని. సర్వము అతి రహస్యమహారహస్య తీవ్ర రహస్యాదిరహస్య శ్రీ లలిత. సర్వకళాకోవిద. అమ్మ శ్రీ లలిత లాలితము లయ బద్ధ లయకారిణి, సౌందర్యానికి సౌందర్యమైన అమ్మ, మూర్తీభవించిన మోహన మనోహరమూర్తి. సర్వము మధురమునకే మాధుర్యము, ఆనందమునకే పరానందము పరాదేవత సదా కొలిచి మనసావాచా కర్మణా అమ్మ శరణాగతియే ఇహ పరదాయక కైవల్య ప్రదాయిని. సర్వులకు అమ్మయే శ్రీరామరక్ష! అమ్మ చతుష్షష్ఠి కళాప్రపూర్ణరాలు సర్వ విద్యా "మంత్రతంత్రయంత్రాదుల" శ్రీ చక్రమే మహామాయ.

ప్రేమతో భక్తి వినయముతో శరణాగతి, పాదసేవతో మాత్రమే అమ్మను చేరుకోగలరు. సర్వము తానే సర్వ జగత్తులనిండి యున్నది. జగదీశ్వరి, జగన్మోహిని జగదైక మహాసౌందర్య రాశి, జగాల ఊయలాడించే ప్రేమామృత వాహిని, శ్రీ లలితా పరాభట్టారికా!

పూజ్యులు మహనీయులు శ్రీ హయగ్రీవుల వారికి నమస్కారములు, వశిన్యాది దేవతలగు మానవులకు అందించిన సరిసాటే లేని అపూర్వ అమ్మ చింతామణులు అందించిన మీకు నమస్కారములు. అగస్త్య మహాముని లోపాముద్రలకు నమస్కారము. మూడు వందల సంవత్సరములు హయగ్రీవులను సేవించి శ్రీ లలితమ్మ చేతనే మహాభక్తుడనిపించుకొన్న మీ సహనానికి హయగ్రీవుల వారికి శ్రీ లలిత కృపకు భూలోక వాసులకు "అందించిన" మహనీయులకు నమస్కారములు. ప్రకృతి పురుషులైన ఆది దంపతులకు, శ్రీ లక్ష్మీదేవి సమేత విష్ణుమూర్తికి, శ్రీ సరస్వతి దేవి సహిత బ్రహ్మ దేవునకు అనేక నమస్కారములు. హనుమన్న, గణపన్న, కుమార అయ్యప్ప అనుజులకు నమస్కారములు. భూమి ఆకాశము, పంచభూతాలు, అష్టదిక్పాలకులకు, నవగ్రహ దేవతలకు, సప్తసముద్రాలకు, భూదేవికి, పదునాలుగు భువన వాసులకు నమస్కారము. చిన్ననాటి నుండి అమ్మ పార్వతి దేవికి పరమేశ్వరునకు నమస్కారము. ఇప్పుడు దుఃఖపడుతూ ఉంటే అమ్మ శ్రీ లలితా పరమేశ్వరి చూపించే అవ్యాజకరుణకు, అనేక కోట్లాది నమస్కారములు. అమ్మ ఏడుమార్లు భూలోకానికి వెళ్ళాలంటే 1. మొదట శ్రీ గోదాదేవి శ్రీ రంగ నాథుల కల్యాణ సమయం, శ్రీ వెల్లి పుత్తూరు గోదా ప్రక్కనే శ్రీహారిక నాపేరు 7 సం॥ములు ఉన్నాను. అన్నపేరు శ్రీహరి. 2. సీతారామ కల్యాణ సమయం, పేరు రాము తులసి 6 సం॥లు. 3. రాధా కృష్ణులు బృందావనం. పేరు

వంశీరవళి. 4. తిరుపతి శ్రీనివాస కల్యాణం. మంగతాయారు నాపేరు, అన్న పే
నరసింహాచారి, 5 సం॥లు 5. శ్రీ రామ కృష్ణ పరమహంస గురువు దక్షిణేశ్వరం. పే
నారాయణ 16 సం॥లు . 6. శిరిడి బాబా దగ్గర కమలామయి పేరు 32 సం॥లు
కామేశ్వరి భర్తపేరు శ్రీ ఎమ్. బి. వి. రావుగారు, శైలజ, అరుణ, ఫణి పురుషోత్తం, ఆ
పిల్లలకు పెళ్ళి కాకముందే మార్గశిర పౌర్ణమి రోజు 1990 సం॥ము శ్రీ లలితా దే
ప్రతిష్ఠ ఆ తల్లి సూచించిన నిలయం "ఉమామహేశ నిలయం" పేరు. ఆ తల్లి
చూసుకుంటూ చింతామణిద్వీపం చేరే శుభఘడియకే నా నిరీక్షణ.

శ్రీమాన్ గూడా బాలం భొట్లుగారు, ప్రేమకుమారి తల్లిదండ్రులు. కామేశ్వ
గురుమూర్తి, పురుషోత్తం, రాజేశ్వరి, రాధ మేము అయిదుగురు సంతానం. ఈ భ
జ్ఞానవైరాగ్యాలు మా తండ్రిగారు, మా అమ్మగారు తపస్సు చేసే సమయంలో అండ
ఉండి అన్నీ ఇక చూసుకొన్నారు. ఇరువది నాలుగ సం॥ములు అనారోగ్యంతో బాధప
శ్రీ లలిత దయవల్ల కోలుకున్నారు. అలాగే శ్రీ లలితా ప్రతిష్ఠకు, మా పిన తండ్రిగా
శ్రీ రామారావుగారు లక్ష్మిగారు, అయితే గూడా వారి కుటుంబంలో ఆరుగు
పినతండ్రులు పినతల్లుల ప్రేమకు కొరత లేదు. మరది శర్మ జ్యోతి, ఆడపడు
ఆనందం, శ్రీరామంగారు, వారి సంతానం ప్రేమగానే ఉంటారు. కృష్ణ నీలిమ సదా
లలితా దాసాను దాసురాలై అమ్మపాద పద్మాలు ఇక ఈ జన్మలో చేరుకొనుటే లక్ష్యమ
శ్రీమాన్ మురుకుట్ల పురుషోత్తం, మరుకుట్ల లక్ష్మి సోదెమ్మగారి పెద్ద కోడలిని.
జన్మలో గర్భవాసాన పుట్టిన వారు శైలజ, అరుణ, ఫణి పురుషోత్తం.

కొడుకులాంటి పెద్ద అల్లుడు, ఎస్. శ్రీధర్, చిన్న అల్లుడు ఇ. వి. అజయ్ సింహ
లలిత ఇచ్చిన వారలు వారిని కన్న తల్లి తండ్రులకు మనః పూర్వక కృతజ్ఞతలు. శ్రీ
పుత్తూరు, తిరుపతి, ఈ జన్మ మూడు జన్మలను ఒకే తల్లి దండ్రుల గర్భా
పుడుతున్నాను. అమ్మ కృష్ణభక్తి, నానన్నగారి శివభక్తి ఇరువురి లలితా భక్తి మాకు ఊ
తెలిసే నాటికే భగవంతుని పాటలు వినిపించేవి. మా నాయనమ్మగారు 'గూ
కామేశ్వరి', 'గూడా గురుమూర్తిగారు', 'రామభక్తి నాయనమ్మ', 'తాతగార
భగవత్‌గీత కృష్ణ భక్తులు'. గూడా గూరుమూర్తిగారి తండ్రిగారు గూడా బా
భొట్లుగారు శ్రీ లలితా భక్తులు. భగవత్ ఆదేశానుసారం గూడావారి ఆడపడుచు
మురుకుట్లవారి కోడలినయ్యాను. అమ్మ నాన్నగారి సంపూర్ణ భక్తి రూపమే ఈ
లలితా ఆత్మ!

# విషయసూచిక

# శ్రీ లలితా చింతామణి ద్వీప మహా అతి రహస్య నాట్యాలు
# కృష్ణనీలిమ

## గణేశ స్తుతి

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వ విఘ్నోపశాంతయే
వక్రతుండం! మహాకాయ! సూర్యకోటి సమప్రభ!
అవిఘ్నం కురు మే దేవ! సర్వకార్యేషు సర్వదా.

అంకము జేరి శైలతనయాస్తన దుగ్ధము లానువేళ 'బా
ల్యాంక' విచేష్ట దొండమున "నావలించన్" గబళింపబోయి, యా
వంక కుచంబుగాన కరివల్లభహారము గాంచి నే మృణా
ళాంకురశంక నంటెడు గజాస్యుని గొల్తు నభీష్టసిద్ధకిన్.

తొండము నేకదంతమును, తోరపు బొజ్జయు, వామహస్తమున్
మెండుగ మ్రోయు గజ్జెలును, చల్లని చూపులు, మందహాసమున్
కొండొక గుజ్జురూపమున కోరిన విద్యలకెల్ల నొజ్జవై
యుండెడి పార్వతీ తనయా! యోయి గణాధిప! నీకు మ్రొక్కెదన్.

గజాననం భూతగణాధి సేవితం
కపిత్థ జంబూ ఫలసార భక్షిణమ్,
ఉమాసుతం శోకవినాశకారణం
నమామి విఘ్నేశ్వర పాదపంకజమ్.

## సరస్వతి స్తుతి

సరస్వతి! నమస్తుభ్యం వరదే! కామరూపిణి!
విద్యారంభం కరిష్యామి సిద్ధిర్భవతు మే సదా
పాశాంకుశధరా వాణీ వీణా పుస్తకధారిణీ,
మమ వక్త్రే వస్త్రేన్నిత్యం ముగ్ధకుందేందు నిర్మలా
శారదా శారదాంబోజవదనా వదనాంబుజే,
సర్వదా సర్వదాఽస్మాకం సన్నిధి స్సన్నిధిం క్రియాత్
యా కుదేందు తుషారహార ధవళా యా శుభ్రవస్త్రాన్వితా
యా వీణా వరదండమండితకరా యా శ్వేతపద్మాసనా
యా బ్రహ్మాచ్యుత శంకరప్రభృతిభిః దేవైః సదా పూజితా
సా మాం ఆతు సరస్వతీ భగవతీ నిశ్శేషజాడ్యాపహా
తల్లీ! నినుదలంచి పుస్తకము చేతన్ బూనితన్ నీవు నా
యుల్లంబందున నిల్చి జృంభణముగా నుక్తల్ సుశబ్దంబు శో
భిల్లన్ బల్కుము నాదు వాక్కునను సంప్రీతిన్ జగన్మోహినీ!
పుల్లాబ్జాక్షి! సరస్వతీ! భగవతీ! పూర్ణేందు బింబాననా!
వర్ణానా మర్థసంఘానాం రసానాం ఛందసామపి,
మంగళానాం చ కర్తారౌ వందే వాణీ వినాయకౌ.

## హయగ్రీవస్తుతి

జ్ఞానానందమయం దేవం నిర్మల స్ఫటికాకృతిమ్
ఆధారం సర్వ విద్యానాం హయగ్రీవ ముపాస్మహే.
హాయగ్రీవ! హాయగ్రీవ! హాయగ్రీవేతి యో వదేత్
తస్య నిస్సరతే వాణీ జహ్నుకన్యాప్రవాహవత్.

## బాలస్తుతి

అయి, ఆనందవల్లీ, అమృతకరతలీ, ఆదిశక్తీ పరాయీ వ
మాయాస్వరూపీ, స్ఫటిక మణిమయీ, మామతంగీషడంగీ, జ్ఞానీ, జ్ఞానస్వ
నలినపరిమళీ నాద ఓంకార యోగీ యోగీ యోగాసనస్థా, భువన వశకరీ సౌ
ఐం నమస్తే. బాలా, మన్త్రేకటాక్షీ, మమహృదయసఖీ ముక్తాభావ ప్రచండీ,
యజ్ఞోపవీతీ, వికటకటితటీ, వీరశక్తీ ప్రసాదీ, బాలే, బాలేన్దుమౌలే మదగజ
హస్తాభిషేక్త్రీ స్వతన్త్రీ కాలీ త్వాం, కాలరూపీ ఖగగలన హృదీ కారణీ క్లీం న
మూలాధారే మహిమ్నీ, హుత హనయనీ మూలమన్త్రీ, త్రినేత్రీ, హా
కేయూరవల్లీ, అఖిలసుఖకరీ, అమ్బికాయాః, శివాయా, వేదవేదాన్త రూపీ,
ఘనతటీ, వీరతన్త్రీ, భవానీ, శౌరీ, సంసారయోనీ, సకల గుణమయీ తే
శ్రీం సౌః నమస్తే. ఐం, క్లీం, సౌః సర్వమన్త్రే మమవరశుభకరీ, అంగనాచేష్టితా
శ్రీం, హ్రీం, క్లీం, బీజముఖ్యైః దినకరకిరణైః జ్యోతిరూపే, శివాఖ్యే హ్రాం,
హ్రూం, హేమవర్ణే హిమకరకిరణా బాసమానేన్దు చూడే క్షాం, క్షీం, క్షూం, క్షామ
సకల జయకరీ శక్తిబాలే, నమస్తే

## పంచదశీ మన్త్రం

కఏ ఈల హ్రీం - హ స క హల హ్రీం - సకల హ్రీం

గమనిక: ఏ మంత్రాన్నైనా నా గురుముఖతః నేర్చుకోవాలి

1. ఓం ఐం హ్రీం శ్రీం త్రైలోక్య మోహన చక్రస్వామిన్యైనమః
2. ఓం ఐం హ్రీం శ్రీం సర్వాశా పరిపూరక చక్రస్వామిన్యై నమః
3. ఓం ఐం హ్రీం శ్రీం సర్వసంక్షోభణ చక్రస్వామిన్యై నమః
4. ఓం ఐం హ్రీం శ్రీం సర్వసౌభాగ్యదాయక చక్రస్వామిన్యై నమః
5. ఓం ఐం హ్రీం శ్రీం సర్వార్థసాధక చక్రస్వామిన్యై నమః
6. ఓం ఐం హ్రీం శ్రీం సర్వరక్షాకర చక్రస్వామిన్యై నమః
7. ఓం ఐం హ్రీం శ్రీం సర్వరోగహర చక్రస్వామిన్యై నమః
8. ఓం ఐం హ్రీం శ్రీం సర్వసిద్ధి ప్రద చక్రస్వామిన్యై నమః
9. ఓం ఐం హ్రీం శ్రీం సర్వానందమయ చక్రస్వామిన్యై నమః

# నవరత్న మాలికా స్తోత్రమ్

శ్లో॥ హార నూపుర కిరీట కుండల విభూషితావయవ శోభినీం
కారణేశ వరమౌళికోటి పరికల్ప్యమాన పదపీఠికాం ।
కాలకాల ఫణిపాశ బాణ ధనురంకుశా మరుణ మేఖలాం
ఫాల భూతికలోచనాం మనసి భావయామి పరదేవతాం.

శ్లో. గంధసార ఘనసార చారు నవ నాగవల్లి రసవాసినీం
సాంధ్యరాగ మధురాధరాభరణ సుందరానన శుచిస్మితాం ।
మంధరాయత విలోచనా మమలబాల చంద్రకృత శేఖరీ ।
మిందిరా రమణ సోదరీం మనసి భావయామి పరదేవతాం.

శ్లో॥ స్మేర చారుముఖ మండలాం విమలగండలంభిమణి కుండలాం
హారదామ పరిశోభమాన కుచభార భీరుతనుమధ్యమాం!
వీర గర్వహర నూపురాం వివిధకారణేశ వరపీఠికాం
మారవైరి సహచారిణీం మనసి భావయామి పరదేవతాం.

శ్లో॥ భూరిభార ధరకుండలీంద్ర మణిబద్ధ భూవలయ పీఠికాం
వారిరాశి మణిమేఖలావలయ వహ్ని మండల శరీరిణీం !
వారిసారవహ కుండలాం గగన శేఖరీం చ పరమాత్మికాం
చారుచంద్ర రవిలోచనాం మనసి భావయామి పరదేవతాం!

శ్లో॥ కుండల త్రివిధకోటి మండల విహార షడ్దళ సముల్లసత్
పుండరీక ముఖభేదినీం తరుణచండభాను తడిదుజ్జ్వలాం
మండలేందు పరివాహితామృత తరంగిణీ మరుణ రూపిణీం
మండలాంత మణిదీపికాం మనసి భావయామి పరదేవతాం.

శ్లో॥ వారణానన మయూర వాహముఖ దాహవారణ పయోధరాం ।
చారణాది సురసుందరీ చికుర శేఖరీకృత పదాంబుజాం
కారణాధిపతి పంచక ప్రకబుతి కారణ ప్రథమ మాతృకాం
వారణాంత సుఖపారణాం మనసి భావయామి పరదేవతాం.

శ్లో॥ పద్మకాంతి పదపాణిపల్లవ పయోధరానన సరోరుహాం
పద్మరాగ మణిమేఖలా వలయనీ విశోభిత నితంబినీం
పద్మసంభవ సదాశివాంతమయ పంచరత్న పదపీఠికాం
పద్మినీం ప్రణవ రూపిణీంమనసి భావయామి పరదేవతాం.

శ్లో॥ ఆగమ ప్రణవపీఠికా మమల వర్ణ మంగళ శరీరిణీం
ఆగమావయవ శోభినీ మఖిలవేద సారకబుుత శేఖరీం
మూలమంత్ర ముఖ మండలాం ముదితనాద బిందు నవయౌవనాం
మాతృకాం త్రిపురసుందరీం మనసి భావయామి పరదేవతాం.

శ్లో॥ కాలికా తిమిర కుంతలాంత ఘన భృంగ మంగళ విరాజినీం
చూళికా శిఖర మాలికా వలయ మల్లికా సురభి సౌరభాం
కాళికా మధుర గండమండల మనోహరానన సరోరుహాం
కాళికా ముఖిల నాయికాం మనసి భావయామి పరదేవతాం.

శ్లో॥ నిత్యమేవ నియమేన జల్పతాం భుక్తి ముక్తి ఫలదా మభీష్టదాం
శంకరేణ రచితాం సదా జపేత్ నామరత్న నవరత్న మాలికామ్.

## అష్టాదశ శక్తిపీఠ స్తోత్రములు

లంకాయాం శాంకరీదేవి, కామాక్షీ కంచికాపురి!
ప్రద్యుమ్నే శృంగళాదేవి, చాముండి క్రమంచ పట్టణే!
అలంపురీ జోగులాంబా, శ్రీశైలేభ్రమరాంబికా!
కొల్హాపురీ మహాలక్ష్మి, మహుర్యే ఏకవీరికా!
ఉజ్జయిన్యాం మహాకళీ, పీఠికామాం పురుహూతికా!
ఓఢ్యాయాం గిరిజాదేవీ, మాణిక్యే ద్రాక్షవాటికా!
హరిక్షేత్రే కామరూపీ, ప్రయాగే మాధవేశ్వరీ!
జ్వాలాయాం వైష్ణవీదేవీ, గయా మాంగళ్యగౌరికా
వారణాశీ విశాలాక్షీ కాశ్మీరేయ సరస్వతీ
అష్టాదశ పీఠాని యోగినా మతి దుర్లభం!
సాయంకాలే పఠేన్నిత్యం, సర్వశత్రువినాశనం!
సర్వ దివయహరం రోగం సర్వ సంపత్కరం శుభం!!

# శ్రీ లలితా ప్రాతః స్మరణ స్తోత్రమ్

## మేలుకొలుపు

ప్రాత స్స్మరామి లలితా వదనారవిందం,
బింబాధరం పృథుల మౌక్తిక శోభినాసమ్,
అకర్ణ దీర్ఘ నయనం మణికుండలాఢ్యం,
మందస్మితం మృగమదోజ్జ్వల ఫాలదేశమ్॥ 1

ప్రాత ర్భజామి లలితా భుజకల్పవల్లీం,
రత్నాంగుళీయ లసదంగుళి పల్లవాఢ్యామ్,
మాణిక్య హేమవలయాంగద శోభమానం,
పుండ్రేక్షు చాపకుసుమేషు సృణీర్దధానామ్॥ 2

ప్రాతరత్నమామి లలితా చరణారవిందం,
భక్తేష్ట దాననిరతం భవసింధుపోతమ్
పద్మాసనాది సురనాయక పూజనీయం,
పద్మాంకుశ ధ్వజ సుదర్శన లాంచనాఢ్యమ్॥ 3

ప్రాతస్తువే పరశివాం లలితాం భవానీం,
త్రయ్యంతవేద్య విభావం కరుణా నవద్యామ్,
విశ్వస్యసృష్టి విల స్థితి హేతుభూతం,
విద్యేశ్వరీం నిగమ వాఙ్మనసాఽతిదూరామ్॥ 4

ప్రాత ర్వదామి లలితే తవ పుణ్యనామ,
కామేశ్వరీతి కమలేతి మహేశ్వరీతి,
శ్రీ శాంభవీతి జగతాం జననీ పరే,
వాగ్దేవతేతి వచసా త్రిపురేశ్వరీతి॥ 5

యఃశ్లోకపంచక మిదం లలితాంబికాయాః
సౌభాగ్యదం సులలితం పఠతి ప్రభాతే,
తస్మై దదాతి లలితా ఝుటితి ప్రసన్నా,
విద్యాం శ్రియం విమలసౌఖ్య మనంతకీర్తిమ్॥ 6

# శ్రీ లలితా చింతామణులు
# శ్రీ లలితా మేలుకొలుపు - అర్థం

1. ప్రభాత సమయంలో శ్రీ లలితా నీ ముఖ పద్మమే,
నీ అరుణ అధరాలపై రతనాల నత్తు బేసరి అడ్డబాస,
నీ సుదీర్ఘ సోగకన్నుల సోగలు, కర్ణరతనాల కుండలాలు,
చిరునగవుతో, వంపులు తిరిగిన కనుబొమల మంగళ తోరణాలు,
నీ పాల భాగాన కస్తూరి గంధ సహిత తిలకముద్రే చూడాలి.

2. ప్రభాతాన నిన్నే మాతా, మహారాజ్ఞీ అని కీర్తిస్తూభుజరత్న కేస
రులనే చూడాలి, లలితా మహారాజ్ఞి
నీ మృదు హస్తాల రతనాల గాజుల, మురిడీ గొలుసులకు
రతనాల ముద్రతో ఉంగరాల అభయహస్తమే చూడాలి,
నీ కంఠాన చింతామణి పతక మేలిమి ముత్యాల, రతనాల
హారాల ధగద్ధగలే చూడాలి,
నీ ముందు వామ హస్తాన పంచభూతాల పంచ పుష్పశస్త్ర పాది
దక్షిణ హస్తాన ఎఱ్ఱని చెఱకు విల్లు చూడాలి

3. ప్రభాతాన శ్రీ లలితా నీ పాదపసుపు పారాణి రతనాల మంజీర
గొలుసుల జాలు వారే నీ పాద పద్మాలే చూడాలి
నీ భక్తుల కోసమే ఎల్లవేళల నీ హస్తాలలో సింధూర సిరి
నిచ్చేందుకు సిద్ధ హస్తివై
బ్రహ్మ విష్ణు దేవతలనేకుల పాద పద్మాల పూజించు టకు వస్తారు
నీ పద్మ హస్త వెనుక కుడివైపున అంకుశం, ఎడమ భాగాన పాశం
ధరించిన నీకు సుదర్శన రతనాల ఛత్రము పడతారు.

4. ప్రభాతాన పరదేవతా లలితా కామేశ్వరుని సతి
వేదే వేదాంగాలతో వైభవంగా కరుణామృతం కురిపిస్తూ
విశ్వాల సృష్టి విశ్వాలయ కారణా పరాదేవతామ్
ఆగమ వేద కోట్లాను కోట్ల మంత్ర తంత్ర యంత్ర యాగ
యోగం భోగం భాగ్యం సర్వ సకల విద్యాధరీ

5. ప్రభాతాన నిన్నే కీర్తిస్తూ లలితా నీ పుణ్య నామమే
కామేశ్వర సతీ పద్మముఖీ మహేశ్వరీ
శ్రీ శాంభవీ, జగాలకంతటికి జననీ పరదేవతా
సరస్వతి లక్ష్మీదేవి వింజామరలతో, నిన్నే పూజిస్తూంటారమ్మా
త్రిపురేశ్వరీ

(ప్రశాంతంగా ఇంట్లో నిద్రలేచి మనస్సులో ఈ శ్లోకాలను శ్రీ లలితాంబను స్మరి దీర్ఘ సుమంగళీ సౌభాగ్యం సుందరమైన శ్లోకాలు చదివితే ప్రొద్దున్నే శ్రీ లలిత కరుణ ప్రసన్నం విద్యా, దేవదీవెనలు సర్వ ఇహపరానందాలు లభిస్తాయి).

# శ్రీ రాజరాజేశ్వరీ పూజా విధానమ్

ఓం కేశవాయస్వాహా । ఓం నారాయణాయ స్వాహా। ఓం మాధవాయ స్వాహా ఓం గోవిందాయ నమః । ఓం విష్ణవే నమః । ఓం మధుసూదనాయ నమః । ఓం త్రివిక్రమాయ నమః । ఓం వామనాయ నమః । ఓం శ్రీధరాయ నమః । ఓం హృషీకేశాయ నమః। ఓం పద్మనాభాయ నమః। ఓం దామోదరాయ నమః। ఓం సంకర్షణాయ నమః। ఓం వాసుదేవాయ నమః। ఓం ప్రద్యుమ్నాయనమః। ఓం అనిరుద్ధాయ నమః। ఓం పురుషోత్తమాయ నమః। ఓం జనార్ధనాయ నమః। ఓం ఉపేంద్రాయ నమః। ఓం హరయే నమః। ఓం శ్రీకృష్ణాయ నమః।

ఆగమార్థంతు దేవానాం గమనార్థంతు రక్షసాం కుర్యాత్ ఘంటారవం తత్ర దేవ్యాగమన కాంక్షయా। అపసర్పంతు ఏభూతా ఏభూతాభూమి సంస్థితాః ఏభూతా విఘ్న కర్తారః తే నశ్యంతు శివాజ్ఞయా । అపక్రమంతు భూతాద్యాః పిశాచాః సర్వతోదిశి ఏతేషా మవిరోధేన పూజకర్మ సమారభే।

ఇత్తిష్ఠంతు భూతపిశాచా ః ఏతే భూమి భారకా ః। ఏతేషా మవిరోధేన పూజాకర్మ సమారభే ॥ ఓం భూం ః ఓం భువః ఓగ్ం సువః ఓం మహః ఓం జనః ఓం తపః ఓగ్ం సత్యం ఓం తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి ధియోయోనః ప్రచోదయాత్। ఓ మాపో జ్యోతి రసోఽమృతం బ్రహ్మ భూర్భువస్సువరోం, మమ

ఉపాత్త దురితక్షయద్వారా శ్రీ పరమేశ్వరీ ప్రీత్యర్థం శుభే శోభనే ముహూర్తే శ్రీ మహావిష్ణోరాజ్ఞయా ప్రవర్తమానస్య అద్య బ్రహ్మణః ద్వితీయ పరార్థే శ్వేత వరాహకల్పే వైవస్వత మన్వంతరే కలియుగే ప్రథమ పాదే జంబూ ద్వీపే భరతవర్షే భరతఖండే అస్మిన్ వర్తమాన వ్యావహారిక చాంద్రమానేన .............. సంవత్సరే .......... ఆయనే .............. ఋతౌ............ మాసే ............ పక్షే .......తిథౌ ......... వాసరే, శుభ నక్షత్రే శుభయోగే శుభకరణ ఏవం గుణ విశేషణ విశిష్టాయాం శుభతిథౌ శ్రీమాన్......... గోత్రః..... నామధేయః ధర్మపత్నీ సమేతః శ్రీమతః గోత్రస్య..... నామధేయస్య ధర్మపత్నీ సమేతస్య సర్వాభీష్టసిద్ధ్యర్థం శ్రీ రాజరాజేశ్వరీ పరదేవతా ముద్దిశ్య శ్రీ రాజరాజేశ్వరీ పరదేవతా ప్రీత్యర్థం శ్రీ సూక్త విధానేన యావచ్ఛక్తి శ్రీ రాజరాజేశ్వరీ పరదేవతా పూజాం కరిష్యే.

కలశస్య ఆధారం కల్పయిత్వా॥ ఆధారే అగ్నికళాం యజేత్। ఐం అగ్నిమండలాయ ధర్మ ప్రద దశకళాత్మనే స్వదక్షిణ కలశాధారాయై నమః యం ధూమ్రకళాయై నమః రం ఊష్మాకళాయై నమః, లం జ్వలినీకళాయై నమః, వం జ్వాలినీ కళాయైనమః, శం విస్ఫులింగి నీకళాయై నమః, షం సుశ్రీకళాయై నమః సం సురూపాకళాయై నమః, హం కపిలా కళాయై నమః, ళం హవ్యవాహ కళాయై నమః, క్షం కవ్యవాహకళాయై నమః. ఆధారే కలశం సంస్థాప్య కలశే సూర్యకళాం యజేత్॥ కంభం తపినీ కళాయై నమః, ఖం బం తాపినీ కళాయై నమః, గం ఫం ధూమ్రాకళాయై నమః, ఘం పం మరీచీ కళాయై నమః, ఙం నం జ్వాలినీకళాయై నమః, చం ధం రుచికళాయై నమః, చం దం షుషుమ్నా కళాయై నమః, జం థం భోగ దాకళాయై నమః, ఛం దం సుషుమ్నా కళాయై నమః, జం థం భోగదాకళాయై నమః, ఝం తం విశ్వాకళాయై నమః, ఞం నం బోధినీ కళాయై నమః, టం ఢం ధారుణీ కళాయై నమః, ఠం డం క్షమా కళాయైనమః జలమాపూర్య కల గంధపుష్పాక్షతైరభ్యర్చ్య - కలసశ్య ముఖే విష్ణుః కంఠేరుద్రః సమాశ్రితాః మూలేత త్రస్థితో బ్రహ్మ మధేయ మాతృగణాస్మృతాః కుక్షౌతు సాగరాస్సర్వే స్సప్తద్వీపా వసుంధరా ఋగ్వేధోఽథ యజుర్వేదః సామేవదశ హ్యథర్వణః అంగైశ్చసహితాః సర్వే కలశాంబుసమాశ్రితాః ఆ కలశేషుధావతి పవిత్రే పరిషించ్య ఉక్థైర్యజ్ఞేషు వర్ధతే క్రోం ఆకాశాదం కుశముద్రయా సర్వతీర్థాన్యాకృష్య ఓం

క్షిప్రస్వాహా గరుడముద్రయా నిర్విషీ కృత్య వంధేనుముద్రయా అమృతీకృత్య సోమకళాం యజేత్ సౌః సోమమండలాయ కామప్రద షోడశకళాత్మనే స్వదక్షిణకలశామృతాయ నమః అం అమృతా కళాయై నమః ఆం మానదా కళాయై నమః ఇం పూషాకళాయైనమః ఈం తుష్టికళాయై నమః ఉం పుష్టికళాయై నమః ఊం మతికళాయైనమః ఋం ధృతికళాయైనమః ౠం శశినీకళాయై నమః ఒం చంద్రికా కళాయై నమః ఒం కాంతికళాయైనమః ఏం జ్యోత్స్నా కళాయై నమః ఐం శ్రీ కళాయై నమః ఓం ప్రీతికళాయై నమః ఔం అంగదాకళాయై నమః అం పూర్ణాకళాయైనమః అః పూర్ణామృత కళాయైనమః హస్తే నాచ్ఛాద్య ఆపోవా యిదగ్ం సర్వం విశ్వా భూతాన్యాపః ప్రాణావా ఆపః పశవః అపోన్నమాపః అమృత మాపః సమ్రాడాపో విరాడాపః స్వరాడాపః ఛందాగు ష్యాపోజ్యోతీగ్‌ష్యాపః యజూగ్‌ష్యాపఃస్తమాపః సర్వాదేవితా ఆపోభూర్భు వస్సువరాపః ఓమ్ గంగేచ యమునేచైవ గోదావరి సరస్వతీ నర్మదే సింధుకావేరి జలేస్మిన్ సన్నిధిం కురు- ఓం నమోభగవతే అశేషతీర్థాలవాలే శివజటాధిరూఢే గంగే గంగాంబికే స్వాహా! ఆయాంతు శ్రీ రాజరాజేశ్వరీ పూజార్థం దురితక్షయకారకాః కలశోదకేన దేవీ మాత్మాసం పూజాద్రవ్యాణి సంప్రోక్ష్య తతః పీఠార్చనం కుర్యాత్. ఓం ఓడ్యాణపీఠం పూజయామి ఓడ్యాణ పీఠోపనాథం పూజయామి ఓడ్యాణ పీఠాంబా శ్రీ పాదుకాం పూజయామి ఆగ్నేయే మాతృకా పీఠం పూజయామి మాతృకాపీఠోప నాథం పూజయామి మాతృకాపీఠాంబా శ్రీ పాదుకాం పూజయామి దక్షిణే జాలంధరీ పీఠం పూజయామి జలాంధరీ పీఠోపనాథం పూజయామి జాలంధరీ పీటాంభా శ్రీ పాదుకాం పూజయామి నైఋతే కొల్హాపూరి పీఠాంబా శ్రీపాదుకాం పూజయామి పశ్చిమే పూర్ణగిరి పీఠం పూజయామి పూర్ణగిరి పీఠోపనాథం పూజయామి పూర్ణగిరి పీఠాంబా శ్రీపాదుకాం పూజయామి వాయవ్యే సంహారపీఠం పూజయామి సంహార పీఠోపనాథం పూజయామి సంహార పీఠాంబా శ్రీపాదుకాం పూజయామి ఉత్తరే కైలాసపీఠం పూజయామి కైలాసపీఠోపనాథం పూజయామి కైలాస పీఠాంబా శ్రీ పాదుకాం పూజయామి ఈశాన్యే కామకోటిపీఠం పూజయామి కామకోటి పీఠోపనాథం పూజయామి కామకోటి పీఠాంబా శ్రీ పాదుకాం పూజయామి ఓం ఐం హ్రీం శ్రీం అగ్ని ముఖ భేతాళం పూజయామి. ఓం ఐం హ్రీం శ్రీం ప్రేతవాహన బేతాళం పూజయామి: ఓం ఐం హ్రీం శ్రీం బ్రాహ్మీం పూజయామి ఓం ఐం హ్రీం

శ్రీం మహేశ్వరీం పూజయామి ఓం ఐం హ్రీం శ్రీం హౌమారీం పూజయామి ఓం ఐం హ్రీం శ్రీం వైష్ణవీం పూజయామి ఓం ఐం హ్రీం శ్రీం వారాహీం పూజయామి ఓం ఐం హ్రీం శ్రీం ఇంద్రాణీం పూజయామి ఓం ఐం హ్రీం శ్రీం చాముండాం పూజయామి ఓం ఐం హ్రీం శ్రీం చండికాం పూజయామి ఓం ఐం హ్రీం శ్రీం అసితాంగ భైరవం పూజయామి ఓం ఐం హ్రీం శ్రీం రురుభైరవం పూజయామి ఓం ఐం హ్రీం శ్రీం క్రోధనభైరవం పూజయామి ఓం ఐం హ్రీం శ్రీం ఉన్మత్త భైరవం పూజయామి ఓం ఐం హ్రీం శ్రీం కపాల భైరవం పూజయామి ఓం ఐం హ్రీం శ్రీం భీషణ భైరవం పూజయామి ఓం ఐం హ్రీం శ్రీం చంఢభైరవం పూజయామి ఓం ఐం హ్రీం శ్రీం మార్తాండ భైరవం పూజయామి ఓం ఐం హ్రీం శ్రీం ఇంద్రం పూజయామి ఓం ఐం హ్రీం శ్రీం అగ్నిం పూజయామి ఓం ఐం హ్రీం శ్రీం యమం పూజయామి ఓం ఐం హ్రీం శ్రీం నిర్ఋుతి పూజయామి ఓం ఐం హ్రీం శ్రీం వరుణం పూజయామి ఓం ఐం హ్రీం శ్రీం వాయువ్యం పూజయామి ఓం ఐం హ్రీం శ్రీంకుబేరం పూజయామి ఓం ఐం హ్రీం శ్రీం ఈశానం పూజయామి ఓం ఐం హ్రీం శ్రీం గురుం పూజయామి ఓం ఐం హ్రీం శ్రీం గణేశం పూజయామి ఓం ఐం హ్రీం శ్రీం శివం పూజయామి ఓం ఐం హ్రీం శ్రీం హరిం పూజయామి ఓం ఐం హ్రీం శ్రీం బ్రహ్మణం పూజయామి ఓం ఐం హ్రీం శ్రీం గౌరీసహితం శివం పూజయామి ఓం ఐం హ్రీం శ్రీం లక్ష్మీ సహితం విష్ణుం పూజయామి ఓం ఐం హ్రీం శ్రీంసరస్వతీ సహితం సుబ్రహ్మణం పూజయామి తతః పీఠార్చనం కుర్యాత్. ఓం ఐం హ్రీం శ్రీం కాలాగ్ని రుద్రాయ నమః ఓం ఐం హ్రీం శ్రీం మండూకాయనమః ఓం ఐం హ్రీం శ్రీం కూర్మాయనంః ఓం ఐం హ్రీం శ్రీం వరాహాయనమః ఓం ఐం హ్రీం శ్రీం దిగ్గజేభ్యోనమః ఓం ఐం హ్రీం శ్రీం కల్పవృక్ష వాటికాయ నమః ఏవం పీఠపూజాం కృత్వాదేవ్యాః పుష్పాంజలి దద్యాత్.

## ధ్యానం

యావిద్యా శివకేశవాది జననీ యావై జగన్మోహినీ, యా బ్రహ్మాది పిపీలికాంత జగదానందైక సంధాయినీ, యాపంచ ప్రణవద్వి రేఫనళినీ, యాచిత్కలామాలినీ సా పాయా త్పరదేవతా భగవతీ శ్రీ రాజరాజేశ్వరీ!!

శ్రీ రాజరాజేశ్వరీ పరదేవతాయై నమః ధ్యాయామి. హిరణ్య వర్ణాం హరిణీ సువర్ణరజత స్రజాం చంద్రాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మమావహ కరుణారస సంపూర్ణ మరుణాయతలోచనాం, చరణాబ్జాశ్రయే ద్భక్త్యాదే మావాహయామ్యహం, మహాపద్మవనాన్తస్థే కారణానన్ద విగ్రహే సర్వ భూతహి మాః యేహ్యేహి పరమేశ్వరి దేవేశి భక్తసులభే సర్వావరణ సంయుతే యావత్వా పూజయిష్యామి తావత్వాం సుస్థిరా భవ!

శ్రీ రాజరాజేశ్వరీ పరదేవతాయైనమః ఆవాహయామి,

తాం ఆవహ జాతవేదో లక్ష్మీ మనపగా మినీం యస్యాం హిరణ్యం విందేయ గామశ్వం పురుషానహం

ఏహిదేవి గృహాణేశి రత్న హింసాసనం శుభం

చంద్ర కాన్తమణి స్తంభం సౌవర్ణం సర్వసుందరం

శ్రీ రాజరాజేశ్వరీ పరదేవయైనమః ఆవాహయామి,

తాం ఆవహ జాతవేదో లక్ష్మీ మనపగామినీం యస్యాం హిరణ్యం విందేయం మశ్వం పురుషానహం

ఏహిదేవి గృహాణేశి రత్న సింహాసనం శుభం

చంద్రకాన్తమణిస్తంభం సౌవర్ణం సర్వసుందరం

# శ్రీ లలితా మానస పూజాస్తోత్రానికి భావార్థం

మాతా! ఆధిశక్తీ నిన్ను సేవించే సామర్థ్యం నాకు లేదు. నీ చరణకమలాల యంద భక్తిలేదు. పోనీ విషయాలయందు వైముఖ్యమూ లేదు. అలా అని ధ్యాన విషయంలో ఆసకిత ఉన్నదా అంటే అదీలేదు. వీటన్నిటినీ మనసా యోచిస్తూ రుచిరమై వచనాలతోనే నిన్ను అర్చిస్తూన్నాను. 1

సువర్ణ జలజంతువలతో నిండినదీ దేవ సంఘాలు యెక్కియున్న చిన్న చిన్న పడవలతో కలవరపడుతున్న మధ్య భాగం కలదీ, మణిమయ గిరుల

అలంకృతమైనదీ, ఉత్తుంగతరంగ పంక్తులచే వ్యాకులమైన ఆకాశం కలదీ యీషదరుణారుణమైన సాగరాన్ని ఓ చిత్తమా! పదే పదే చింతించి సార్థకమైన దానవుకమ్ము 2

అయ్యమృత సముద్రంలో బాసిల్లే రత్నజలాలనుండి రేగిన కిరణాలతో అంబర వీధిని ప్రకాశింపచేయుచు, సర్వేసర్వత్రా ఇంద్రధనుస్సులతో ఆచ్ఛాదిత మవుతూ, మహోన్నత గిరిశిఖరాలపై ఆసీనులైన దివ్యనారీ సమూహాల వదనాలనుండి బహిర్గతమవుతున్న గీతాలను ఆలకిస్తూ చలించకుండ వుండునట్టి హారిణ సమూహాలతో కూడిన – మణి ద్వీపానికి ప్రణమిల్లుతున్నాను. 3

ఆ మణిద్వీపాన నయనానంద ప్రదమైన నందనవనం ఉంది. ఆ సుందరోద్యానవనంలో జాజీ, సంపెంగ, గులాబీల పూలవాసనలు వ్యాపిస్తుంటాయి. హ్రీం కార నాదాలు గళసీమలో కల కోకిలల కుహూ కుహూ నాదాలతో మామిడిచెట్లు వికసిస్తూ ఉంటాయి. సుగంధ భరిత చందనవనాలతో, చంచలంగా చరించే భ్రమర సమదాయంతో అత్యంత సుందరంగా ఉన్న ఆ వనాన్ని ఓ మానసా! చిరకాలం స్మరించుము. 4

పుష్ప పరాగం రాలగా ఎర్రవారిన అక్కడి పృధ్వీ బాగం కలదీ వికసితకుసుమ సమూహాలచే త్రాగబడుతున్న రవిచంద్ర కిరణాలు కలదీ భ్రమరనాదాలతో, శుకపిక సంతతుల మధుర నాదాలతో కర్ణేంద్రియాన్ని విశేషంగా ఆకర్షించునట్టి ఆ దివ్యోద్యానరాజము నా హృదయ మందిరంలో సర్వదా భాసిల్లునుగాక! 5

మనోహర ద్వారాలతో, పురవ్యాప్తాంధకారాన్ని రూపుమాపునట్టి కాంతులతో, పురద్వారావకాశమందలి వజ్రాంకురవ్యాప్త హారకాంతులతో, పృధ్వీమండలానికి హేమహారమై, నిరంతరం వర్థిల్లునట్టి – భవసాగరానికి గల ఆవరి రీతాన్ని చేర్చునట్టి ఓ సువర్ణ ప్రాకారమా! భక్తజనుల మనస్సులో విహరించుదానా! నీకు ప్రణామాలు. 6

అయ్యుద్యాన వనంలోని సువర్ణప్రాకార మధ్యబాగాన మణిమయ మండపం, ఉదయు కాంతి పుంజాలచే యావదాకాశానికీ తగినంత వితాన సంపదను కల్పించుచు, కృష్ణాగురు ధూపసుగంధంతో యావదాకాశాన్నీ సువాసితం చేసి వ్యాప్తమవుతూ, నిత్యం దేవగణ సంసేవితమవుతూ ఉంటుంది. అట్టి లక్ష్మీప్రదమైన మణిపడపం సర్వదా నా చిత్తాన్ని తేజరిల్ల జేయుచుండును గాక! 7

జననీ! నీ మణిమందిరం ఒకచోట పద్మరాగ మణికిరణ గణ ప్రభలతోను, వేరొకచోట విశేష ప్రకాశంగల మరకత కాంతులతోనూ చీకటివలె చేయుచు, మరోచోట వ్రేలాడునట్టి ముత్యాలహారాలతో ద్విగుణీకృత కాంతులతో వెన్నెలలాచేస్తూ సుందరంగా ఉంటుంది. మాతా! అట్టి నీ మణి మందిరానికి ప్రణామం చేస్తున్నాను. 8

రవి రథాశ్వాలు ఇక్కడి మహోన్నత భవనాలలో ప్రకాశించే మరకత మణికాంతులను తిలకించి – లే పచ్చిక భ్రాంతితో రథాన్ని దారి తప్పించి పైకి లాగుతుండగా సారథి అయిన అనూరుడు కళ్ళెమును గట్టిగా పట్టుకుని అతికష్టంమీద వాటి తలలను ఋజుమార్గంలోకి త్రిప్పి రథాన్ని దారిలో పెడుతూ ఉంటాడు. 9

మణిమయ మండపం నుండి బహిర్గతమయ్యే కాంతి పుంజంచే అంబరం యెర్రవారగా రవిరథాశ్వాలు సాయం సమయమైనదని దిగబడు నడకలతో మందంగా సాగుతూంటాయి. అంత సూతుని కుపిత హుంకార ధ్వనులతో అవి పునః శీఘ్రగతితో పురోగమించ సాగుతుంటాయి. 10

మాతా! హిమగిరిసుతా! సాగరుడు శ్రద్ధ, భక్తులతో అనేకానేక రత్నరాసులను నీకు బహూకరించెనా? లేక విశ్వకర్మ రోహిణిగిరితో, రత్నరాసులతో నీ సదనాన్ని నిర్మించెనా? కాకుంటే యీ మణిరాసులిట్లు అకీర్ణమవడానికి కారణమేమమ్మా! ఆ తెలిసింది నీ సుందర కటాక్షవలోకన మాత్రంచే సంతుష్టుడై పరమశివుడు నాట్యమాడుతుంటాడు కదా! అప్పుడు నాగరాజైన వాసుకివల్ల యీ మణిగణాలు వెదజల్లబడి ఉంటాయి. 11

బ్రహ్మ, విష్ణు, మహేశ్వరాది దేవతలందరూ తమ తమ వాహనాలను దూరం లోనే విడనాడి, శిరస్సులు వంచి దోయిలించిన హస్తాలతో సంయమీంద్రియులై భవదీయాగమనార్థం నిరీక్షిస్తూండగా నీ రత్నమండపం నిండు వెలుగులు పండుగజేస్తూ ఉంటుంది. 12

నీ రత్న మండపంలో మృదంగ కాహళాలు మ్రోగుతూ ఉంటాయి. కిన్నరాంగనలు గానాలాపనం చేస్తూండగా దేవకన్యలు ఆడుతూ ఉంటారు. ఉత్తమ సేవకజనంతో అధికానందాన్ని పొందుతూ నిత్య కల్యాణంగా భాసిల్లే అ నీ రత్నమండపం సర్వదా నాకు సంతోష దాయకమగునుగాక! 13

దత్తచిత్తమైన నారీజనం లోపలికివస్తూ, బయటకు పోతూండగా బయట వేచి ఉన్న అమర సముదాయం వరాపట్ల భక్తిభావాన్ని ప్రదర్శిస్తూన్నారు. చిత్ర విచిత్ర సుందరాభరణాలుకల అట్టి నారీగణంతో నిండియున్న నీ రత్న మండపం నాకు సదా శుభాన్ని చేకూర్చునుగాక! 14

జననీ! నీ మంటప మహిఃప్రదేశము పెద్దవాకిలి, అక్కడ సువర్ణరత్నాలంకృతాలై, రంగు రంగులు చీరలు కట్టి, బంగరు బెత్తాలు ధరించి దేవతల నందరినీ వారిస్తూన్న అగణిత నారీజనముచే అధిష్ఠింపబడిన పురోభాగం కలదై అలరారుతూన్నది. అట్టి నీ ప్రాంగణం నా మనస్సులో సర్వదా భాసిల్లుచుండును. గాక! 15

అమ్మా! నా హృదయ కమలంలో ఆయుధాపాణులై వారి వారి దిశలయందు ఇంద్రాదులైన అష్టదిక్పాలురు నారీ వేషాలను ధరించిన దిశాధినాథులను ధ్యానించి, శంఖంలో శ్రీ వసుధారతో వసుమతీ యుక్తమైన పద్మాన్ని స్మరిస్తూ అక్కడ రతీపతి అయిన మదనునీ అతని సఖుడైన వసంతునీ ప్రీతితో మ్రొక్కి సేవిస్తున్నాను. 16

అవ్యక్త మధుర స్వరాలుగల వీణతో గానం చేస్తూ, యెడనెడ హుంకారం చేస్తూ ప్రాంగణంలో నివసిస్తూన్న సరస్వతీ దేవ్యాదులను పూజిస్తూ పోయి ద్వారంలో మదం వల్ల ఒళ్ళుతెలియని సురగణేశ్వరునీ, మదోన్మత్తయై కాలవర్ణంకల చీరను ధరించి ఒడలెల్ల ముత్యాలహారాలను అలంకరించుకుని అలరారుతున్న మాతంగీ దేవినీ సేవిస్తూన్నాను. 17

కస్తూరిలా, కస్తూరిని అలంకరించడం వల్ల నల్లనై నిగనిగలాడే శరీరంకలదీ, మధుపానామృత మదాలసాలైన అంగాలు కలదీ, వామభాగానకల స్తనంచే ఆలింగితమైనరత్నవీణ కలదీ అయిన మతంగముని పుత్రిని మనసా స్మరిస్తూన్నాను.

విరబోసిని కేశకలాపంతో, వూడిపోతున్న వస్త్రాలు కలదానా! నిర్మలాభూషణాలతో తేజరిల్లుదానా! ఓ తిరస్కరిణీదేవి! నీ చరణారవిందాలను స్మరిస్తూ బ్రహ్మాది స్తంబ పర్యంతంగా గల పశు సమూహాన్ని మోహననామక క్షీర సాగరంలో నుదురువరకూ మునిగిన దానినిగా భావ చేస్తూన్నాను.

మాతా! మత్తును కలుగజేసే మధువునూ ఆస్వాదించడం వల్ల ఎర్రవారి తిరుగుతున్న నయనాలు కల దూతికలు, ప్రచండాసురులను సంహిరంచునట్టివారూ, భక్తుల మానసాలలో ప్రవేశించునట్టి వారూ విలేపిత కజ్జల కాంతి సంతతులతో భాసిల్లునట్టి దేహాలుకలవారై ఓ చేతకపాలాన్నీ, మరోచేత శూలాన్ని ధరించి ఉంటారు. అట్టి నీ దూతకలను స్తుతిస్తున్నాను. 20

అమ్మా! నీ మణిమందిరానికి గల నాలుగు వాకిళ్ళు తేజరిల్లుతూన్న యవధాన్యాంకురాలతో భాసిల్లే సువిశాల ప్రదేశాలలో సమక్షంలో స్థాపింపబడ్డ దీపాలతో అలరారే ముకుళిత సుందర ముఖాలు కల నవకుంభాలతో ప్రకాశిస్తుంటాయి. నీ వాకిళ్ళకు అమర్చబడిన కవాటిలు బంగారపుకట్లతో విచిత్రాలైన రత్నాల చెక్కడాలతో తేజరిల్లుతుంటాయి. శైలసుతా! నాలుగు వాకిళ్ళతో కూడినట్టి నీ మణిమందిరానికి వందనం చేస్తున్నాను. 21

మాతా! నీ మణిమండప మధ్యబాగం పరువబడిన ఎర్రటి కంబళాసనాలతో పూలపరుపులతో భాసిల్లుతూన్న అగణిత విశాల మణిదీపాలతో మనోహరమైన చాందీనీలతో అందమై, వ్యాప్త ధూపసుగంధాలకు సంబరంతో పరివేష్టించి యున్న భ్రమర సమూహ నాదాలతో అలరారుతూ ఉంటుంది. అట్టి శ్రీకరమైన నీ మణిమండప మధ్యభాగం నాకు సర్వదా శుభాలను వర్ధిల్లజేయునుగాక! 22

బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఈశాన, సదాశివలనే పంచప్రేతల హేమమయు దివ్యాసనంచే భాసిల్లునట్టిదీ అగణిత మణిఖచితమైనదీ, ఉపరిభాగంలో అరుణ,

ధవళవర్ణాలుగల వస్త్రాలచే ఉత్తమమైనదీ, దివ్యాలైన తలగడ, కాళ్ళడ దిండ్లతో సుఖప్రదమైనదీ, సుమసుగంధం కలదీ అయిన శయ్యపైనుండి నా హృదయ సరోజంలో సాక్షాత్కరించిన పరదేవతను నేను సేవిస్తూన్నాను. 23

సముచితంగా ఉండవలసిన తీరులో అవయవాలన్నీ ఉండగా రమ్యాకృతితో భాసిల్లుతూ - తూర్పు తెల తెలవారుతుండగానే నిదురులేచి ఆవులింతవల్ల సుందర వదనారవిందంకలదీ, మధుపానమదం వల్ల అరుణ కాంతులతో చరిస్తున్న నేత్రత్రయం కలదియై సేవించ దగ్గరగ వచ్చిన నిత్య సన్నిహితులైన సఖీజనాన్ని అవలోకన మాత్రంచే గౌరవిస్తున్న పరదేవతను సందర్శిస్తూన్న - నా జన్మ చరితార్థమైనదిగా భావిస్తూన్నాను. 24

జననీ! శైలరాజసుతా! బహిర్ద్వారంలో వివిధ వాద్యాల మ్రోతలు సమున్నతమై వ్యాపిస్తూన్నాయి. కిరీటాలు నేలను త్రాకునట్లుగా శిరస్సులు వంచి సాగిలపడి భక్తజనులు నీకు మ్రొక్కుతూ ఉన్నారు. ఈ ప్రాతర్వేళలో నానారత్న ఖచితమై, సువర్ణకుంభంలో అలరారుతూన్న సముజ్వల నీరాజానాన్ని అమ్మా! నీకిదే కల్పిస్తున్నాను. స్వీకరించు తల్లీ! 25

ఓ ఈశానీ! పాద ప్రక్షాళనార్థం నీకు పాద్యాన్నిస్తూన్నాను. హస్తాలకు పూజా వస్తువులను అందిస్తూన్నాను. అమృతధారయుత మధుపర్కాన్ని సమర్పిస్తున్నాను. శుద్ధమైన గంగాజలాలతో నేను కల్పించిన ఆచమనాన్ని ఆచరించు తల్లీ! మదీయ సాష్టాంగ ప్రణామాన్ని తిలకించి సార్థకం చెయ్యి. 26

జననీ! నా దృష్టిరూప నిర్మల దర్పణంలో నీ వదనారవిందాన్ని చూసుకో. గంగాజలాలలతో కూడిన యీ దంతధావన చేసుకో. ముఖ ప్రక్షాళనం చేసు కుంటూనే మృదువైన వస్త్రంతో తుడుచుకొనుట అంగీకరించు అమ్మా! ఆ పై మనోహరమైన తాంబూలాన్ని ఆస్వాదించుము. 27

మణిమయ నిర్మితాలైన పావుకోళ్ళపై నీ చరణ కమలాలనుంచు తల్లీ! సఖురాండ్రు అందించునట్టి కరకమలాలను పట్టుకుని నెమ్మది నెమ్మదిగా స్నానశాలకు విజయం చెయ్యి. కరుణా సముద్రురాలా! దేవదేవేశ్వరీ! నీ

కృపాకటాక్షావలోనాల్కై ఇరువైపులా బారులు తీరియున్న సతురసమూహాన్ని అవలోకించవమ్మా!
28

బంగారంతో, రతనాలతో కట్టిన ప్రాకారమూ, విశాలాలై అరుణ వర్ణశోభితాలైన చాందినీల అలంకారం కలిగి, సిద్ధంగా ఉన్న దాసీ జనంగల నా మనస్సు అనే స్నానగృహాన్ని తిలకించవమ్మా!
29

బంగారపు బిందెలు, చెంబులు, స్ఫటిక మణిపీఠం ఆదిగాగల స్నాన సాధనాలతో నిండి పరిమళంతో మదించిన భ్రమరపంక్తి తళతళలాడే ఎర్రని చాందినీలు గలదై, మనోహర గంధర్వ గానం గల స్నాన గృహాన్ని పరమ శివదేవుని మహోత్సవాలకు స్థానమైన ఓ దేవీ! మెల్లగా ప్రవేశించవమ్మా!
30

పీనోన్నతాలైన పయోధరాలతో భాసమాన పూర్ణచంద్ర సమవదనంకల వారు, సువర్ణ రత్నాదులతో తయారుచేయబడి తేజరిల్లునట్టి సన్నని చీరలు కట్టినవారూ, స్నానార్థం హేమపాత్రలను, మెత్తని వస్త్రాలను, పుప్పొడి అయిన నలుగుపిండినీ, తైలాన్నీ దువ్వెననూ చేతులతో పట్టుకొనియున్న నీ దాసీలను గురించి ఓ తల్లీ నీకు నేను ప్రణమిల్లతున్నాను
31

తత్స్నామందిరంలో స్ఫటికమణి పీఠాన్ని అలంకరించి మెల్లగా ఆభరణాలను ఒలిచి, రైక మీదనున్న ఈషదరుణారుణంగా ఉన్న పైటను విడచి, జడముడిని ఊడదీసి దువ్వెనచే కేశపాశంలోని చిక్కులను దీయించు కొనుచున్న పరదేవత నా మానస్సులో భాసించునుగాక!
32

ఓ గిరిరాజనందినీ! మృదు తైలసంపాదిత అభ్యంగనాన్ని స్వీకరించి కుంకుమ, అగరు ద్రవ్యాలతో పరిమళించే కస్తూరిజలాలతోను, సుగంధాలు వెదజల్లే యక్ష కర్దయ మిశ్రిత జలాలలతోను, కుంకుమ పూవు మేళవించిన సలిలాలతో పూలజలాలతో కర్పూరం కలిసిన నీళ్ళతో, నిర్మలాలై, సర్వ తీర్థాలనుండి తీసుకురాబడిన వేడినీళ్ళతోను, చల్లటి నీళ్ళతఓనూ భక్తితో నీకు స్నాన సలిలాలను సమర్పిస్తున్నాను. గిరారజనందినీ! వాటిని స్వీకరించవమ్మా!

శుద్ధ వస్త్రములతో నీ సమస్తావయవాయలనూ తుడిచి ఆరనిస్తూన్నాను. విశాలమైన నీ కేశపాశాన్ని ఉత్తమమైన ధూపంతో సువాసితం చేస్తూన్నాను. చెలియ అందరిచేత నీకు చుట్టూ తెరను పట్టించినాను. భక్తజన సంరక్షణ దీక్షా తత్పరురాలా! మహేశ గృహిణీ! రతనాల కాంతులీనే స్నాన వస్త్రాన్ని విడిచి వేయుము 34

ఓ చండీమాతా! నీకు సాంద్రమైన పట్టు గాగరాను సమర్పిస్తూన్నాను. సిందూర ప్రభలను అథఃకరించునట్టి మృదువైన వస్త్రాన్ని స్వీకరించి ధరించుతల్లీ! ముక్తారత్నాదులతో చిత్రంగా అల్లిన బంగరు పోగులతో కూడిన తళతళ మెరిసే నల్లని రైకను పరమేశ్వరునికి ప్రాణాధిక ప్రియురాలవైన ఓ త్రిపురసుందరీ మాతా! నీకు సమర్పిస్తూన్నాను. 35

విరబోయబడిన కేశాలచే అచ్ఛాదితమైన భుజదేశంకల జననీ! మణిగణ ఖచితమై విరాజిల్లుతూన్న పాదుకలను తొడిగిన మహేశ్వర గృహేశ్వరీ! శీఘ్రంగా వచ్చిన చెలియబుజాన్ని లలితంగా ఆసరా గా పట్టుకొని అలంకార మండపానికి విజయం చేయి తల్లీ! 36

ఓ కాత్యాయినీ మాతా! తేజరిల్లే బంగరు కుట్టిమంలో తళుకలీనే మంచి ముత్యపు రాసులవల్ల తేజరిల్లే కాంతిపుంజాల వల్ల ఇంద్రధనుస్సమూహంలా ఉన్న విశేషాలంకార మంటపంపై ఉన్న హేమ సింహాసనం మీద సఖీజన పరివేష్టితురాలవైన జననీ! ఆశీనురాలవు కమ్మ 37

మృదుకేశాపాశాన్ని దువ్వెనతో మెల్లగా దువ్వి సుందరంగా విమలమైన పాపటను ఏర్పరచి ఆపై సింధూరపు రేఖదిద్ది ముత్యాలు పొదిగి ముంగురులుకల ఆ జడను మణులు గ్రుచ్చిన బంగురుతీగెతో ఆ ప్రాంతమందు ముత్యాల జాలరులు వ్రేలాడునట్టి సొబగు గల దానినిగా చేస్తున్నాను. 38

వ్రేలాడే జడ అనే త్రాచు శిరస్సుమీద ధగధగ మెరిసే మణిభ్రాంతిని కలుగ జేసేది, నిజప్రభలతో ఉల్లసిల్లజేసే కేశపాశం కలదీ అయిన చూడమణిని ఓ మహేశ్వరీ! నీకు సమర్పిస్తూన్నాను. 39

ఓ మృడానీ! (శివునిరాణి) అంధకారం వంటి నీ నల్లని కొప్పులో సూర్య బింబంవలె ప్రకాశించే చూడామణితో నున్న నీ శిరస్సునకు ప్రణమిల్లుతూన్నాను. 40

సువర్ణ నిర్మితమై, మణికాంతులతో మధ్యభాగం ప్రకాశించచుండ, వ్రేలాడే ముత్యాలసరలా పరివేష్టించి యుండ రాజిల్లునట్టిదీ, పరమ శివదేవుని ఆచంచలదృష్టులచే సంభావింపబడునదియు అయిన నీ ఫాలసీమలో వ్రేలాడు నట్టి ఫాలభూషణాన్ని ఓ భవానీ! నీకు సమర్పిస్తున్నాను. 41

అమ్మా! నీ కమలనేత్రాలు, మీనాల, పద్మాల ఖంజరీ పక్షుల- శోభలను తిరస్కరించునట్టివీ, మదనారి (శివుని) మానసంలో సుమశరుని బాణప్రభా భ్రాంతిని కలిగించునవీ, మధుపాన మదంవల్ల అరుణారుణాలై అలరారుతున్నాయి. ఆ నీ సువిశాల చంచల నయన కమలాలయందు అమ్మా! ఈ సువర్ణశకలాకతో దివ్యంజనాన్ని పెట్టుకో తల్లీ! 42

మధ్యబాగం పద్మరాగంతో అలరారు వదనభాగాన ముత్యం చే భాసిల్లునట్టి యీ నాసాభరణం విధివశాన ఎన్నడైనా శుక్రబృహస్పతుల మధ్యకు చేరిన భాసకర ప్రభలను అధఃకరించుచున్నది. బింబఫల సమమైన అధరకాంతితో కుజునివలె కన్పించు ముక్తామణికలదై నాచే నీకీయబడిన యీ బలాకీని గిరిరాజ తనయా! ధరించి స్వీకరించవలమ్మా 43

చంద్రునికి చుట్టూ తారలచే చేయబడిన పరివేషమందలి అసూయవల్ల భాను బింబం రెండుగా మారినదా? అన్నట్టున్నదీ అరుణ మణి ప్రభలతో సర్వే సర్వత్రా ప్రకాశించునట్టి ముత్యాలచే అలరారునదీ బంగరు కమ్మలజంట నిచ్చుచున్నాను. వీటిని నీ కర్ణద్వయానికి అలంకరిచుకోవమ్మా 44

జననీ! ఈ కంఠహారాన్ని అందుకో. మరకత, పద్మరాగ, వజ్రాలను సానబట్టి గుండ్రంగా చేసిన మూడుపూసలతో వ్యాప్తమైన మధ్యబాగంకలదై, నిర్మలమైన ముత్యాలు కలిగిన యీ హారాన్ని సాదరంగా ధరించవమ్మా! 45

వివిధదేశ ఖ్యాతిగాంచిన అగణిత మణిగణప్రభలచే వ్యాప్తమైన నగలు, పతకము కంఠాన్ని భాసిల్ల జేయుచున్నవి. ముత్యాలుచుట్టూ పొదగబడగా మధ్యభాగాన అరుణమణి ఇరువైపుల ముత్యాల గుత్తులు కలిగి ప్రకాశిస్తూన్న యీ పతకాన్ని శివానీ! మాతా! దీనిని నీ వక్షఃస్థలాన ధరించవలమ్మా 46

జననీ! ముత్యాలతో, పద్మరాగాలతో, మరకత మణులతో తయారైన యీ ముప్పేటహారం నిరంతరం ప్రవాహం కలిగి, పరస్పరం ఆప్లావితమవుతూ గంగాయమునా సరస్వతీ సంగమస్థానమైన ప్రయాగవంటిదై స్నానమాడు వారి చిత్తమాలిన్యాన్ని క్షాలితం చేస్తూన్నాది. పరమశివ రసికురాలా! ఏవం విధవిశిష్ట గుణ సంపన్నమైన నీ హారం మా మనస్సులలో భాసిల్లునుగాక! 47

మాతా! ఇదిగో బంగరు దండకడియాల జంట. నీ అరచేతులు పద్మాల వంటివి కాగా, నీ భుజాలువాటి కాడలవంటివై విశేషంగా గోచరమవుతూ విశేషంగా స్ఫురించే ప్రభాపుంజంతో అలరారుతూ, నిర్మల శోభతో చంచలాలైన శివదేవుని నయనాలకు లోభాన్ని కలుగజేస్తున్నాయి. అమ్మా! దుర్గా! నీ రెండు భుజాలకు, వివిధ మణి ప్రభావిరాజితాలైన యీ బంగరు కడియాలను రెంటినీ పెట్టుకోవమ్మా!

జననీ! యివిగో భుజకీర్తులు. తెల్లని పట్టుకుచ్చులు వ్రేలాడ అందాలు చిందులాడ, తళతళలాడే మణిహార విరాజితాలైన యీ బాహుపురులను రెంటినీ మహేశ్వర గృహేశ్వరీ! మాతా! నీ బాహుమూలాల్లో బంధిస్తున్నాను. 49

మహేశ్వరీ! మణిమయాలైన దండకడియాలతో కూడిన కరకంకణాలివిగో విశేషకాంతులు గల యింద్ర నీలాలతో నిర్మించబడి తామరపూవు కాడమీద వ్రాలిన మదించిన భ్రమర పంక్తులను జయించిన యీ కంకణాల మొత్తాన్ని హస్తమూలంలో ధరించవలమ్మా! 50

మృదువైన నల్లని పట్టుగుత్తులతో అలరారుతూ అలంకృతమైన మణి జాలాలతో మనోహరమై భాసిల్లునట్టి బంగరు రేఖగల గోటును - కంకణం కన్న ముందుభాగంలో ధరంచ సమర్పిస్తూన్నాను తల్లీ 51

బాలవిద్రుమలతలతో మదనుడు నిర్మించన పాదులా ఉన్న మదీయార్పితమైన అంగుళీయకాన్ని జననీ! మెల్లగా నీ వ్రేలికి పెట్టుకోవమ్మా. 52

శివుని జయించిన మన్మథుడనే మదపుటేనుగు కుంభస్థలాన్ని విదిలించడం వల్ల మ్రోగుతున్న గజ్జెల సమూహంచే సమానమైన నిర్విరామ మధుర నాదాలతో మహేశ్వరుని చిత్తాన్ని ఆకర్షించునట్టి వివిధ మణిఖచితమైన ఒడ్డాణాన్ని అమ్మా! నీకు సమర్పిస్తూన్నాను. 53

వ్రేలాడే మంచి ముత్యాల గుత్తులలరారుతూ, ప్రకాశించే బంగరుడిప్పల జంటతో అలంకరించబడి అగణిమణులు పేర్చిన మొలనూలును పోక ముడిన బంధించ సమర్పిస్తూన్నాను. 54

జననీ! క్రొత్త లత్తుక పంకంతో పూయబడిన నీ చరణారవిందం, మరకత మణిపంక్తులతో మనోహరాలైన అందెల స్వ్వడులతో రాజిల్లుతూ ఉంటుంది. దానియందు పద్మరాగమణి బహిర్గత ప్రభాధారతో విచిత్రంగా అలంకృతమై ఉన్న హంసకం ప్రీతిని పొందునుగాక! 55

బంధింపబడినవియై, మేలైన నల్లని గుత్తలతో శోభించునట్టి అవ్యక్త మధుర ధ్వనులతో మంజులమైనట్టీ, పరమేశ్వరుని మనస్సును మోహించునట్టినీ, అగగణిత మణిసమూహ ప్రభలతో చిత్రవర్ణమైన యీ బంగరు ఘుంఘురు వును అమ్మా! నీ పాదకమలాలలో అలంకరించుకో 56

ప్రకాశించే సహజారుణ ప్రభారంజితమైన నీ పాదపంకజంలో కలకల ధ్వనితో అలారారే పద్మరాగమణి స్థగితాలైన అందియల జంటను నీ సఖురాండ్రచే అలంకరింప జేయుచున్నాను. 57

ఓ మహేశ్వరీ! నీ చరణ కమలాలను ఆరాధించ వచ్చిన చంద్రునిచే దాల్చబడిన సంధ్యా రాగారుణాలైన సూక్ష్మశరీరాల పరంపరలవంటి నవ్యలాక్షారసపు విశేషమైన పూతచే యితోధికారుణిమత్వం పొందిన భవదీయ చంరణ పంకజ గతమైన నఖమండలికి ప్రణమిల్లుతున్నానమ్మా! 58

జననీ! అమరభామినులు విశేషప్రయత్నపూర్వకంగా ఎర్రనీ, తెల్లనీ, పచ్చనీ, వికసించిన పువ్వులను చిత్రంగా పట్టుదారాలతో మధ్యభాగంలో గ్రుచ్చి దివ్యాగురుధూపాలతో సువాసితం చేసిన ఎర్రకలువ పూలమాల యిదిగో. పరిమళించే సుగుంధాలను ఆఘ్రాణిస్తూ కన్నూ మిన్నూ కానని మత్త భ్రమరాలతో ఆరంభమైన ఝూమ్మను సంగీత నాదాలతో అలరారుతూన్నది. పరశివరసికే! ఈ సుమమాలను నీ గళసీమలో ధరించవమ్మా! 59

జననీ! ఈ బంగరు గిన్నెలో ఉన్న పరమామృతాన్ని పానం చెయ్యి. నీ ముఖకమలంలో నిర్మలమైన యీ తాంబూలాన్ని వేసుకో. నిర్మలమైన ఈ దర్పణంలో నీ వదన కమలాన్ని చక్కగా చూసుకో. రత్న ఖచితమైన యీ పాదుకలపై నీ పాదారవిందాలను మెల్లగా ఉంచుతల్లీ! 60

తనకు దగ్గరగా నున్న చెలికత్తె చేతిని ఆలంబనం చేసికొని, నెమ్మదిగా సింహాసనం మీదనుండి లేచి, మధురనాదాలు చేస్తూన్న హంసల మందమనోహర గమనాలతో మెరుస్తూన్న వస్త్రాభూషణాలు కలదై ఆనందాన్ని అందించే ఉపనిషద్దేవతలు వాక్యస్తుతులతో ప్రశంసిస్తూ వెంటరాగా సభామండపానికి విజయం చేస్తూన్న గిరరాజనందిని నా చిత్తంలో స్థిరంగా ఉండునుగాక! 61

మా తల్లి కొద్దిగా కందులుతుండగానే యావత్ పరివారమూ సావధానంగా వెంటనంటి రాగా బంగరు బెత్తాలు ధరించిన వేగులు ముందునడుస్తూ సందడిచేయ, పురోగమిస్తున్న భువనజనని విశేషంగా చేస్తున్న పాదన్యాసంవల్ల జనించిన ఝణత్కారాలతో ప్రతిధ్వనించసాగింది. 62

చేతనున్న బెత్తాలను యిటూనటూ ఆడిస్తూ విశేష వస్త్రాభరణాలను ధరించి ముందుగా పురోగమించునట్టి దాసీ జనం అమరసమూహాలను యిటూ అటూ తొలగించి ముందర విశ్రాంతి జేస్తుండగా, ప్రాంగణమంతా అమర వనితలచే పరివేష్టింప బడియుండగా విజయం జేసి మహేశ్వరునికి మహానందాన్ని కలిగిస్తూన్న నిర్మల చిదానందైక రూపాన్ని నేను ప్రణామ పూర్వకంగా సేవిస్తూన్నాను. 63

ఆ త్రిభువన జనని పాద సమీపంలో బ్రహ్మదేవుడు పడుతూన్నాడు. ఇదిగో పద్మనాభుడు ప్రణమిల్లుతూన్నాడు. సమక్షంలో శివుడిడుగో. క్రీగంట యిటుచూడు తల్లీ! అడుగో! దూరంలో ఉన్న మహేంద్రుని తిలకించవమ్మా అంటూ పరిచారికలు పలుకుతూండగా సముచితంగా వారివైపు చూస్తూ ఆదరిస్తూన్న భగవతి నాకు ఐశ్వర్యాన్ని ప్రసాదించునుగాక! 64

ఉత్కంఠంగా మందగమనంతో నిన్ను పరివేష్టించియున్న చారణాంగనలు సర్వ దిశలయందూ ఎలుగెత్తి పేరెట్టి ప్రత్యేకంగా చెబుతూండగా శీఘ్రంగా సమక్షంలో కానవస్తూన్న అమరగణాన్ని వాత్సల్యంతతః తిలకిస్తూ మార్గంలతః పాదారవిందాన్ని నెమ్మదిగా ఉంచదలచునట్టి మహేశ్వర గృహేశ్వరి లోకాలనన్నింటినీ పాలించునుగాక! 65

ఓ గిరిరాజసుతా! ఈ దేవతలలో ముందు వెనుకల కొందరూ, కొందరు ఉభయ పార్శ్వాలలోనూ ఉండి పురోగమిస్తూన్నారు. కొందరు అంబర వీధిలో ఉన్నారు. మరికొందరు దిశలలో నిలచియున్నారు. ఒత్తిడిని మెల్లగా తొలగించి కొందరు మాటి మాటికీ సాష్టాంగ దండ ప్రణామాలు చేస్తూన్నారు. వీరందరికందరూ అమ్మా! నీ కరుణా రస దృష్టులను కోరుతున్నారు. 66

నీ సమక్షంలో కిన్నకర గణం అవ్యక్తమధుర పదాలను గానం చేస్తుండగా, గంధర్వ భామినులు సవ్యాపసవ్యాలలో నిలచి మెల్లమెల్లగా మధురంగా వాద్యాలను వాయిస్తున్నారు. పరివేష్టించి పురోగమిస్తూ బ్రహ్మాదులు వేదస్తవాలతో నిన్ను కొనియాడుతున్నారు.

చిరకాలంగా ఉపాసింపబడు మహామంత్రాలసిద్ధిని ఒకనికీ, సంసారమందు ఆసక్తిలేని వేరొకనికి పమానందానుభవ స్వరూపమైన గమనికనూ, యితరేతర విషయాలయందు ఆసక్తికలవాడై వాకిలి కాచుకున్న దరిద్రునికి దుఃఖాలనన్నింటినీ దూరం చేయునట్టి అర్థాన్ని క్రమంగా అనుగ్రహిస్తూన్న త్రిపుర సందరీ మాతకు వందనాలర్పిస్తూన్నాను. 68

దివ్యౌఘ, సిద్ధౌఘ, మానవౌఘ, నామాలు కల పంక్తిత్రయానిక బద్ధాంజలి భక్తిని వ్యక్తం చేస్తూ, ప్రసన్నవదనాలతో, సమీపంగా, ఔత్సుక్యభావంతో మందగమనం చేస్తుండగా వివిధ మన్త్రపాఠాన్ని, మంత్రార్థాన్నీ, వాటిని సాధించే ఉపాయాన్నీ తత్వలాన్ని గురించి వ్యాఖ్యానం చేస్తూన్న కాంతులను ప్రసరించు ఆది తేజాన్ని ఏను బావిస్తూన్నాను. 69

పరమేశ్వరుని ప్రియురాలా! అమ్మా! నీ మందిర ప్రాంగణంలో నిత్యం నివసిస్తూ అగ్నిగణ సమ అరుణ నేత్రాలతో సర్వులూ భయభీతులను చేస్తూన్న భయంకర ముఖలయిన శరభేశ్వరీ శరభేశ్వరులకు విశేష భక్తితో ప్రణమిల్లుతూన్నారు.70

అమ్మా! శ్రీచక్రాకారంలో భాసిల్లే నీ వేదిక మణిస్తంభాలతో కూర్చబడిన బంగారు తీగెలతో భాసిల్లునట్టి ఉత్తమ విమానంతో, కర్పూర, అగరుపొడులు లోపల చేర్చబడి మెదిపిన వత్తులతో వెలిగించిన దీపమాలల్లో స్ఫురిస్తూన్న మణిగణాలుకలదై - ప్రళయవేళలఈ ఏకకాలాన సరసంగా తోచిన అగణిత భానుసమ దివ్య ప్రభలను ప్రసరింపజేస్తూన్నది. అట్టి శ్రీ చక్రాకృతిలోనున్న నీ వేదికకు ప్రణమిల్లుతున్నాను. 71

వివిధ రత్నసువర్ణ ప్రభలతో- మేఘాలు క్రమ్మిన దివసాన్ని యేర్పరుస్తూ అలరారుతూన్న పూలదూది పరుపులు కలదియై కామేశ్వరునిచే అధిష్ఠితమై నిత్యానందస్థితికి ఆలవాలమైన సింహాసనం - స్వస్థానాలయందు రాజిల్లుతూన్న అమర సమూహాలచే ఆవరింపబడిన బిందువులో ఆనందంగా ఉంచబడింది. తల్లీ అట్టి సింహాసనాన్ని వినమ్రుడనై భావిస్తూన్నాను. నా హృదయ సీమలో అది సదా సన్నిహితంగా ఉండునట్లు అనుగ్రహింపుము. 72

ఆనందాతిరేకంతో బృందారక సందోహం దశదిశలనుండీ జయజయ కారాలు చేస్తూ బద్ధాంజులురై ఆసీనులైయున్నారు. జననీ! నీ కరుణాకటాక్ష వీక్షణాలతో వారి అంజలి పంక్తిని సార్థకం చేస్తూ అమూల్య మణిఖచితమైన సఖిజనపరివేష్టితమై కాంచన సింహాసనాన్ని అధివసించవమ్మా! 73

అమ్మా! సేవికలు కస్తూరీ, కర్పూరాది సుగంధ ద్రవ్యాలన్నింటినీ బంగరు కూజాను, మణిఖచిత తాంబూలపేటికనూ, చేలాంచలాన్నీ దర్పణాన్నీ, భాసమాన మణిఖచిత పాదుకలనూ తీసుకొని నీ సింహాసనాన్ని పరివేష్టించి సావధానంగా నిలబడి ఉన్నారు. త్రిపురసుందరీమాతా! వారి మ్రొక్కులతో నీకు వందనం చేయుచున్నాను. 74

అమ్మా! భవదీయ నిర్మల దేహకాంతి తరంగ పుంజాలచే భాసిల్లుతూన్న బాహూచాలన విలాసంకల చామర గ్రాహిణులచే చామరాలను వీవజేసే కర్తృత్వాన్ని నేను వహిస్తున్నాను జననీ!

ఓ మహేశ్వర గృహేశ్వరీ! ఉదయ భాస్కర సమ సుందరమైన హేమ ఛ్చత్రమిదిగో - ధగధగ మెరిసే ముత్యాలు గుత్తులు గుత్తులుగా యీ ఛత్రానికి చుట్టూ కొనలలో వ్రేలాడ, సుందర దివ్యమణిఖచిత సువర్ణ దండంతో విశేష సుందరంగా ఉన్న యీ ఛత్రాన్ని నీకు పడుతున్నాను. 76

భాసిల్లుతూన్న నీ దివ్య దేహకాంతి పుంజసిందూర ప్రవాహ ప్రభలతో ఎర్రవారి, విశేషారుణిమత్వం కల మణి ఖండంవంటి ప్రభలు కల యీ సువర్ణచ్ఛత్రాన్ని అమరగణాలు దూరం నుండి సాదరంగా అంజలి బద్ధులై సందర్శిస్తున్నారు. ఇట్టి భవదీయ అనుపమాన హేమచ్ఛత్రానికి నేను ప్రణమిల్లుతూన్నాను జననీ. 77

మాతా! పరమామృత రసంతో సంతుష్టినందిన దానవై అలా రారే కామేశ్వరుని నామాంకంపై పూల సమూహాలచే ఆరాధింపబడుతూన్న షడ్గుణైశ్వర్య సంపన్నవైన నిన్ను శ్రీ చక్రావరణాంతర్గత దేవతలు ప్రసన్నంగా మ్రొక్కుతూ దివ్య ప్రభలతో తేజరిల్లే దివ్య దేహకాంతులతో లయమై నీ రూపంతో భేదంలేని వారవుతూన్నట్లు గోచరించు వారందరికి వినయంగా నమస్కరిస్తూన్నాను. 78

అమ్మా! గిరిజాదేవి! నీ శ్రీచక్రంలో ఆధారశక్తి ఆదిగాగల శక్తులనూ, మధ్య స్థానంలో సర్వాధికురాలయిన యోగినిని ఆరాధించి మిత్రేశాదినాథ చతుష్టయానికి ప్రణమిల్లుతున్నాను. 79

ఓం విద్యాయై నమః
ఓం వియాదాది జగత్ప్రసవే నమః
ఓం సర్వవ్యాధి ప్రశమన్యై నమః
ఓం సర్వమృత్యు నివారిణ్యై నమః
ఓం అగ్రగణ్యాయై నమః
ఓం అచిన్త్య రూపాయై నమః
ఓం కలికల్మష నాశిన్యై నమః
ఓం కాత్యాయన్యై నమః
ఓం కాలహన్త్రై నమః
ఓం కమలాక్ష సేవితాయై నమః
ఓం తాబ్బూలపూరిత ముఖ్యై నమః
ఓం దాడిమీకుసుమ ప్రభాయై నమః
ఓం మృగాక్ష్యై నమః
ఓం ముఖ్యాయై నమః
ఓం మృడాన్యై నమః
ఓం మిత్ర రూపిణ్యై నమః
ఓం నిత్యతృప్తాయై నమః
ఓం భక్తనిధయే నమః
ఓం నియంత్ర్యై నమః
ఓం నిఖిలేశ్వరై నమః
ఓం మైత్ర్యాది వాసనాలభ్యాయై నమః
ఓం మహాప్రళయసాక్షిణ్యై నమః
ఓం పరాశక్త్యై నమః
ఓం పరానిష్ఠాయై నమః
ఓం ప్రజ్ఞాన ఘనరూపిణ్యై నమః
ఓం మాధ్వీపానాలసాయై నమః
ఓం మత్తాయై నమః
ఓం మాతృకావర్ణరూపిణ్యై నమః
ఓం మహాకైలాస నిలయాయై నమః
ఓం మృణాళ మృదుదోర్లతాయై
నమః
ఓం మహనీయాయై నమః
ఓం దయామూర్త్యై నమః
ఓం మహాసామ్రాజ్యశాలిన్యై నమ
ఓం ఆత్మవిద్యాయై నమః
ఓం మహావిద్యాయై నమః
ఓం శ్రీవిద్యాయై నమః
ఓం కామసేవితాయై నమః
ఓం కామకోటికాయై నమః
ఓం కామకోటికాయై నమః
ఓం కటాక్షికింకరీ భూతకమలా
కోటి సేవితాయై నమః
ఓం శిరస్థితాయై నమః
ఓం చంద్రనిబాయై నమః
ఓం ఫాలస్థాయై నమః
ఓం ఇంద్రధనుః ప్రభాయై నమః
ఓం హృదయస్థాయై నమః
ఓం రవిప్రఖ్యాయై నమః
ఓం త్రికోణాంతర దీపికాయై నమః
ఓం దాక్షాయణ్యై నమః
ఓం దైత్యహన్త్ర్యై నమః
ఓం దక్షయజ్ఞ వినాశిన్యై నమః
ఓం దరాందోళిత దీర్ఘాక్ష్యై నమః
ఓం దరహాసోజ్వలన్ముఖ్యై నమః
ఓం గురుమూర్త్యై నమః
ఓం గుణనిధ్యై నమః
ఓం గోమాత్రే నమః
ఓం గుహజన్మభువే నమః

ఓం దేవేశ్యై నమః
ఓం దండ నీతిస్థాయై నమః
ఓం దహరాకాశ రూపిణ్యై నమః :
ఓం ప్రతిసన్ముఖ్యరాకస్త తిథి
మణ్డలపూజితాయై నమః
ఓం కలాత్మికాయై నమః
ఓం కలానాథాయై నమః
ఓం కావ్యాలాప వినోదిన్యై నమః
ఓం సమాచార రమావాణీ సవ్యదక్షిణ
సేవితాయై నమః
ఓం ఆదిశక్త్యై నమః
ఓం అమేయాయై నమః
ఓం ఆత్మనే నమః
ఓం పరమాయై నమః
ఓం పావనాకృత్యై నమః
ఓం అనేకకోటి బ్రహ్మాణ్డ జనన్యై
నమః
ఓం దివ్యవిగ్రహాయై నమః
ఓం క్లీంకార్యై నమః
ఓం కేవలాయై నమః
ఓం గుహ్యాయై నమః :
ఓం కైవల్యఫలదాయిన్యై నమః
ఓం త్రిపురాయై నమః
ఓం త్రిజగద్వంద్యాయై నమః
ఓం త్రిమూర్త్యై నమః
ఓం త్రిదశేశ్వర్యై నమః
ఓం త్రత్యక్షర్యై నమః
ఓం దివ్యగంధాఢ్యాయై నమః
ఓం సింధూర తిలకాంచితాయై నమః

ఓం ఉమాయై నమః
ఓం శైలేన్ద్ర తనయాయై నమః
ఓం గౌర్యై నమః
ఓం గన్ధర్వ సేవితాయై నమః
ఓం విశ్వగర్భాయై నమః
ఓ స్వర్ణగర్భాయై నమః
ఓం అవరదాయై నమః
ఓం వాగధీశ్వర్యై నమః
ఓం ధ్యానగమ్యాయై నమః
ఓం జ్ఞానద[illegible] నమః
ఓం జ్ఞాన విగ్ర[illegible] నమః
ఓం సర్వ వేదాంత [illegible]వేద్యాయై నమః
ఓం సత్యానన్ద స్వరూపిణ్యై నమః
ఓం లోపాముద్రార్చితాయై [illegible]
ఓం లీలాక్లప్త బ్రహ్మాణ్డ మణ్డలాయై [illegible]
ఓం అదృశ్యాయై నమః
ఓం దృశ్యరహితాయై నమః
ఓం విజ్ఞాత్ర్యై నమః
ఓం వేద వర్జితాయై నమః
ఓం యోగిన్యై నమః
ఓం యోగదాయై నమః
ఓం యోగ్యాయై నమః
ఓం యోగానన్దాయై నమః
ఓం యుగంధరాయై నమః
ఓం ఇచ్ఛాశక్తిజ్ఞానశక్తిక్రియాశక్తి
స్వరూపిణ్యై నమః
ఓం సర్వాధారాయై నమః
ఓం సుప్రతిష్ఠాయై నమః
ఓం సదసద్రూపధారిణ్యై నమః

ఓం సుప్రతిష్ఠాయై నమః
ఓం సదసద్రూపధారిణ్యై నమః
ఓం అష్ట మూర్త్యై నమః
ఓం అజాజైత్ర్యై నమః
ఓం లోకయాత్రా విధాయిన్యై నమః
ఓం ఏకాకిన్యై నమః
ఓం భూమరూపాయై నమః
ఓం నిర్ద్వైతాయై నమః
ఓం ద్వైతవర్జితాయై నమః
ఓం వసుధాయై నమః
ఓం వృద్ధాయై నమః
ఓం బ్రహ్మాత్మైక స్వరూపిణ్యై నమః
ఓం బృహత్యై నమః
ఓం బ్రాహ్మణ్యై నమః
ఓం బ్రాహ్మ్యై నమః
ఓం బ్రహ్మానందాయై నమః
ఓం బలిప్రియాయై నమః
ఓం భాషారూపాయై నమః
ఓం బృహత్సేనాయై నమః
ఓం భావభావ వివర్జితాయై నమః
ఓం సుఖారాధ్యాయై నమః
ఓం శుభకర్యై నమః
ఓం శోభనా సులభా గత్యై నమః
ఓం రాజ్యదాయిన్యై నమః
ఓం రాజ్యవల్లభాయై నమః
ఓం రాజత్కృపాయై నమః
ఓంరాజపీఠ నివేశితాయై నమః
ఓం రాజ్యలక్ష్మ్యై నమః
ఓం కోశనాథాయై నమః
ఓం చతురంగ బలేశ్వర్యై నమః
ఓం సామ్రాజ్యదాయిన్యై నమః
ఓం సత్యసంధాయై నమః
ఓం సాగరమేఖలాయై నమః
ఓం దీక్షితాయై నమః
ఓం దైత్యశమన్యై నమః
ఓం సర్వలోకవశంకర్యై నమః
ఓం సర్వార్థదాత్ర్యై నమః
ఓం సావిత్ర్యై నమః
ఓం సచ్చిదానంద రూపిణ్యై నమః
ఓం దేశకాలాపరిచ్ఛిన్నాయై నమః
ఓం సర్వగాయై నమః
ఓం సర్వమోహిన్యై నమః
ఓం సర్వత్యై నమః
ఓం శాస్త్రమయ్యై నమః
ఓం గుహాంబాయై నమః
ఓం గుహ్యరూపిణ్యై నమః
ఓం సర్వోపాధి వినిర్ముక్తాయై నమః
ఓం సదాశివ పతివ్రతాయై నమః
ఓం సంప్రదాయేశ్వర్యై నమః
ఓం సాధ్వ్యై నమః
ఓం ఈ నమః
ఓం గురుమండల రూపిణ్యై నమః
ఓం కులోత్తీర్ణాయై నమః
ఓం మధుమత్యై నమః
ఓం మహ్యై నమః
ఓం గణాంబాయై నమః
ఓం గుహ్యకారాధ్యాయై నమః
ఓం కోమలాంగ్యై నమః

ఓంగురుప్రియాయై నమః
ఓం స్వతంత్రాయై నమః
ఓం సర్వతంత్రాయై నమః
ఓం దక్షిణామూర్తి రూపిణ్యై నమః
ఓం సనకాది సమారాధ్యా నమః
ఓం శివజ్ఞాన ప్రదాయిన్యై నమః
ఓంచిత్కలాయై నమః
ఓం ఆనందకలికాయై నమః
ఓం ప్రేమారూపాయై నమః
ఓం ప్రియంకర్యై నమః
ఓం నామపారాయణ ప్రీతాయై
నమః
ఓం నందివిద్యాయై నమః
ఓం నటేశ్వర్యై నమః
ఓం మిథ్యాజగదధిష్ఠానాయై నమః
ఓం ముక్తిదాయై నమః
ఓం ముక్తిరూపిణ్యై నమః
ఓం లాస్యప్రియాయై నమః
ఓం లయకర్యై నమః
ఓం లజ్జాయై నమః
ఓం రంభాదివందితాయై నమః
ఓం భవదావ సుధావృష్ట్యై నమః
ఓం పాపారణ్య దవానలాయై నమః
ఓం దౌర్భాగ్యతూలవాతూలాయై
నమః
ఓం జరాధ్వాంత రవిప్రభాయై
నమః
ఓం భాగ్యాబ్ధి చంద్రికాయై నమః
ఓం భక్తి చిత్త కేకి ఘనాఘనాయై నమః
ఓం రోగపర్వత దంభోళ్యై నమః
ఓం మృత్యుదారుకుఠారికాయై నమః
ఓం మహేశ్వర్యై నమః
ఓం మహాకాళ్యై నమః
ఓం మహాగ్రాసాయై నమః
ఓం మహాశనాయై నమః
ఓం అపర్ణాయై నమః
ఓంచండికాయై నమః
ఓం చండముండాసుర నిషూదిన్యై నమః
ఓం క్షరాక్షరాత్మికాయై నమః
ఓం సర్వలోకేశ్యై నమః
ఓం విశ్వధారిణ్యై నమః
ఓం త్రివర్గదాత్ర్యై నమః
ఓం సుభగాయై నమః
ఓం త్ర్యంబకాయై నమః
ఓం త్రిగుణాత్మికాయై నమః
ఓం స్వర్గాపవర్గదాయై నమః
ఓం శుద్ధాయై నమః
ఓం జపాపుష్ప నిభాకృత్యై నమః
ఓం తేజోవత్యై నమః
ఓం ద్యుతిధరాయై నమః
ఓం యజ్ఞరూపాయై నమః
ఓం ప్రియవ్రతాయై నమః
ఓం దురారాధ్యాయై నమః
ఓం దురాధర్షాయై నమః
ఓం పాటలీకుసుమప్రియాయై నమః
ఓం మహత్యై నమః
ఓం మేరునిలయాయై నమః
ఓం మందారకుసుమప్రియాయై నమః

ఓం వీరారాధ్యాయై నమః
ఓం విరాడ్రూపాయై నమః
ఓం వరిజాయై నమః
ఓం విశ్వతోముఖ్యై నమః
ఓం ప్రత్యగ్రూపాయై నమః
ఓం పరాకాశాయై నమః
ఓం ప్రాణదాయై నమః
ఓం ప్రాణరూపిణ్యై నమః
ఓం మార్తాండ భైరవ వారాధ్యాయై నమః
ఓం మన్త్రిణీ న్యస్తరాజ్యధురే నమః
ఓం త్రిపురేశ్యై నమః
ఓం జయత్సేనాయై నమః
ఓం నిస్త్రైగుణ్యాయై నమః
ఓం పరాపరాయై నమః
ఓం సత్యజ్ఞానాన్ద రూపాయై నమః
ఓం సమారస్య పరాయణాయై నమః
ఓం కపర్దిన్యై నమః
ఓం కళామాలాయై నమః
ఓం కామరూపిణ్యై నమః
ఓం కళానిధ్యై నమః
ఓం రసజ్ఞాయై నమః
ఓం రసశేవధయే సమః
ఓం పుష్టాయై నమః
ఓం పూజ్యాయై నమః
ఓం పుష్కరాయై నమః
ఓం పుష్కరేక్షణాయై నమః
ఓం పరంజ్యోతిషే నమః
ఓం పరస్మైధామ్నే నమః
ఓం పరమాణవే నమః
ఓం పరాత్పరాయై నమః
ఓం పాశహస్తాయై నమః
ఓం పాశహన్త్ర్యై నమః
ఓం పరమంత్ర విభేదిన్యై నమః
ఓం మూర్తాయై నమః
ఓం అమూర్తాయై నమః
ఓం అనిత్యతృప్తాయై నమః
ఓం మునిమానవ సహంసికాయై నమః
ఓం సత్యవ్రతాయై నమః
ఓం సత్యరూపాయై నమః
ఓం సర్వాన్తర్యామిన్యై నమః
ఓం సత్యై నమః
ఓం బ్రహ్మణ్యై నమః
ఓం బ్రహ్మజనన్యై నమః
ఓం బహురూపాయై నమః
ఓం బుధార్చితాయై నమః
ఓం ప్రసవిత్ర్యై నమః
ఓం ప్రచండాయై నమః
ఓం ఆజ్ఞాయై నమః
ఓం ప్రితిష్ఠాయై నమః
ఓం ప్రకటాకృతయే నమః
ఓం ప్రాణేశ్వర్యై నమః
ఓం ప్రాణదాత్ర్యై నమః
ఓం పంచాశత్పీఠ రూపిణ్యై నమః
ఓం విశృంఖలాయై నమః
ఓం వివిక్తస్థాయై నమః
ఓం వీరమాతాయై నమః
ఓం వియత్ప్రసవే నమః
ఓం ముకున్దాయై నమః

ఓం ముక్తి నిలయాయై నమః
ఓం మూలవిగ్రహా రూపిణ్యై నమః
ఓం భావజ్ఞాయై నమః
ఓం భవరోగఘ్న్యై నమః
ఓం భవచక్ర ప్రవర్తిన్యై నమః
ఓం ఛందస్సారాయై నమః
ఓం శాస్త్రసారయై నమః
ఓం మన్త్రసారాయై నమః
ఓం తలోదర్యై నమః
ఓం ఉదారకీర్తయై నమః
ఓం ఉద్దామ వైభవాయై నమః
ఓం వర్ణరూపిణ్యై నమః
ఓం జన్మమృత్యుజరాతప్తజన
విశ్రాన్తిదాయినై నమః
ఓం సర్వోపనిషదుద్ఘష్టాయై నమః
ఓం శాన్త్యతీత కళాత్మికాయై నమః
ఓం గంభీరాయై నమః
ఓం గగనాంతస్థాయై నమః
ఓం గర్వితాయై నమః
ఓం గానలోలుపాయై నమః
ఓం కల్పనారహితాయై నమః
ఓం కాష్ఠాయై నమః
ఓం అకాన్తాయై నమః
ఓం కాంతార్థ విగ్రహాయై నమః
ఓం కార్యకారణ నిర్ముక్తాయై నమః
ఓం కామకేళి తరంగితాయై నమః
ఓం కనత్కనక తాటంకాయై నమః
ఓం లీలావిగ్రహధారిణ్యై నమః
ఓం అజాయై నమః

ఓం క్షయవినిర్ముక్తాయై నమః
ఓం ముగ్ధాయై నమః
ఓం క్షిప్రప్రసాదిన్యై నమః
ఓం అంతర్ముఖ సమారాధ్యాయై నమః
ఓం బహిర్ముఖ సుదుర్లభాయై నమః
ఓం త్రయ్యై నమః
ఓం త్రివర్గనిలయాయై నమః
ఓం త్రిస్థాయై నమః
ఓం త్రిపుర మాలిన్యై నమః
ఓం నిరామయాయై నమః
ఓం నిరాలంబాయై నమః
ఓం స్వాత్మారామాయై నమః
ఓం సుధాసృతయై నమః
ఓం సంసారపఙ్క నిర్మగ్న
సముద్ధరణ పణ్డితాయై నమ
ఓం యజ్ఞప్రియాయై నమః
ఓం యజ్ఞకర్త్యై నమః
ఓం యజమాన స్వరూపిణ్యై నమః
ఓం ధర్మాధారాయై నమః
ఓం ధనాధ్యక్షాయై నమః
ఓం ధనధాన్య వివర్ధిన్యై నమః
ఓం విప్రప్రియాయై నమః
ఓం విప్రరూపాయై నమః
ఓం విశ్వభ్రమణ కారిణ్యై నమః
ఓం విశ్వగ్రాసాయై నమః
ఓం విద్రుమాభాయై నమః
ఓం వైష్ణవ్యై నమః
ఓం విష్ణుస్వరూపిణ్యై నమః
ఓం అయోన్యై నమః

ఓం యోనినిలయాయై నమః
ఓం కూటస్థాయై నమః
ఓం కులరూపిణ్యై నమః
ఓం వీరగోష్ఠి ప్రియాయై నమః
ఓం వీరాయై నమః
ఓం నైష్కర్మ్యాయై నమః
ఓం నాదరూపిణ్యై నమః
ఓం విజ్ఞానకలనాయై నమః
ఓం కల్యాయై నమః
ఓం విదగ్ధాయై నమః
ఓం బైందవాసనాయై నమః
ఓం తత్త్వాధికాయై నమః
ఓం తత్త్వమార్థ స్వారూపిణ్యై నమః
ఓం సామగాన ప్రియాయై నమః
ఓం సౌమ్యాయై నమః
ఓం సదాశివకుటుంబిన్యై నమః
ఓం సవ్యాపసవ్య మార్గస్థాయై నమః
ఓం సర్వాపద్వినివారిణ్యై నమః
ఓం స్వస్థాయై నమః
ఓం స్వభావమధురాయై నమః
ఓం ధీరాయై నమః
ఓం ధీర సమర్చితాయై నమః
ఓం చైతన్యార్ఘ్య సమారాధ్యాయై నమః
ఓం చైతన్య కుసుమప్రియాయై నమః
ఓం సదోదితాయై నమః
ఓం సదాతుష్టాయై నమః
ఓం తరుణాదిత్య పాటలాయై నమః
ఓం దక్షిణాదక్షిణారాధ్యాయై నమః
ఓం దరస్మేర ముఖాంబుజాయై నమః
ఓం కౌళినీకేవలాయై నమః
ఓం అనర్ఘ్యకైవల్యపదదాయిన్యై నమః
ఓం స్తోత్రప్రియాయై నమః
ఓం స్తుమత్యై నమః
ఓం శ్రుతిసంస్తు వైభవాయై నమః
ఓం మనస్విన్యై నమః
ఓం మానవత్యై నమః
ఓం మహేశ్యై నమః
ఓం మంగళాకృత్యై నమః
ఓం విశ్వమాత్రే నమః
ఓం జగద్ధాత్ర్యై నమః
ఓం విశాలాక్ష్యై నమః
ఓం విరాగిణ్యై నమః
ఓం ప్రగల్భాయై నమః
ఓం పరమోదారాయై నమః
ఓం పరామోదాయై నమః
ఓం మనోమయ్యై నమః
ఓం వ్యోమకేశ్యై నమః
ఓం విమానస్థాయై నమః
ఓం వజ్రిణ్యై నమః
ఓం వామకేశ్వర్యై నమః
ఓం పంచయజ్ఞ ప్రియాయై నమః
ఓం పంచ ప్రేతమంచాధి శాయిన్యై నమః
ఓం పంచమ్యై నమః
ఓం పంచభూతేశ్యై నమః
ఓం పచసంఖ్యోపచారిణ్యై నమః
ఓం శాశ్వత్యై నమః
ఓం శాశత్ర్యై నమః
ఓం శాశ్వతైశ్వర్యాయై నమః

ఓం శర్మదాయై నమః
ఓం శంభుమోహిన్యై నమః
ఓం ధరయై నమః
ఓం ధరసుతాయై నమః
ఓం ధన్యాయై నమః
ఓం ధర్మిణ్యై నమః
ఓం ధర్మవర్ధిన్యై నమః
ఓం లోకావతీతాయై నమః
ఓం గుణాతీతాయై నమః
ఓం సర్వాతీతాయై నమః
ఓం సమాత్మికాయై నమః
ఓం బంధూక కుసుమ ప్రఖ్యాయై నమః
ఓం బాలాయై నమః
ఓం లీలా వినోదిన్యై నమః
ఓం సుమంగల్యై నమః
ఓం సుఖకర్యై నమః
ఓం సువేషాఢ్యాయై నమః
ఓం సువాసిన్యై నమః
ఓం సువాసిన్యర్చన ప్రీతాయై నమః
ఓం శోభనాయై నమః
ఓం శుద్ధ మానసాయై నమః
ఓం బిందుతర్పణ సంతుష్టాయై నమః
ఓం త్రిపురాంబికాయై నమః
ఓం దశముద్రా సమారాధ్యాయై నమః
ఓం త్రిపురా శ్రీ వశంకర్యై నమః
ఓం జ్ఞానముద్రాయై నమః
ఓం జ్ఞానగమ్యాయై నమః
ఓం జ్ఞానజ్ఞేయ స్వరూపిణ్యై నమః
ఓం యోనిముద్రాయై నమః
ఓం త్రిఖండేశ్యై నమః
ఓం త్రిగుణాయై నమః
ఓం అంబాయై నమః
ఓం త్రికోణగాయై నమః
ఓం అనఘాయై నమః
ఓం అద్భుత చారిత్రాయై నమః
ఓం వాంఛితార్థ ప్రదాయిన్యై నమః
ఓం అభ్యాసాతిశయ జ్ఞాతయై నమః
ఓం షడధ్వాతీత రూపిణ్యై నమః
ఓం అవ్యాజకరుణామూర్త్యై నమః
ఓం అజ్ఞానధ్వాంత దీపికాయై నమః
ఓం సత్యానంద స్వరూపిణ్యై నమః
ఓం రాజరాజేశ్వర్యై నమః
ఓం ఆబాల గోపవిదితాయై నమః
ఓం సర్వానుల్లంఘ్య శాసనాయై నమః
ఓం శ్రీచక్రరాజ నిలయాయై నమః
ఓం శ్రీమత్త్రిపుర సుందర్యై నమః
ఓం శ్రీ శివాయై నమః
ఓం శివశక్త్యైక్య రూపిణ్యై నమః
ఓం లలితాంబికాయై నమః

# ఓం ఐం హ్రీం. శ్రీం. శ్రీ మాత్రేనమః

# శ్రీ లలితా సహస్రం అర్థం

ఓం శ్రీమాతా, అమ్మా అని నిజమైన భక్తితో ఆర్తితో నీవు తప్ప ఇంకవేరు దిక్కులేదు అని భూలోకంలో భర్తని భార్యని తల్లిదండ్రులు బిడ్డలని పెంచుకున్న మమతలు ప్రేమపాశము నీపైనే పెంచుకుంటే నీ చేతిలో పాశము ప్రేమానురాగ పాశమై అమ్మా మేము మళ్ళీ పునర్జన్మ అన్నదే లేకుండా గర్భ నరకం అనుభవించకుండా శాశ్వతమైన పరమానందాన్ని ఇచ్చి నీదగ్గరకు, తీసుకుంటావు కదమ్మా. కాని మూర్ఖులం ఏక్షణాన ఏరీతిగా జీవనగమనం సాగుతుందో తెలియని ఈ జీవనం చావు పుట్టుక మధ్యలో ఎటు ఊపితే అటు ఊగే ఊయల అని తెలిసికోలేక అనిత్యమైన ఈ భూలోకపు బాధ్యతలు తామరాకు మీదనీటి బొట్టులాగా అంటే తుమ్మ చిగురులాగా మమతలు పెనవేసుకొని దుఃఖిస్తూ ఉంటాము. కాని నీ మమత ని ప్రేమ ని అనురాగం నీ సన్నిధే శాశ్వతం అని నడిపించమ్మా.

శ్రీ మహారాజ్ఞి అమ్మ చతుష్షష్టికళామయవు, క్షణమాత్రంలో సర్వం సంకల్పించి దుష్ట శిక్షణ చేసి శిష్ట రక్షణ చేసే మహారాణి వాయుమనోవేగాల మించిన వేగంతో నీ భక్తుల కాపాడే నీ పాదపద్మాలు వదలి అనిత్యమైన కనురెప్పపాటులాగ కలలామెరసి మాయమైపోయే ఈ భూలోక భ్రాంతుల భ్రమల నుండి మమ్మ్మ కాపాడవమ్మా శ్రీ మహారాజ్ఞి.

శ్రీ మత్సింహాసనేశ్వరీ మహారాజ్ఞివై వజ్రవైఢూర్య మరకత మాణిక్య నవరత్న ఖచిత సింహాసనారూఢురాలవు, రణరంగ ధీరవు, ఎల్లపడు రక్షించే దానవు, 4 సింహాలపై రథా రూఢిని వై మమ్ము కాచే అమ్మా నీ పాద పద్మాలు విడిచి ఎచ్చటికి అమ్మా మా ఆరాటం పరుగులు, ఎవరు అర్థం చేసుకుంటారని, చెప్పినా అర్థం చేసుకోని మనుష్యులు, చెప్పకనే మనసులో బాధలు పోగొట్టి మనః శ్శాంతి సరియైన బాటలలో నడిపించే నిన్ను వదలిమా అన్వేషణ దేని కొరకు అనిపిస్తున్నదమ్మా మాలాగే పుట్టి మాలాగే పెరిగి ధూళిలో కలిసిపోయే వారిని చూస్తూ కూడా నిజమైన శాశ్వత పథంలో నడిపించు తల్లీ.

చిదగ్నికుండసంభూతా పరాబ్రహ్మ తేజస్సు నుండి అమ్మ ఉద్భవించినది. మామూలు అగ్నికంటె కొన్ని కోట్ల వేడిగా, మహా తేజస్సుగా ఉండేదే చిదగ్ని అందులోనుండి అమ్మ పుట్టినది.

దేవ కార్యసముద్యతా : బ్రహ్మాది దేవతలు ప్రార్థింపగా వారిని రక్షించడానికి, దేవతల కార్యము కొఱకు ఉద్భవించింది.

ఉద్యద్భానుసహస్రాభా : వేలాది మంది సూర్యులతో సమానమైనది.

చతుర్బాహుసమన్వితా: అమ్మ నాలుగు చేతులతో ప్రసన్నంగాదేవత రక్షించడానికి పుట్టినది కాని కోట్లాను సహస్ర బాహువులతోనైనా కాపాడగ మహాసమర్థవంతురాలు.

రాగస్వరూప పాశాఢ్యా : దేవతల రక్షణ కొరకు ఉద్భవించి ఒకానొ రూపములో దర్శనమీయవలెననితలచినది కావుననే వెనుకగా ఎడమ భాగవ వెనుక చేతిలో పాశము ధరించినది.

క్రోధాకారాంకుశోజ్జ్వలా : అమ్మ కోపమే అంకుశమై వెనుకుడివైపు ధరించిన

మనోరూపేక్షు కోదండ : పరాశక్తియైన అమ్మ మనస్సే సంకల్ప, వికల్ప రూప ఎఱ్ఱని చెఱకు గడయే క్రింది ఎడమ చేతిలో ధనుస్సు ( బాణము) గా ధరించిన

పంచతన్మాత్రసాయకా : పంచభూతములు భూమి, శబ్ద, స్పర్శ, రూ రసములుగా పంచతన్మాత్రలుగా చెప్పబడిన ఎడమచేతి కుడివైపున అంబుల ధరించినది.

నిజారుణ ప్రభాపూర మజ్జద్బ్రహ్మాండమండలా: బ్రహ్మాండము చంద్రులెందరో కాంతుల వలె అమ్మ అనేకానేక ఎఱ్ఱని కిరణములతో మహాకాం ప్రకాశించు చున్నవని భావించి నిజమైన నమ్మకమున ఉండవలెను.

చంపకాశోక పున్నాగ సౌగంధికలసత్కచా : అమ్మ చిదగ్నినుండి ఉద్భవిం ముందు ఆ రూపము చూసి నిశ్చేష్టులై పైనుండి నెమ్మదిగా వచ్చుచున్న అ చంపక అశోక పున్నాగ సౌగంధికా పుష్పములు ధరించినది, సహజ అమ్మకేశాలు ఏలకి సుగంధ పరిమళాలలతో ఉంటుంది.

కురువింద మణిశ్రేణి కనత్కోటీరమండితా: కురువింద శిలల మధ్యగా ఉండే పద్మరాగమణుల కటక కిరీటము ధరించిన అమ్మ, కిరీటము ఎఱ్ఱగా ఉన్నాయి. కాని భక్తుల అభివృద్ధికి అమ్మ ఆ విధముగా చేయును. ఎఱుపు రంగు తన వారందరి భక్తుల క్షేమము కోసము ధైర్యము, సాహసము విజయము కొఱకు ధరించును.

అష్టమి చంద్ర విభ్రాజ దళికస్థల శోభితా : అమ్మ లలాటము అష్టమిచంద్రరేఖ వలె అన్పిస్తున్నది. మహాప్రకాశముగా నున్నది.

ముఖ చంద్ర కళంకాభమృగనాభి విశేషకా: అమ్మ లలాట భాగము చక్కని కస్తూరి గంధ తిలకముతో చంద్రునికి తిలకము పెట్టినట్లున్నది.

వదన స్మరమాంగల్య గృహతోరణ చిల్లికా: అమ్మ ఎంతో మనోహరముగా నున్నది. అమ్మ మోమునకు చక్కని మంగళ తోరణములవలె అమ్మ ముఖ పద్మమునకు వంగిన విల్లువలె ఉన్న కనుబొమ్మలు ఎంతో మంగళముగా నున్నవి. ఎంతో మోహనముగా ఉంది.

వక్త్రలక్ష్మీ పరీవాహచలన్మీనాభలోచనా: అమ్మ ముఖమే పద్మము అని పోల్చిన తక్కువే, అమ్మ ముఖ పరాకాంతులలో ఈదులాడుచున్నా సువిశాల నయన మీన నేత్రి అమ్మ. సోగలు తీరి కస్తూరి గంధ కాటుకలతో మరింత శోభగానున్నది.

నవచంపక పుష్పాభనాసాదండ విరాజితా: అమ్మ చక్కగా విచ్చుతున్న సంపెంగ గురుతు వస్తున్నట్లుగా దీర్ఘమైన నాశిక చక్కగా నున్నది.

తారా కాంతి తిరస్కారి నా సోదండ విరాజితా: అమ్మ ముక్కుకు రతనాల సూర్యచంద్రులు, నత్తునవ మౌక్తికము పెట్టుకొని అశేష నక్షత్రమండలాన్ని తిరస్కరించు చున్నది.

కర్ణోపరిభాగమందు అమ్మరతన కడిమి గుత్తిపెట్టుకున్నది ( కదంబ మంజీర క్లుప్త కర్ణ పూరమనోహరా)

తాటంకయుగళీభూత తపనోడుప మండలా: పరాశక్తి అమ్మ చెవులకు చంద్ర సూర్య కమండలాల క్రింద రతనాలవి ధరించి, ఐదుకోణాలు గల నక్షత్రమాలికలు ఎఱ్ఱని ప్రకాశముతో, అలాగే రతన తొమ్మిది కోణాలు చెవుల వెనుకగాను మహా ప్రకాశముగా ఉన్నవి.

పద్మరాగ శిలాదర్శ పరిభావికపోలభూ: అమ్మ పరాశక్తి చెక్కిళ్ళు పద్మరా
శిలలకంటెను నునుపుగాను అద్దాలవలె ఎఱ్ఱని కాంతులతో కామేశు రూపము
కనిపించు చున్నది.

నవవిద్రుమ బింబ శ్రీన్యక్కారిరదనచ్ఛదా: అమ్మ పరాశక్తి పెదవులు నూతనము
పరాశక్తిచే సృష్టింపబడిన పద్మరాగ కెంపు రెంటింటి మేలు ఎఱుపు వర్ణకాంతు
అధరాలతో నుండును.

శుద్ధ విద్యాంకురాకార ద్విజపంక్తి ద్వయోజ్జ్వలా: అమ్మ పరాశక్తి పలువరుస
శివశక్తి పదహారు బీజముల వలె పరాధవళకాంతులతో రెండు వరుసలుగా ఉన్న

కర్పూర వీటి కామోద సమాకర్ష ద్దిగంతరా: అమ్మ వేసుకొన్న సుగంధ పరిమ
తాంబూలకాంతులు తూర్పువైపుగా వచ్చును అమ్మ మృదుమధుర అధర తాంబూ
సువాసనల ఆశ్వాదించుటకు దేవతలందరు వాయు ప్రసరణ తూర్పుగా చక
పరిమళము వచ్చునని వరుసగా నిలువ బడెదరు దిగ్దేవతలు.

నిజసల్లాప మాధుర్య వినిర్భర్త్సిత కచ్ఛపీ: అమ్మ అరువది నాలుగు క
ప్రపూర్ణమైన కంఠముతో ఆలాపనగా మాట్లాడగా సరస్వతీ దేవి వీణకచ్ఛపి
పడినది.

మందస్మిత ప్రభాపూర్మజ్జత్ కామేశ మానసా: అమ్మా చిరునగవు చెక్కి
కామేశుని ప్రతిబింబము కనుపడుటచే ఈశుని నుండి వెలువడుకాంతుల ప్రభా
వలె ఉన్నది.

అనాకలిత సాదృశ్య చుబుక శ్రీవిరాజితా: అమ్మ అందాల మోహన రూపము
పరిపూర్ణత తెచ్చినట్లు గుండ్రముగా అమ్మ చిఱునవ్వు అందాలు చూపింప వలె
అంతముగా అందాల చుబుకము వలె ఉన్నది. జగత్ సౌందర్య అందాల
మరింత వన్నె తెచ్చి దేనితోను పోల్చవీలులేనిదై అమ్మ ముఖమండలమునకు
తెచ్చెను చుబుకము.

కామేశ బుద్ధ మాంగళ్య సూత్రశోభిత కంధరా: అమ్మ పరాశక్తి కామే
మాణిక్యాల మాంగల్యము కట్టించుకొన్నప్పుడు, కామేశ కాది విద్యా
పరాశక్తులు ఒక మాంగళ్యము, తన తపోశక్తిని మరో మాంగల్యములో

పరచి, శివునిచే భస్మమైన మన్మథుని సైతము కాది విద్యలో సంజీవిని వల్ల బ్రతికించినది. కామేశ సర్వము భగవతి అను రూపమున వీర్యము, ఐశ్వర్యము, కాది విద్యాయశస్సు, శ్రియము, జ్ఞానము, వైరాగ్యము మొ॥నవి. సర్వము నిచ్చి ఏదీ ఆశించని అమోఘ అనురాగమది అమ్మ ఏకబీజ. కామేశుడు ఏకబీజుడే. సర్వులకు వైవాహిక ఆనంద జీవితం సంతానం జగత్ వృద్ధి, జగత్ రక్షణ ఈ రెంటి కోసమే కామేశుని తపస్సు ఆ తపః ఫలమే పరాశక్తియే అర్ధాంగి శ్రీ లలిత

కనకాంగదీకేయూర కమనీయ భుజాన్వితా: శ్రీ లలితా మహారాజ్ఞగాన రాజసముగా భుజకీర్తులను తొమ్మిది త్రికోణ నక్షత్రాకారములో అటునిటు హంస రతన ముద్రల జాలరులతో అత్యంత అద్భుత అందముగా అమ్మ ఆశ్చర్యానంద తటాకమున ఈదులాడు ఎఱ్ఱని కాళ్ళతో అందమైన ఆడుహంసల వలె ముత్యాల జాలరులతో క్రీడించు నట్లున్నవి.

రత్న గ్రైవేయ చింతాకలోల ముక్తాఫలాన్వితా : ఆరుకోణాల చింతామణికి ముత్యాల జాలరుల ముత్యాలహారము, అనేక దివ్య రత్నాల ఆభరణం.

కామేశ్వర ప్రేమరత్నమణి ప్రతిపణస్తనీ : కామేశునికి, శ్రీ లలిత తన ప్రేమ పూర్వక రతన పతకము మేలిమి ముత్యాలు మేలుజాతి పగడాల దండను వేసెను. అంతియే కాక తన ఇరువక్షాల రత్నాల జగత్ సౌందర్యమును కామేశునికి అర్ధాంగియై తనకు తానే అర్పించుకొన్నది.

నాభ్యాల వాల రోమాళిలతా ఫలకుచద్వయీ : అమ్మ నాభి నుండి బంగారు నూగారు సన్నని తీగెలతకు ఇరువక్షఫలముల వలె ఉన్నవి.

లక్ష్యరోయలతా ధారతా సమున్నేయ మధ్యమా: అమ్మ మాతృ స్థానము ఉత్తుంగ వక్షోస్థలియై యుండి, సన్నని నడుముతో వయ్యారమొప్ప సర్వ శాస్త్ర సాముద్రిక లక్షణ సుగుణస్వరూపి,

స్తనభార శన్మధ్య పట్టబన్ధ వళిత్రయా: అమ్మ ఉత్తుంగ వక్షస్థలికి సన్నని నడుమునకు సుతి మెత్తని ఎఱ్ఱని వస్త్రముతో కట్టి బంగారూ పట్టీ పెట్టిరి.

అరుణారుణ కౌస్తుంభ వస్త్ర భాస్వత్కటీ తటీ: శ్రీ లలిత సహస్రానేక సూర్యకాంతులతో ఎఱ్ఱనిది, ఎఱ్ఱని వస్త్రము ఎఱ్ఱని త్రిచూర్ణ మేలు కలయికల

కలనేత వ్రస్తము అనేక కాంతులతో ప్రకాశించుచున్నది.

రత్న కింకిణి కారమ్య రశనాదామభూషితా : శ్రీ లలిత బంగారు తీగకు ఐదు రతన ముద్రలతో, చిరుసవ్వడి మణుల జాలరులను ధరించినది.

కామేశజ్ఞాత సౌభాగ్య మార్దవోరు దయాన్వితా : కామేశునికి మాత్రమే గ్రహింప దగిన సౌభాగ్య మృధుత్వములు గల తొడలు కలది.

మాణిక్య మకుటాకార జానుద్వయ విరాజితా: శ్రీ లలిత యొక్క మోకాళ్ళు పద్మరాగమణులకిరీట కాంతుల వలె ప్రకాశించు చున్నవి.

ఇంద్రగోప పరిక్షిప్త స్మర తూణాభ జంఘికా శ్రీ లలిత మోకాళ్ళు ఎంతో మోహన మైన ఎఱుపుతో, ఆరుద్ర పురుగులచే తయారు చేయబడిన మన్మథుని అమ్ములపొది జ్ఞాపకం చేసేలా ఉన్నప్పటికి శ్రీ లలిత పరాకాంతి పరాశక్తి.

శ్రీలలిత చక్కని బొద్దుగా ముద్దుగానుండే శీలమండలు గలది.

శ్రీ లలిత యొక్క మీగాళ్ళు తాబేలు వీపును జయించు పాద పద్మాలు కలది.

నఖదీధ్యిత్పంఛన్న నమజ్జన తమోగుణా: శ్రీ లలిత యొక్క పాద పద్మాల నఖాలు (గోళ్ళు) కాంతులు ఆమెకే పాదాక్రాంతులై నమస్కరించు అజ్ఞానాంధకారమును పోగొట్టునని భావము.

పదద్వయ ప్రభాజాల పరాకృత సరోరుహా: శ్రీ లలిత పాద పద్మాలు రతనా మంజీరాలతో జాలరులతో చిరుసవ్వడి మణులతో పారాణి పసుపు పాదా మృదుత్వ సౌకార్యాదులచే ఎట్టిని కమలముల వలె ఉన్నా కాంతి రహితాలు కా అమ్మవిపరాకాంతులతో పరాతత్వ చిహ్నపాదపద్మాలు.

శింజాన మణిమంజీర మండిత శ్రీపదాంబుజా: శ్రీలలిత మణిమయములం అందెల ధ్వనులతో ప్రకాశించు పాద పద్మములచే ప్రకాశించుచున్నది.

మరాళి మందగమనా: శ్రీ లలిత నడుస్తు ఉంటే వయ్యారము అనే ప చాలదు. ఎట్టిని పాదాలగల ఆడ హంస నెమ్మదిగా హుందాగా నడుస్తుంది. అమ్మ శ్రీ లలిత పాద పద్మాల మంజీర ధ్వనులు భక్తుల హృదయా పరానందమును, కష్టములలో నున్న భక్తులకు మహారాజ్ఞీ మహారాజసముగా

వేద వేదాంగాల స్తుతిస్తూ ఉండగా సింహాసనాసీనురాలై న్యాయము కూర్చు నునుమహదానందము, అందరి కన్నుల హృదయాల పరాహంసిని.

సర్వారుణా: శ్రీలలిత యొక్క వస్త్ర, ఆభరణ, పుష్ప శరీర కాంతులన్నియు ఎఱుపుగానుండును.

గూఢగుల్ఫా: మణికాంతుల మోపుగానున్న శీలమండలుగలది.

కూర్మపృష్ఠ జయిష్ణు ప్రపదాన్వితా: శ్రీ లలిత పాదపద్మాలు మోపుగా తాబేలుగురుతు వస్తున్నట్లు, విజయ చిహ్నాపాదాలు.

నఖ దీధిత సంఛన్నమజ్జన తమోగుణా: శ్రీ లలిత పాద పద్మాల కాలిగోళ్ళు కాంతులు అమ్మకు నమస్కరించే కిరీట కాంతులకన్న మిన్నయైన కాంతులతో నున్నది.

పదద్వయ ప్రభాజ్వాల పరాకృత సరోరుహా: శ్రీ లలితా పాద పద్మములు చింతామణి ద్వీప అమృత సరస్సులో పద్మాలు కాంతులధికము చేయుచున్నవి. అమ్మ పాదపద్మాల కాంతుల వల్ల అమృత సరస్సు పద్మాలు కూడా మహోన్నత తేజస్సులమయమై యున్నవి.

శింజాన మణి మంజీర మండిత శ్రీ పదాంబుజా: అమ్మ పాద పద్మమంజీరాలు ఆరు రతనాల ముద్రలతో రతనాలలో చిన్న జాలరులతో చిరు చిరు మణుల శబ్దములతో ఉంటాయి. మణులకు పుష్యరాగమువ్వలు వ్రేలాడుతుంటాయి.

మహాలావణ్య శేషవధి: శ్రీ లలితా దేవి దివ్య సౌందర్య నిధి. దేనితోను పోలిక లేనిది.

మరాళి మందగమనా: శ్రీ లలిత ఎఱ్ఱని పాద పద్మంబులతో ఆడు హంసనడక కలది.

సర్వారుణా: శ్రీ లలితా వస్త్ర ఆభరణ పుష్పశరీర కాంతులన్నియును ఎఱ్ఱని దివ్య తేజస్సుతో ఉండును.

అనవద్యాంగి: శ్రీ లలిత దోషరహిత ఆగమ ధర్మ శాస్త్రీయములయిన అవయవములు వాస్తవానికి గ్రమాలకు కూడా అందనిది అమ్మ.

సర్వాభరణ భూషితా: శ్రీ లలితా మహారాజ్ఞికాన శిరముని దివ్య చూడామణి మొదలు మట్టెల వరకు గల ఆభరణములన్నియును అమ్మ ఒక్కతే ధరించును. పాదాల మట్టెలు మంజీరములతో పొందు పరచబడును. రతనాల మయమై యుండును. పరతత్వానేక చిహ్నముద్రల ఆభరణములు.

శివకామేశ్వరాంకస్థా: శ్రీ లలిత, నిర్గుణ, సద్గుణ, స్థూల సూక్ష్మాదులన్నిటికి అతీతురాలు. శ్రీ లలిత కామేశున (ఎడమ) వామకామున దర్శన మిచ్చునదని. సుకుమారికావ పంచముఖాలతో మహాపరాశ్వేతవర్ణ తేజస్సుతో కామేశుడు అమ్మకు వామాంకము చేర్చి సుకుమారి సుఖాసీనాధీశురాలిని చేసెననితలప వచ్చును.

శివా: శివతేజస్సు చిదగ్నియే. శ్రీలలితకూడా చిదగ్నినుండి ఉద్భవించినది కాన శివుని శివ అందురు అమ్మ అదేశక్తిగాన శివా అందరు.

స్వాధీనవల్లభా: సర్వదేవతలు, పార్వతి తవాస్మదాసం అని శివుడు అన్నట్లుగా కాళిదాసు వ్రాసారు. అయితే ఇక్కడ అమ్మ యత్నము, ప్రయత్నము లేకుండానే అమ్మ సర్వభూవనేకైక సర్వాంగ సౌందర్య రాశి సకల సుగుణాధికురాలు సర్వకళలందు ఏకైక పరాశక్తిగాన కామేశుడే స్వాధీనులైరి.

సుమేరు మధ్యశృంగస్థా : మానవులకు అర్థము కానిది కనుపించనిది మేరు పర్వత మధ్య భాగమందలి నాల్గవ శృంగము (కొమ్ము) నకు మధ్యమందు వశించునది. మహాఋషీశ్వరుడు శాపకారణాన మేరు పర్వతమైనాడు. నాల్గవది సామగాన వేదమధ్య నివశించునది.

శ్రీమన్నగరనాయికా: శ్రీచక్రము లేక శ్రీ విద్యా నగరము అని వర్ణించుటవలన శ్రీ లలితమ్మ శ్రీమన్న గన్నగరనాయికా అన్నారు.

చింతామణిగృహంతస్థా: చింతామణి అన్న భక్తుల హృదయంలో ఉండి హృదయాంతరాళాలలో వారి యోగక్షేమాలు స్వయంగా కోరకనే తీరుస్తుంది చింతామణుల మధ్య చింతామణి ద్వీపవాసిని అని అర్థము.

పంచబ్రహ్మాసన స్థితా: శ్రీ లలితా కూర్చొను ఆసనము మంచాధిశాయి

అంటారు. బ్రహ్మ విష్ణు మహేశ్వర రుద్రులు నాలుగుకోళ్ళ వద్య పలక భాగాన సదాశివుడు ఉన్న ఆసనము కలది.

మహాపద్మాటవీ సంస్థా: దేహమే దేవాలయము కుండలినీ శక్తి జాగృతమై నాగువలె ఉండి ఇళ పింగళ సుషుమ్న నాడులు షట్ చక్రాలు పద్మాలే సహస్రారపైన శ్రీ లలిత ఉంటుంది. సహస్రారానికి జానా బెత్తెడు దూరంలో సహస్ర ఎట్టిని సహస్ర పద్మంలో ఉంటుంది.

కదంబ వనవాసిని: కదంబవనమందు ఉండునది దుర్వాసుని భార్య ఎంతో భక్తి శ్రద్ధలతో చేసినప్పటికి చిన్న పొరపాటుకి ఆగ్రహం వచ్చి కదంబ వృక్షమై క్షయములేకసర్వము పవిత్రాలు అని తర్వాత బాధపడతాడు. దుర్వాసుడు సాక్షాత్ శివ స్వరూపుడు కదలీఫలాలు దానంవంశాభివృద్ధి. సాక్షాత్ కదంబ ఆకులు అరటి పళ్ళు దూటమరల దుంపలే ఉత్పన్నం అవుతాయి వేరుగా నాటితేచాట

సుధాసాగర మధ్యస్థా : సుధాసాగరం, చింతామణి ద్వీపంలో పన్నెండుగురు మంత్రులు తెల్లని పద్మాసీనులైతే శ్రీలలితా ఎట్టిని సహస్రాసహస్ర పద్మంలో అకస్మాత్తుగా అవతరిస్తుంది.

కామాక్షీ: శ్రీ లలిత తన భక్తుల కోర్కెలను కనులతోనే చూచి మానవ దేవదానవ పదునాలుగు భువనాలలో నిజభక్తుల కోరికలు తానే స్వయంగా తన నేత్రాలతో చూసుకొని తప్పక తీరుస్తుంది.

కామదాయినీ : శ్రీ లలితా భక్తుల ఇహపరసర్వము లైన కోర్కెలు తీరుస్తుంది.

దేవర్షి గణసంఘాత స్తూయ మానాత్మవైభవా: శ్రీలలిత సర్వదేవగణములతోను స్తుతింపబడు అనేకానేక పరతత్వ చిహ్నాలతో కూడుకొన్నది.

భండాసురవధోద్యుక్త శక్తి సేనా సమిన్వితా: శ్రీ లలితా భండాసురుడను రాక్షసుని పై కోపముతో యుద్ధమునకు సైన్యమును శక్తి సేనా సమన్వితం చేసింది. ( భండాసురుడు మన్మథ భస్మమునుండి పుట్టినవాడు)

సంపత్కరీ సమారూఢ సింధూర వ్రజ సేవితా: శ్రీ లలిత అంకుశమునుండి పుట్టినది సంపత్కరీ అనే దేవత, గజాయుధమునకు అధికారిణి, సంతప్కరీ దేవి

అధిష్ఠించి నది రణకోలాహలము అనుపేరు గలది. శ్రీ లలితను సేవించును.

అశ్వారూఢాధిష్ఠి తాశ్వకోటి కోటి భిరావృతా: అశ్వారూఢదేవత అపరాజిత అనే అశ్వము నెక్కి వాయుమనోవేగముల మంచి కోట్లాన కోట్ల అశ్వారూఢులైన శక్తులను నాయకురాలై శ్రీలలితను సేవించును.

చక్రరాజరథారూఢ సర్వాయుధపరిష్కృతా: శ్రీ చక్రమునకు చక్రరాజమనిపేరు శ్యామలాదేవి మంత్రిణి ఆమె రథమునకు గేయచక్రమని పేరు. వారాహిదేవి సేనా నాయకురాలు. ఆమె రథమునకు గిరి చక్రమని పేరు, ధ్వజము ఆనందధ్వజము ఈ రెండు రథములు శ్రీదేవి లలితా దేవి స్వరూపం, ఈ రెండు రథములలో శ్రీదేవి ఆయుధములుండును. శ్రీదేవి ఆయుధములచే అలంకరింపబడిన రథము పరాశక్తి స్వరూపము.

కిరి చక్రరథారూఢ దండ నాథా పురస్కృతా: వరాహమునకు కిరి అనుపేరు అట్టి ఆకారములో వరాహములకు కట్టిన కిరి చక్రమని పేరు అట్టి కిరి చక్రము నధిష్టించిన దండనాయక యగు వారాహీదేవి చేత సేవింబబడునది.

జ్వాలామాలిని కాక్షిప్త వహ్ని ప్రాకారమధ్యగా: శ్రీలలితా నిలయమున రాత్రి పగలు చింతామణీద్వీపమున ఉండవు సర్వమణి ప్రభావ శ్రీలలితాకాంతులతో అనేక శక్తి కాంతులతో దేదీప్యమానముగా నుండును.

భండసైన్య వధోద్యుక్త శక్తి విక్రమ హర్షితా: శ్రీ లలితా దేవి తన అరువది నాలుగుకోట్ల చతురంగ బలములు భండాసురుని వధించినపుడు చూచి ఆనందించునది.

నిత్యపరాక్రమాటోప నిరీక్షణ సముత్సుకా: నిత్యదేవతలయిన పదునైదు తిథిదేవతలు విజృంభించి దమనకాదులనే అనిత్య దేవతలను చంపిరి. అట్టి సమయంలో అందరి దేవతలతో పాటు శ్రీలలితా ఆనందించును.

భండపుత్ర వధోద్యుక్త బాలావిక్రమ నందితా: భండాసురుని పుత్రులై చతుర్బాహుడు మొదలు ఉపమాయుడు వఱకు ముప్పదిమందిని లలితాదేవి పుత్రి అయిన బాలాత్రిపురసుందరి చంపిన వార్తకు అమ్మ ఎంతో ఆనందించినది.

మంత్రిణ్యం బావిర చిత విషంగవధ తోషితా: భండాసురుని సోదరులైన విషం

విశుక్రులను శ్యామలాదేవి చంపెను. శ్రీలలిత దుష్ట శిక్షణకు చాలా సంతోషించును.

విశుక్ర ప్రాణ హరణ వారాహీ వీర్యనందితా: దండినీదేవి విశుక్రుడని రాక్షసుని చంపిన కారణాన శ్రీలలిత సంతోషించినది. దండినీ దేవిని వారాహిదేవి చేత ఆరాధింపబడును.

కామేశ్వరముఖాలోక కల్పిత శ్రీగణేశ్వరా: దండినీదేవి చేత చంపబడిన విశుక్రుడు కడసారి శక్తితో జయవిఘ్నమను అస్త్రమాయెను. శ్రీలలిత ఆశ్చర్యమున కామేశుని చూడగానే మహాగణపతి ఆవిర్భవించెను. అతడా అస్త్రమును ఛేదించెను.

మహాగణేశ నిర్భిన్న విఘ్నయంత్రప్రహర్షితా: రాక్షసులచే ఉపయోగింపబడిన విఘ్నయంత్రములను మహాగణేశుడు నశింపచేసెను. శ్రీలలిత సంతోషించెను.

భండాసురేంద్ర నిర్ముక్త శస్త్ర ప్రత్యస్త్ర వర్షిణి: భండాసురుడు సర్వము కోల్పోయి తానే యుద్ధము చేయుచు అస్త్రశస్త్రములను ఉపయోగించు చున్నాడు. వాటికి ప్రతి అస్త్రాలు శ్రీదేవి వర్షమువలె కురిపిస్తోంది.

కరాంగులీనఖోత్పన్న నారాయణదశాకృతిః: భండాసురుడు సర్వరాక్షసులను పుట్టించు అస్త్రమును ప్రయోగించాడు అనేక రాక్షసులు ఉత్పన్నమగుచుండగా, శ్రీ లలితా దేవి తన చేతి వేళ్ళ గోళ్ళనుండి దశావతారాలను సృజించి ఆయా రాక్షసులను వధింపచేసినది.

మహాపాశుపతాస్త్రాగ్ని నిర్దగ్ధా సురసైనికా: శ్రీదేవి మహాపాశుపతాస్త్రాన్ని ప్రయోగించి సర్వ రాక్షసులను సంహారము గావించినది. శ్రీ లలితా దేవి సంతోషించినది.

కామేశ్వరాస్త్ర నిర్దగ్ధ భండాసుర సైన్యకా: కామేశాస్త్రము అన్నింటిని మించినది లేదు. ఆ అస్త్రమును ప్రయోగించి శూన్యకమను పేరుగల భండాసురుని నగరము అతనిని దహింపచేసి శ్రీలలితా దేవి ఆనందించినది.

బ్రహ్మోపేంద్ర మహేంద్రాది దేవసంస్తుత వైభవా: భండాసురాది రాక్షసుల బారినుండి రక్షించబడిన బ్రహ్మ విష్ణు ఇంద్రాది దేవతలు లలితా దేవిని ఆనందంతో వైభవోపేతంగా ఆనందంగా స్తుతిచేసారు.

హరనేత్రాగ్ని సందగ్ధ కామ సంజీవినౌషధి: పరమేశ్వరుని త్రినేత్రంనుండి అగ్ని జ్వాలలు ప్రజ్వరిల్లి మన్మథుని నిలువెల్ల బూడిద చేసాయి. రతిదీనంగా ప్రార్థింప దేవతలు మన్నించమని కోరగా మన్మథుని మరల జీవింపచేసింది. శరీర రహితుడైన మన్మథుడు శ్రీలలితమ్మ కరుణ సంజీవిని వలన జీవింప చేసినది.

శ్రీ మద్వాగ్భవకూటైక స్వరూప ముఖపంకజా: శ్రీ విద్యారూప పంచ దశ విద్యలో మొదటి కూటము వాగ్భవ కూటకము. అయిదు బీజములు కలిగి యుండును లలితా దేవి స్థూల రూపముఖముగా నున్నది.

కంఠాధ కటిపర్యంత మద్యకూట స్వరూపిణి: కంఠమునుండి నడుమువఱకు భాగము శ్రీలలితాదేవి మధ్య ప్రదేశమున పంచదశీమంత్రమందున్న కామరాజమను కూటమి ఉన్నది.

శక్తి కూటైక తాపన్న కట్యధోభాగధారిణి: సత్పురుషుల శక్తితో కూడిన శక్తి అట్టిది శక్తిని శ్రీలలితాదేవి తనకటి ప్రదేశమునకు క్రింది బాగమున కలిగియున్నది.

మూలమంత్రాత్మికా: సంసార బంధన విముక్తి మోక్ష ప్రాప్తి, అట్టి మంత్రస్వరూపిణియే శ్రీ లలితాదేవి.

మూల కూటత్రయ కళేబరా: మూలమంత్రమందలి కూటత్రయమే శరీరముగా కలిగినది శ్రీ లలితాదేవి. ఈ బీజమే ఆత్మగా గలదని చిద్రూపమని భావము. మూలమంత్రమనగా శ్రీం అనే కామ బీజము.

కుళామృతైకరసికా: దేహమే కుళం, స్వచ్ఛమైన తంత్రములతో కూడుకొన్నది. శరీర సంబంధముగాని కుళామృతము నందుముఖ్యముగా రసాస్వాదనమందు ఆసక్తి గలది శ్రీలలిత.

కులసంకేతపాలిని: పరాశక్తి శ్రీలలిత మహామహోన్నతమైన శ్రీవిద్యతో మహాపతివ్రత కులస్త్రీ అందరితో బయటకు ఏలరారో శ్రీ విద్యకూడా కోరుకొనువారికి తప్ప అందరికి ఇష్టమున్నా లేకున్నా చెప్పెడిదికాదు.

కులాంగనా: శ్రీలలిత విద్య శ్రీవిద్య మహాపతివ్రతలకు సర్వసుగుణములతో రక్షింప బడుదురో అది నిగూఢమైనరహస్య భద్ర శ్రీవిద్య.

కులంతస్థా: ఇంద్రియ సమూహమే కులము అట్టి కులమునందు నివశించునది శ్రీలలితా.

కౌళిని : సుగుణాలు, సద్గుణ శీలవతుల పతివ్రతలచే పతీ గృహము, దేహము, దేశము ప్రతీవంశమునందు పూజింపబడుచున్నది.

కులయోగినీ: వేదబాహ్యులచే పూజింపబడు మార్గము కౌళాచారము. వైదికులాచరించునది సమయాచారము కనుకనే కులయోగిని శ్రీలలిత అనిరి. కౌళాచారము బలులతో భీకరపూజ.

అకులా: కుళసంబంధము లేనిది అకుళ ఆపైన కుళము గురించి చెప్పి ఇపుడు అకుళను గూర్చి చెప్పుటయే సమయాచారమని శ్రీ లలితా పూజ చెప్పబడినది.

సమయాంతస్థా: శ్రీ లలిత సమయాచారములో వశిష్ఠ మహర్షిచేత పూజింపబడినది. మహర్షులచే ఆచరింపబడినది సమయాచారము.

సమయాచారతత్పరా: ఆశీ లలితక వేదోక్తయుక్తమైన సమయాచార పద్ధతినందు మిక్కిలి ప్రీతి కలది. యోగమార్గము సమయాచారమే. మహాసాధ్వీకత్వము ఇష్టము.

మూలాధారైక నిలయా: మూలాధారమందలి నాలుగురేకులు గల పద్మకర్ణికా మధ్యమున కులకుండల శక్తి బిందువు నందుండును. అది సర్వదానిద్రించును. దానికే మూలాధారము. శ్రీలలిత సహస్రారము జానాబెత్తెడు దూరంలో సహస్రాసహస్ర ఎట్టిని కమలములో దేహమందుండును అన్ని చక్రము ఒక నాళము ఉండును. దానిద్వారా మూలాధారము గణపతి అధీష్ఠానములోనున్నప్పుడు మానవదేహము తినగలదు. ఒక్కొక్క శాంతి శరీర అగ్నియజ్ఞగుండమునకు నివేదన ఆ విధముగా చేయబడును.

బ్రహ్మగ్రంధి భేదిని: బుద్ధి మాయచే కప్పబడును. అపుడు మాయను ఛేదించవలయును. కాని మాయయే శ్రీలలితా స్వరూపము అందువలన బ్రతిమాలుకొని నవ విధ భక్తులలో ఏదో ఒకవిధమున అమ్మను ప్రసన్నము చేసికొన్న శ్రీమహారాజ్ఞ శ్రీలలిత ముద్రిక సంపాదించవచ్చును.

మణిపూరాంతరుదితా: శ్రీలలితను సమయాచర పూజయందు నాభినందు దళదళపద్మమందు రత్నాలంకృతమై శ్రీలలితా దేవిగల చక్రము మణిపూరకము

బ్రహ్మగ్రంధిని బేధించిన దేవి ప్రకటితముగును.

విష్ణుగ్రంధివి భేదిన: మణిపూరచక్రమునకు పైనగల విష్ణు గ్రంథిని బేధించి మణిపుర చక్రము విష్ణుస్థానము కావున విష్ణుగ్రంధీ అనిపేరు. శ్రీ లలితా విశేషించి భేదించును.

అజ్ఞాచక్రాంతరాళస్థా: కనుబొమలు మధ్యగురుస్థానము కనుబొమ ముడిరెండు దళములు. శ్రీలలితాదేవి ఉండును.

రుద్రగ్రంధివిభేదిని: హృదయంలో అనాహత చక్రము ( వాయు ఆకాశరూపము) రెండు గ్రంథులు గలవు శ్రీలలితా దేవిబేధించును. నాగకుండలి మహాజడము దీనిని మేల్కొలిపి సాధనలో అమ్మ సహాయము అపారం.

సహస్రాంబు జారూఢా: బ్రహ్మరంధ్రము క్రింద వేయి దళముల పద్మములో శ్రీలలిత కంఠములోనున్న ఆత్మను వెలుపలకు తీసి తనను తాను తెలిసికొనుట ఇదియే. ఆత్మతో పరమాత్మ శ్రీ లలితను చూడవచ్చును.

సుధాసారాభి వర్షిణి: సహస్రారకముల నుండి నురగలు క్రక్కుచు అమృత ధారలు ముఖమంతా చిక్కని తేజస్సుగల పాలవలె ధారగా శరీరము మహా అనుభవం ఒక వింత అనుభూతినిండును.

తటిల్లతాసమరుచి: ఒక మహాద్భుత భాష కందని ఆత్మానంద స్థితి. శ్రీ లలిత పరాశక్తాత్మకమైన మెఱుపుతీగ మహోన్నత కాంతి గలది అజ్ఞానము. మాయ తొలగింపబడును. ఈ స్థితిలో మానవదేహము దివ్య బంగారు కాంతులతో నుండును.

షట్చక్రోపరిసంస్థితా: మూలాధార, స్వాధీనష్ఠాన మణిపుర అనాహత, విశుద్ధ అజ్ఞాన అనెడు ఆరు చక్రములపైన గల సహస్రార చక్రమునందు దేవి ఉండును.

మహాశక్తి: శివశక్తి సంయోగ రూపమైన ఉత్సవమున ఆసక్తి కలది. శ్రీలలి కామేశ్వరుని నామసారూప్యమునుపొందుట అను ఉత్సవము నంద ఆనందా, ఆశ రెండును కలది.

కుండలినీ: కుండలినీ యనగా కుండలముల్కు గోళాకారములో మూలాధ

చక్రమందు చుట్టుకొని సర్పాకారము కలిగి తేజోరూపముతో ప్రకాశించించు కుండలిని యే శ్రీలలితాదేవి (మూలాధారమందు అగ్నితేజమధ్యస్థమైన జీవశక్తి తేజోరూపమైన ప్రాణాకారము కలిగినది మూడు చుట్టలు చుట్టుకొని మహాజడమై జటిలమై, అతికష్టాతి కష్టము కుండలినీ నాగశక్తి లేపుట, సర్వము మనసా వాచా కర్మణా వీడి ఐహిక బంధ అనురాగ విరాగమాని భగవంతుడా నీవే దిక్కు మహాప్రభో మాయలో మునిగి యున్న రక్షించు నీవుకాదంటే వీలు లేదని ఎండవాన చలి రుచిస్థలము స్త్రీ? పురుషా? ఎవరు అన్నది మరచి ధ్యాన నామం చేస్తే ఆ శ్రీ లలితా దేవి చిదగ్ని వేడికి లేస్తుంది. ఇక లేచినదా లేడిలా పరుగులు తీసి సర్వ చక్రాలు జాగృతము అవుతాయి. సరే పూర్వజన్మలో చేసాము ఇప్పుడు చెయ్యాలా అనికాదు. ఎప్పటికప్పుడే శ్వాసనామ లీనము అది ఆగిన వెంటనే భగవత్ పరమాత్మ లీనము. సృష్టించి అనుభపూర్వకముగా అనేక కష్ట నష్టాలు బాధలు ఆటంకాలు సమస్యలు భూలోకం ఉన్న బాధలన్నీ దైవము కార్యానికి కలిసికట్టుగా ఒక్కసారి వచ్చి చుట్టు ముట్టినా నమ్మకము సహనము పట్టుదల ఎన్నడూ వీడకుండా సాధన చేస్తే అగ్నిలో పడ్డ పత్తి పోగులా దైవము దారి ఇచ్చేస్తుంది.

బిసతంతుత నీయసీ: తామర తూడులోని దారమువలె సన్నగా ఉండును అణురూపమైన పీత (పసుపు) వర్ణము కలది. జాగృతమైనవారి శరీరము తేజస్సుతో నేత్రాలు గోళములవలె తేజస్సుగా ఉండును.

భవాని: భవ అనగా పరమేశ్వరుడు, సంసారము కామము అని అర్థములు. వీనిని శక్తి జీవింపచేయుటచే భవాని అని పిలువ బడుచున్నది.

భావనాగమ్యా: పూజాదిక్రమములు ముందుపటము రూపము నిలుపుకొనుట స్థిరముగ కూర్చొనుటకు అలవాటు పడినప్పటికి మనస్సు అనే శస్త్రము సంధించి ధ్యానము అనే అమృతభాండ అమరత్వ పరాబ్రహ్మ తేజస్సే శ్రీ లలిత ఎవరి ఇష్టదేవత అయినా మార్గము మాత్రము నవవిధ భక్తులే.

భవారణ్య కుఠారికా: దుఃఖ భూయిష్టమైన సంసార అరణ్యమును నశింపచేసి ముక్తి ప్రసాదించవమ్మా శ్రీలలితా.

భద్రప్రియా: మంగళము శుభములు కల్యాణ ప్రదము శుభవాక్కు మనసా వాచాకర్మణా అన్న శ్రీలలితకు ఇష్టము

భద్రమూర్తి : మంగళకరమైన స్వరూపము కలది.

భక్తి సౌభాగ్య ప్రదాయినీ: భక్తులకు సంపూర్ణ ఫలములు ఇచ్చునది శ్రీ లలితా.

భక్తిప్రియా: భక్తియందు ప్రీతి కలది.

భక్తిగమ్యా: భక్తి మార్గమే దేవిని పొందుటకు సులభమైన మార్గముగా గ్రహించునది.

భక్తివశ్యా: భక్తులకు వశురాలని భావము

భయాపహా: నీరు భూమి అగ్ని అనే భయములు పోగొట్టును.

శాంభవి: శంభుని భార్య కనుక శాంభవి

శారదారాధ్య: సరస్వతీ వశిన్యాది వాగ్దేవతలు అనువారిచే పూజింపబడునది.

శర్వాణి: శివుని యొక్క ఎనిమిది మూర్తులలో పృథ్వి రూపమునకు శర్వుడను పేరు శర్వుని సతి శర్వాణి.

శర్మదాయినీ: భక్తులకు సుఖమును ప్రసాదించునది.

శాంకరీ: సుఖములు ప్రసాదించు శంకరునికి సతి శాకరి.

శ్రీకరి : లక్ష్మీ కటాక్షమును ప్రసాదించునది

సాధ్వీ: ఇతరులకు సాధ్యముకాని మహాపతివ్రత

శరచ్చంద్ర నిభాననా: శరత్ కాలపూర్ణిమనాటి శ్రీలలితా దేవి ముఖము సంపూర్ణ చంద్రబింబమును గురుతుకు తెచ్చును. కోట్లానేకకోట్ల చంద్రుని తేజోమయిని పౌర్ణిమ చంద్ర బింబము పోల్చుట కష్టము. చంద్రుని కన్నాలక్ష్మీదేవి తేజస్సు మరి ఎవ్వరితోను పోల్చలేనంత అనంత తేజస్వి శ్రీ లలితా.

శాతోదరీ: సూక్ష్మమైన ఉదరము కలది

శాంతిమతీ: అంతరింద్రియ నిగ్రహము కలది.

నిరాధారా: జగత్తు కంతయు ఆధారము శ్రీలలితా వేరే ఆధారమే లేదు నిరాధా అనబడును.

నిరంజనా: మాయారహితమైన జ్ఞానము జ్ఞాన స్వరూపము చిత్ స్వరూపముగలది శ్రీ లలితా.

నిర్లేపా: తామరాకు మీద నీటివలె శ్రీ లలితాదేవి సర్వలోకములు సృష్టించినను నిరామయగా ఉండి ఈ జగమంతాజలమైనప్పుడు మఱ్ఱి ఆకుపై బాలకృష్ణుడు తేలు స్వభావము.

నిర్మలా : మాయా సంబంధమగు మలాదుల నంటక స్వచ్ఛముగా యుండును.

నిత్యా: త్రికాలములయందు సత్య నిత్యము తెలుసుకొనునది త్రికాల బాధ్యత గలది శ్రీ లలితా.

నిరాకార: ఉన్నట్లును లేనట్లును నిరాకారముసగుణాకారము స్థూలరూపి సూక్ష్మరూపి అన్నిటికి అతీతమై ఆద్యంత రహితురాలు.

నిరాకులా: వ్యాకులములేనిది శ్రీలలితా (దేనికి ఆరాటము ఆతృత, బాధ లేనిది).

నిర్గుణా: గుణాతీతురాలు ఇట్టి గుణములు కలది అని నిశ్చయముగాచెప్పలేనిది శ్రీలలితా.

నిష్కళా: అవయవ గుణాదులు లేనిది

శాంతా: ఆది మధ్య అంతము లేలేని యుగాలు

కల్పాంతాలు శాశ్వతురాలు శ్రీ లలిత శ కారము అంతము లేనిది అని అర్థము.

నిష్కామ : కామరహితురాలు

నిరుపప్లవా: శ్రీ లలితా దేవి అమృత తత్వము సేవించు భక్తులకు శాశ్వత అమృత తత్వము ప్రసాదించును.

నిత్యముక్తా: శ్రీ లలిత నిత్యముక్తురాలు గాన భక్తులను నిత్యముక్తులుగా అనుగ్రహించును.

నిర్వికార: శ్రీ లలిత మహత్తు మొదలైన తత్వములకు అతీతురాలు నిర్వికార పరాశక్తి.

నిష్ప్రపంచా: శ్రీ లలితా లోకాలన్నిటక అతీతురాలు.

నిరాశ్రయా: శ్రీలలితా స్వయం ప్రకాశరాలు రూపముకలది.

నిత్యబుద్ధా: శ్రీ లలితా జ్ఞాన, చిద్రూపము (సదానందము) కలది.

నిరవద్యా: శ్రీలలిత తననే ఆశ్రయించు వారిని ఎన్నడు నరకమున పడనీయదు. తన భక్తుల కాపాడును.

నిరంతరా: శ్రీలలితా ఏ ఛిద్రములు లేక భేద రహితురాలగుటచే నిష్పక్షపాత్రురాలు శ్రీలలితా.

నిష్కారణ: శ్రీ లలిత అమృత స్వరూపిణి

నిష్కళంకా: శ్రీలలిత ఏకళంకము లేనిది

నిరుపాధి: సదాచిదానంద స్వరూపిణి ఉపాధి రహితమై ( ఉనికి ఎచ్చట అన్నది చెప్పలేము) నది శ్రీలలిత.

నిరీశ్వరా: అందరకు అమ్మ కనుక ఈశ్వరి అనవచ్చును శ్రీలలితాదేవి అమ్మలగన్న అమ్మ.

నీరాగ: భక్తుల కోరికలు నెరవేర్చునేకాని స్వతః వాంఛారహిత శ్రీ లలితా నీ రాగయని భావము.

రాగమథనా: క్లేశహేతువులైన రాగాదులను మదించునది శ్రీలలితా.

నిర్మదా: శ్రీలలితా మదన రహితమైనది.

మదనాశిని : మత్తును పోగొట్టునది శ్రీలలితా

నిశ్చింతా : శ్రీలలిత స్వతహాగా ఏ చింతలులేనిది, భక్తుల చింతలను కూడా పోగొట్టును.

నిరహంకారా: శ్రీలలిత సత్వరజోతమో గుణ రహితురాలు.

నిర్మోహ: శ్రీలలిత నిర్గుణ సద్గుణ అని శరీరమని అనుకొననిది పరాశక్తి.

మోహనాశిని: శ్రీలలితా ద్వైతభావమును నశింపచేసిన అఖండాకార వృత్తిని ప్రసాదించునది.

నిర్మమా: శ్రీలలితా మమకారమును నశింపజేసి అఖండాకార వృత్తిని ప్రసాదించునది.

మమతాహన్త్రీ: శ్రీలలితా భక్తులకు మమ కారమును పోగొట్టి సస్వరూప జ్ఞానము (ఆత్మజ్ఞానము) ప్రసాదించును.

నిష్పాపా: శ్రీదేవి పాపరహితురాలు

పాపనాశినీ: శ్రీలలితా తనను ఆశ్రయించిన వారి పాపములను నాశనము చేయునది.

నిష్క్రోధా: స్వతః క్రోధ రహితురాలై సర్వజీవులయందు అపార ప్రేమగలది శ్రీలలితా.

క్రోధశమనీ: కోపములను నాశనము చేయునది శ్రీ లలితా

నిర్లోభా: తనయందు గల ఔదార్యము వలన నిర్లోభ యనబడుచున్నది శ్రీలలితా.

లోభనాశినీ: శ్రీలలితా లోభముల పోగొట్టును.

నిస్సంశయా: శ్రీదేవి సంశయ రహితురాలు

సంశయఘ్నీ: శ్రీలలితా సంశయములు పోగొట్టునది.

నిర్భవా: శ్రీలలితా పుట్టుక లేనిది.

భవనాశనీ: శ్రీలలితా పునర్జన్మ లేకుండా చేయునది.

నిర్వికల్పా: శ్రీ లలితా సంకల్ప వికల్పరహితురాలై తిరుగులేని నిశ్చయము నిస్సంయ భావము గలది.

నిరాబాధా: శ్రీలలితా భ్రాంతి రహితురాలై యుండును గనుక నిరా బాధా యని పిలువ బడుచున్నది.

నిర్భేదా: శ్రీలలిత సత్తు, అసత్తు అను భేదభావములేనిది. నిత్యాఅనిత్యాలకతీతా.

భేదనాశిని: భక్తుల యందలి భేధ భ్రావమును పోగొట్టునది శ్రీలలితా!

నిర్నాశా: శ్రీలలితా ఆదిమధ్య అంతంబులు లేనిది.

మృత్యుమథనీ : భక్తులను అశాశ్వతజగత్తు నుండి శాశ్వత అమరత్వము ప్రసాదించి మృత్యువును నశింపచేయునది.

నిష్క్రియా: శ్రీ లలితా దేవతా శక్తుల ఆజ్ఞాపించును కాని, తాను మాత్రము క్రియారహితురాలు.

నిష్పరిగ్రహా: శ్రీ లలితా తానంతట తానుగా పట్టుకొనజాలదు దేవతలకు ఆజ్ఞాపించుటేగాన పరిగ్రహము లేనిది.

నింస్తులా: శ్రీ లలితాదేని తోను ఉపమానములేనిది.

నీలచికురా: శ్రీలలిత నల్లని శిరోజాల గలది.

నిరపాయా: అపాయములేనిది శ్రీలలితమ్మ

నిరత్యయా: శ్రీలలితా నిశ్చల భావా బావములు న్యూనాధికములు లేనిది.

దుర్లభా: శ్రీ లలితా యోగులకు సహితము లభించనిది.

దుర్గమా: శ్రీ లలితా సంకల్పముచే దుర్గముడను రాక్షసుని సంహరించినది.

దుర్గా: శ్రీ లలిత తీవ్ర కష్టాలు పద్మవ్యూహముకన్నా అధమాధమ కష్టాలలో ఎట్టి కఠిన కష్టమైన కాపాడునది.

దుఃఖహంత్రి: శ్రీ లలితా సర్వదుఃఖములను నాశనము చేయునది.

సుఖప్రదా: సర్వ సుఖములను ప్రసాదించునది.

దుష్టదూరా: శ్రీలలితా దురాచారులకు దూరముగా పొంద శక్యము కానిది.

దురాచారశమ ని: శ్రీలలితా భక్తులను దురాచారాలనశింప చేసి, సదాచారపరులనుగా చేసి ధర్మము నేర్పి తనవారలుగా చేసికొనును.

దోషవర్జితా: శ్రీ లలితా దేవి రాగద్వేషాల కతీతమైనది.

సర్వజ్ఞా: శ్రీ లలితకు సర్వము తెలియును

సాంద్రకరుణా: శ్రీలలితా భక్తులయందు దయచూపునది.

సమానాధి కవర్జితా: శ్రీ లలితా ఎవరికి సమాధానము చెప్పనవసరములేదు. శ్రీమహారాజ్ఞి సకల సద్గుణ.

సర్వ శక్తిమయీ: శ్రీలలితా సమస్త శక్తులు కలది.

సర్వమంగళ: సర్వమంగళురాలై భక్తులకు సర్వశుభములను చేకూర్చునది.

సద్గతిప్రదా: శ్రీలలితా తన భక్తులకు ఉత్తమ గతిని ప్రసాదించును.

సర్వేశ్వరీ: శ్రీలలితా సర్వజగత్తునకు ఈశ్వరీయని భావము.

సర్వమయీ: శ్రీలలితా పృధివ్యాది శివత్వాంతము ఈమెయే కావున సర్వమయీ అనవబడుచున్నది.

సర్వమంత్రస్వరూపిణీ: సర్వసప్తకోటి మంత్రములకు మూలము శ్రీ విద్య కనుక సర్వమంత్రస్వరూపిణి.

సర్వయంత్రాత్మికా: శ్రీ లలితా దేవి ఘంటార్గళాది సకల యంత్రములు ఆత్మగా కలదిగాన సర్వయంత్రాత్మిక.

సర్వతంత్ర రూపా: వామకేశర్వాది స్వతంత్ర రూపముగా గలది గాన సర్వతంత్రరూపా.

మనోన్మనీ: మనస్సును చలింపనీయక హృదయమందు లేక భ్రూమధ్య మందు నిలిపి ధ్యానించుటయే ఉన్మనియని ఆ స్థితియందు ధ్యానించు వానికి త్రిపుటి (మనసావాచా కర్మణా) నశించిన ఏ జ్ఞానామృతము సిద్ధించునో ఆ రూపమే శ్రీలలితాయని భావము.

మహేశ్వరి: మహేశ్వరుని అర్ధాంగిగాన మహేశ్వరి అను అర్థము.

మహాదేవి: అనంతమైన శరీరముగలిగి రోమాత్మకుడైన శివుని భార్య మహాదేవి శ్రీలలితా అని అర్థము.

మహాలక్ష్మి: కొల్హాపురీ పీఠస్థురాలైన మహాలక్ష్మి శ్రీలలితయే.

మృఢప్రియా: జీవులకు సుఖమునుకలిగించు సత్వగుణ ప్రధానుడైన శివునకు మృడుడని పేరు ఆయన భార్యగాన మృడప్రియా శ్రీలలితా.

మహారూపా: శ్రీలలితా మహత్తర రూపముకలధి.

మహాపూజ్యా: శ్రీలలితా బ్రహేంద్రులయిన మహాత్ములచే పూజింపబడుటచే మహాపూజ్యాయనబడును.

మహాపాతకనాశనీ: బ్రహ్మహత్యామహాపాతకాలు శ్రీలలితా నామధ్యాన మహాపాతకములు సైతం నశించునది.

మహామాయా: జీవులను సృజించి ఆ జీవులను మోహితుల చేయునది శ్రీ లలితా.

మహాసత్త్వా: శ్రీ లలితా గుణబలములయందు అధికురాలు గావున మహాసత్త్వా యనబడుచున్నది.

మహాశక్తి శ్రీలలితా పరాశక్తి కావున తనను మించిన బలసామర్థ్యములు కలవారు లేరు. కావున మహాశక్తి.

మహారతి: మహాకాయుని అర్ధాంగి అగుటచే మహారతిః అన్నారు.

మహాభోగా: అత్యధికత గల ధనసుఖాలు గలది శ్రీలలితా!

మహైశ్వర్యా: శ్రీలలితా ఈశత్వసంపదలు ఎక్కువగా గలది.

మహావీర్యా: శ్రీ లలితా శుక్రవీర్యాదులు విశేషము కలది.

మహాబలా: శ్రీలలితా సైన్యాది బలములు విశేషముగా కలది.

మహాబుద్ధి: శ్రీలలితా పరాశక్తి ప్రభావము వలననే భక్తులకు సర్వజ్ఞత్వము కలుగుచున్నది. మహాబుద్ధిః స్వరూపిణి.

మహాసిద్ధి: శ్రీలలిత భక్తులకు అణిమాది సిద్ధులిచ్చును. కాని నిజభక్తు అమెపాద పద్మాల సేవ కోరుదురు.

మహాయోగీశ్వరేశ్వరీ: శ్రీలలితా మహాయోగిపుంగవులకు కూడా ఈశ్వరి.

మహాతంత్రా: శ్రీ లలితాదేవి, జ్ఞానార్ణవ, కులార్ణవాది అనంత ఫలములు నొసగ తంత్రములు పరాశక్తి రూపయే.

మహామంత్రా: శ్రీలలితా, బాల, భగళాది మహామంత్ర స్వరూపిణి.

మహాయంత్రాః: సిద్ధివజ్రేశ్వరీ యంత్రము, సర్వతంత్రశ్రీ విధ్యా పరాశక్తి రూపము.

మహాసనా: శ్రీలలితాదేవి పృధ్వివ్యాది రసతత్వములు ఆసనముగా గలది.

మహాయాగక్రమా రాధ్యా: బ్రాహ్మీ అష్టోభ్యాది అరువది నాలుగు యోగిని గుణముల గూర్చి చేయునదే మహాయాగమన బడును. భావనోపనిషత్ సిద్ధమైన దేవిపాద సేవయే మహాయాగక్రమము.

మహాభైరవ పూజితా: పరమేశ్వరుడగు సదాశివునిచే పూజింప బడునది శ్రీలలితా.

మహేశ్వర మహాకల్పా మహా తాండవ సాక్షిణీ: శ్రీ లలితాదేవిప్రళయ కాలమందు భైరవ రూపియగు శివుడు చేయు ప్రళయకాల నాట్య సాక్షిణి శ్రీలలితాదేవి.

మహాకామేశమహిషి: మహాకామేశపట్ట మహిషి శ్రీలలితా దేవదేవి.

మహాత్రిపురసుందరీ చతుష్షష్య పచారాఢ్యా: మాతృసమాన నగరములే మహా నగరములు. అందే తాదాత్మ్యము నందుటచే త్రిపురసుందరి యనబడుచున్నది.

చతుష్షి కళామయి 64 కళలే రూపముగాగలది.

చతుష్షష్టికోటి యోగినిగణ సేవితా: శ్రీలలితా అరువది నాలుగు ఉపచారములుచే పూజింపబడునది. లోపాముద్ర, అగస్త్య దంపతులు.

మనువిద్యా : మను, చంద్రకు బేర మన్మథ అగ్ని, రవి, ఇంద్ర స్కంధ, శివ దుర్వాస, 12గురు శ్రీవిద్యోపాసకులు, శ్రీలలితను ఆరాధించినవారు.

మనువిద్యా: జ్ఞానావర్ణవమునందు వీరి మంత్రో దారములు కలవు. ఆ మంత్రములకే మనువులని పేరు. ఆమను విద్యా స్వరూపిణి పరాశక్తి అని గ్రహించునది.

చంద్రవిద్యా: శ్రీదేవి శీలకిరణ ప్రభావము కోట్లాను వేల చంద్రకాంతులు చంద్రుడు అమ్మదగ్గరే శీతల కిరణ వెన్నెలలు నేర్చాడు. శ్రీలలితా భక్తి హృదయాలు ఆవేదనతో ఆర్తితో అమ్మను చూడాలని తట్టుకోలేని సూర్య అగ్ని జ్వాలలు తన

చంద్రశీతల కిరణాల మమతల మందుతో పసిబిడ్డలా ఊరడిస్తుంది.

చంద్రమండల మధ్యగా: శ్రీలలితాదేవిని నిండు పౌర్ణమినాడు చంద్రుని చూచి అమ్మ శీతల కిరణాలు తప్పక కనిపిస్తాయి. అమ్మ కిరణాలు సోకి భక్తుల హృదయాలు ఆనందమయం అవుతాయి.

చారురూపా: శ్రీలలితా సౌందర్య లావణ్యములు గలది.

చారుహాస: శ్రీ లలితా సొగసైన ఆ చిరునవ్వు భక్తుల హృదయాల్లో పన్నీటి జల్లుల ప్రవాహము.

చారుచంద్ర కళాధరా: శ్రీలలితా దేవి చంద్రకోట్లాను వేల కోట్ల కిరణాలు వృద్ధి క్షయము లేనివి.

చరా చర జగన్నాథా: చరా చరమునకు అణువు పరమాణువు మొదలు బ్రహ్మాంలోకాల నాయకి శ్రీలలితా.

చక్రరాజనికేతనా: శ్రీలలితా సర్వలోకాలకు త్రైలోక్య మోహనాది నవచక్రములే నివాసముగా కలది.

పార్వతీ: పార్వతీ పర్వత రాజపుత్రిగాన పార్వతి అమ్మ శ్రీలలిత సంకల్పమున పుట్టినది.

పద్మనయనా: శ్రీ లలితా చింతామణి ద్వీప అమృత సరస్సులో పద్మాల కన్నా అతి చక్కని పద్మ నేత్రి.

పద్మ రాగ సమప్రభా: శ్రీ లలిత తెలుపు ఎరుపు కలసిన అద్భుత మనోహర రంగుమేనిచ్ఛాయ పద్మ రాగాలు (చింతామణి) గురుతు తెస్తాయి.

పంచప్రేతాసనాసీనా: బ్రహ్మ విష్ణు మహేశ్వర రుద్ర సదాశివులు ప్రేతలుగా శ్రీదేవికి ఆసనమై యున్నారు.

పంచబ్రహ్మ స్వరూపిణి: శ్రీలలిత వారికి శక్తుల నిచ్చినది గావున, పంచబ్రహ్మ స్వరూపిణి సర్వులు అమ్మ శక్తియే ఆధారముగా చేసికొని అమ్మ ఆజ్ఞలన పాటించెదరు.

చిన్మయా: శ్రీలలితా ఎవరికి అంతే పట్టని చిత్స్వరూపిణి స్వరూపురాలు.

పరమానందా: శ్రీలలితా పరానంద స్వరూపిణి.

విజ్ఞాన ఘనరూపిణి: శ్రీలలితా సర్వజీవులకు సృష్టి సంకల్ప రూపిణి.

ధ్యానధ్యాతృధ్యేయ రూపా: ధ్యాన, ధ్యాతృ ధ్యేయ రూపములు మూడు త్రిపుటి అమ్మయే ధ్యానము అమ్మ చేరవలసిన స్థలము ధ్యేయము చేరవలెనను దృఢ అభిప్రాయము. ఇటువంటి మహాదృఢ సంకల్పమే అమ్మ శ్రీలలితా.

ధర్మా ధర్మ వివర్జితా: ధర్మా ధర్మములు ప్రకాశ విమర్శలు అనునవే శివశక్తి బీజములు అ.వా. ఈ బీజములే శివశక్తి స్వరూపమని గ్రహింపవలెను.

విశ్వరూపా: ఈ చరా విశ్వములో అణువు అణువును పరాశక్తే నిండి ఉన్నది. శ్రీలలితే విశ్వరూపా.

జాగరిణీ: ప్రభోధాత్మకమైన సర్వేంద్రియ జ్ఞానముగల విశ్వులనే జీవుని అవస్థ జాగరణము. అన్ని అవస్థలలో శ్రీలలితా సర్వము తెలిసినదేనని బావము.

స్వపన్తి: స్వప్నావస్థను, పొందిన, తైజసమను జీవునితో వేరుగా నిద్రించునది శరీరము నిదురించినా ఆత్మరూపము పరమాత్మరూపము రెండు మెలకువలో ఉండును.

తైజాసాత్మికా: స్వప్నావస్థను పొందిన జీవుల సమిష్టి రూపుడైన హిరణ్యగర్భుని రూపము వంటిది దేవి సూక్ష్మరూపము.

సుప్తా: అజ్ఞానము అహంభావము సుఖమను మూడువృత్తులు గలది సుషుప్తావస్థ. అట్టి అవస్థగల సుప్తుని కంటె భిన్నముగా నున్నది. అప్పుడు శ్రీ లలితకు సర్వము తెలియును.

ప్రాజ్ఞాత్మికా: పూర్వము చెప్పిన లక్షముగల జీవుల సమిష్టి భూతమైన ఈశ్వరుని ఆత్మ స్వరూపము.

తుర్యా: జాగ్రత్ సుషుప్తి అవస్థలకు అతీతమైన తురీయావస్థ. దానిని పొందిన ఆనందము కలుగును. తుర్యానంద భవులకు ప్రసన్నమైనదేవి తుర్య.

ఈ అవస్థ బహుచిత్రము: పద్మాసనము వేసికొని ధ్యానము చేయుచుండిన ఆసనమునకు పైగా నిరాధారమునుండునట్లు అనుభవము. మంచముపై పడుకొన్నప్పుడు మంచముపైగా పడుకొని అతి తేలికగా ఏదో రూపము ఏదో లోకములో ఉన్నట్లుగా ఉండును. పాపం నా ప్రక్కన పడుకున్న వారు మంచముపైన శరీరముండుట చూచి భయపడి పారిపోయిరి. నాకేమి తెలియదు. ఒకానొక విచిత్ర అవస్థ.

సర్వావస్థా వివర్జితా: సర్వావస్థలకు అతీతమైన పంచమావస్థ రూపముగలది దేవి, ఈ అవస్థ పొందిన వాడు నేనే శివుడను అని చెప్పగలరు.

అంతియే కాదు మహాదానంద నాట్య ముద్రలతో అద్భుత నాట్యము చేయవచ్చును అణువు స్పందించ ఆనంద అర్ధనారీ నాట్యము.

సర్వావస్థా వివర్జితా: సర్వావస్థలకు పంచమ అవస్థలకు అతీతమైన పంచమావస్థా రూపముగలది దేవి దేవి మాయాప్రభావము అంతటిది. ఈ వీధముగా శిరస్సుకు జానాబెత్తెడు దూరములో సహస్రకమలముతో పరమాత్మతో ఆత్మ సంగమస్థితి.

సృష్టికర్త: సృష్టియనగా జగన్నిర్మాణము ఈ కార్యము శివునిది. అట్టిసృష్టి శక్తి శ్రీ లలితా.

బ్రహ్మరూపా: చతుర్ ముఖములతో బ్రహ్మ ఈశుడు అట్టి రూపము ధరించు శ్రీ లలితా.

గోప్త్రి: జగత్తు రక్షణ భారము శ్రీ లలితే గాన గోప్త్రి అని పిలువబడుచున్నది.

గోవింద రూపిణీ: గోవింద రూపమే ఈశుడు అట్టి గోవిందరూపము గలది.

ఈశుడు గోలోకమునకు వెళ్ళి గోవిందుని రాచక్రీడా కోలాట కోలాహలము చూడనెంచి తాను గోపికయై కృష్ణానందములో తేలి, గోలోకమున శివలింగమున్నది, పగలు శివుని వలె రాత్రి గోపిక పగలు రాత్రిలు లేవు. ఈశ శివలింగాభిషేకము వలన ఏర్పడినవి. అక్కడ శివలింగము. ఈ విధము రాత్రి పగలు.

సంహారిణి : శ్రీలలితా ప్రపంచము నాశనము చేయునది.

రుద్రరూపా: దుంఖకారణములను పోగొట్టువాడు రుద్రుడు. రుద్రరూపముగలది.

తిరోధానకరీ: విశ్వమును సంపూర్ణముగా నాశనము చేసి భక్తుల లీనము చేసుకొనును శ్రీ లలిత.

ఈశ్వరి: సత్వగుణ ప్రదానుడు ఈశ్వరుడు. ఈశ్వరునికంటె వేరు కానిది కావున ఈశ్వరి శ్రీ లలితా.

ఓం సదాశివాయై నమః : సదాశివస్వరూపిణికి ప్రణతులు

ఓం అనుగ్రహదాయైనమః : అనుగ్రహాన్ని ప్రసాదించునట్టి దేవికి వందనాలు.

ఓం పంచకృత్య పరాయణాయై నమః : సృష్టిస్థితి లయతిరోధాన అనుగ్రహాలను పంచకృత్యాల యందు ఆసక్తికల తల్లికి వందనాలు.

ఓం భానుమండలమధ్యస్థాయై నమః : సూర్యమండల మధ్యభాగంలో తేజరిల్లు మహేశ్వరికి వందనాలు.

ఓం భైరవ్యై నమః : శివునికి భైరవుడని నామమున్నది. భైరవుడు ప్రియురాలు కనుక భైరవికి వందనాలు.

ఓం భగమాలిన్యై నమః : భగమాలినీ స్వరూపిణికి వందనాలు.

ఓం పద్మాసనాయై నమః : పద్మాసనమందు తేజరిల్లు శ్రీమాతకు ప్రణతులు.

ఓం భగవత్యై నమః : దేవతలందరిచేతా సేవింపబడునట్టి భగవతీ స్వరూపిణికి ప్రణతులు.

ఓం పద్మనాభ సహోదర్యై నమః : పద్మనాభుని చెల్లెలైన పార్వతీ దేవికి వందనాలు.

ఓం ఉన్మేషనిమిషోత్పన్న విపన్న భువనావళ్యై నమః : కనులు తెరచినంతమాత్రాన బ్రహ్మాండాలను సృష్టించగలిగినట్టియు, కనులుమూసి బ్రహ్మాండాలను లయం చేయగలిగినట్టియు మహేశ్వరికి ప్రణతులు.

ఓం సహస్రశీర్ష వదనాయై నమః : అనంతమయిన శీర్షనాదులతోజగత్తును

రక్షించునట్టి తల్లికి ప్రణతులు.

ఓం సహస్రాక్ష్యై నమః : అనంతమయిన శీర్షవదనాదులతో జగత్తును రక్షించునట్టి తల్లికి ప్రణతులు.

ఓం సహస్రపాదే నమః : సహస్రశబ్దం - అనంతవాచకము అనంద నేత్రాలతో తేజరిల్లు శ్రీమాతకు ప్రణతులు.

ఓం ఆబ్రహ్మకీటజనన్యై నమః : కీటకాది బ్రహ్మపర్యంతంగా గల సర్వజీవులను సృష్టించునట్టి మాతకు ప్రణతులు.

ఓం వర్ణాశ్రమ విధాయిన్యై నమః : వర్ణాశ్రమ ధర్మాలను బ్రహ్మద్వారా ఏర్పరుచునట్టి తల్లికి నమస్కారాలు.

ఓం విజ్ఞాన రూపనిగమాయై నమః : వేదరూప స్వరూపిణికి వందనాలు.

ఓం పుణ్యాపుణ్య ఫలప్రదాయై నమః : పుణ్యాపుణ్య కర్మల వలన కలుగు ఫలాలను ప్రసాదించునట్టి మాతకు వందనాలు.

ఓం శ్రుతిసీమంత సిందూరీకృత పాదాబ్జ ధూళికాయై నమః : శ్రుతి సీమంతాలని ఉపనిషత్తులకు నామాంతరము. అట్టి ఉపనిషత్తులుకూడ జగన్మాతను వర్ణించలేకపోయాయి. అట్టి వర్ణనాతీత మూర్తికి ప్రణతులు.

ఓం సకలాగమ సందోహశుక్తి సంపుటమౌక్తికాయై నమః : సమస్తమైన ఆగమరూపశక్తులలో మౌక్తికాలవలె భాసిల్లు మాతకు వందనాలు.

ఓం పురుషార్థ ప్రదాయై నమః : చతుర్విధ పురుషార్థాలనూ ప్రసాదించునట్టి జననికి ప్రణతులు.

ఓం పూర్ణాయై నమః : పూర్ణపరబ్రహ్మస్వరూపిణికి వందనాలు.

ఓం భోగిన్యై నమః : నాగకన్యా స్వరూపిణికి వందనాలు.

ఓం భువనేశ్వర్యై నమః : సమస్తమయిన భువనాలకూ అధీశ్వరియైన మాతకు వందనాలు.

ఓం అంబికాయై నమః : సమస్త జగత్తుకూ మాతృమూర్తియైన దేవికి వందనాలు.

ఓం అనాది నిధనాయై నమః : ఆద్యంతాలు లేని తల్లికి వందనాలు.

ఓం హరిబ్రహ్మేంద్ర సేవితాయై నమః : బ్రహ్మ, విష్ణు, మహేంద్రాదులద్వారా సేవింపబడునట్టి తల్లికి వందనాలు.

ఓం నారాయణ్యై నమః : నారాయణమూర్తికి నమస్కారాలు.

ఓం నాదరూపాయై నమః : నాదబ్రహ్మ స్వరూపిణికి నమోవాకాలు.

ఓం నామరూపవివర్జితాయై నమః : నామరూపాతీతురాలగు మాతకు ప్రణతులు

ఓం హ్రీంకార్యై నమః : సిగ్గును కలుగజేయునట్టియును, హ్రీంకారబీజాక్షరీ స్వరూపిణియూ అయిన మాతకు ప్రణతులు

ఓం హ్రీంమత్యై నమః : హ్రీం అనగా లజ్జ అని అర్థం లజ్జగలమాతకు వందనాలు.

ఓం హృద్యాయై నమః : మనోజ్ఞమూర్తికి హృదయానంద వర్ధకురాలికి వందనాలు.

ఓం హేయోపాదే యవర్జితాయై నమః : ఇష్టానిష్ట నింద్యానింద్య ప్రవత్తి నివృత్తులను వర్జించిన శ్రీదేవికి వందనాలు.

ఓం రాజరాజార్చితాయై నమః : రాజరాజ అంటే కుబేరుడు. మనువు – వీరిచే అర్చింపబడిన దేవికి వందనాలు.

ఓం రాజ్ఞ్యై నమః : రాజ్ఞీమతల్లికి ప్రణతులు

ఓం రమ్యాయై నమః : సౌందర్యరాశికి వందనాలు.

ఓం రాజీవలోచనాయై నమః : పద్మములవంటి సువిశాల సుందర నయనాలు కల తల్లికి వందనాలు.

ఓం రంజన్యై నమః : భక్తులను రంజింపజేయునట్టి మాతకు ప్రణతులు.

ఓం రమణ్యై నమః : స్త్రీలలో సర్వోత్కృష్టస్థానంలో తేజరిల్లునట్టి పరమేశ్వరికి వందనాలు.

ఓం రస్యాయై నమః : ఆస్వాదనయోగ్యయగు మహేశ్వరికి వందనాలు.

ఓం రణత్కింకిణి మేఖలాయై నమః : కింకిణులు మధురనాదాలు చేయు మెరయునట్టి మొలనూలను ధరించిన మాతకు ప్రణతులు.

ఓం రమ్యాయై నమః : లక్ష్మీస్వరూపిణియగు లలితా మాతకు ప్రణతులు.

ఓం రాకేందువదనాయై నమః : పూర్ణచంద్రాననకు వందనాలు.

ఓం రతిరూపాయై నమః : రతీదేవి స్వరూపాన్ని అధిగమించిన సుందర రూపం గల తల్లికి వందనాలు.

ఓం రతిప్రియాయై నమః : రతీదేవికి ప్రియమైన లలితాంబకు వందనాలు.

ఓం రాక్షాకర్త్ర్యై నమః : లోకాలకు రక్షణ కలిగించునట్టి మాతకువందనాలు.

ఓం రాక్షసఘ్న్యై నమః : రాక్షసులను అంతం చేయునట్టిదేవికి వందనాలు.

ఓం రామాయై నమః : రామరూపిణికి ప్రణామాలు.

ఓం రమణలంపటాయై నమః : రమణులచే లంపటయగు కోమలాంగులచే పరివేష్టితమై క్రీడించు మాతకు నమస్కారాలు.

ఓం కామ్యాయై నమః : ముముక్షువులచే, జ్ఞానులచే కోరబడు దేవికి వందనాలు.

ఓం కామకలారూపాయై నమః : కామకలా స్వరూపిణికి అంటే కోరదగిన కళయే స్వరూపంగా గల దేవికి వందనాలు.

ఓం కదంబకుసుమప్రియాయై నమః : కదంబ పుష్పాలయందు ప్రీతిగల మాతకు ప్రణతులు.

ఓం కల్యాణ్యై నమః : కల్యాణమయ – అంటే మంగళమయ స్వరూపిణికి ప్రణతులు.

ఓం జగతీకందయై నమః : జగత్తులకు మూలకందమైన దేవికి వందనాలు.

ఓం కరుణారస సాగరాయై నమః : సముద్రం వంటి అపార కరుణ తల్లికి నమస్కారాలు.

ఓం కళావత్యై నమః : సమస్త కళలూగల లలితాంబకు వందనాలు.

ఓం కళాలాపాయై నమః : కలభాషిణికి – మధురంగా ఆలపించునట్టి తల్లికి వందనాలు.

ఓం కాంతాయై నమః : మనోహరకాంతస్వరూపిణికి వందనాలు.

ఓం కాదంబరీ ప్రియై నమః : కాదంబరియందు ప్రియముకల దేవికి వందనాలు.

ఓం వరదాయై నమః : వరములను ప్రసాదించునట్టి తల్లికి ప్రణతులు

ఓం వామ నయనాయై నమః : సుందరమైన నయనాలుకల దేవికి వందనాలు.

ఓం వారుణీమదవిహ్వలాయై నమః : వారుణిని పానంచేసి ఆ మదంచే విహ్వలయైన జగజ్జననికి వందనాలు.

ఓం విశ్వాధికాయై నమః : విశ్వాధికురాలై లలితాంబకు ప్రణతులు

ఓం వేదవేద్యాయై నమః : వేదములచే వేద్యురాలు – అనగా తెలిసోదగిన తల్లికి వందనాలు.

ఓం వింధ్యాచల నివాసిన్యై నమః : వింధ్యాచల పర్వతము నివాస్థానంగా గల దేవికి ప్రణతులు

ఓం విధాత్ర్యై నమః : విశ్వాలను ధరించునట్టి జగజ్జననికి ప్రణతులు

ఓం వేదజనన్యై నమః : వేదాలకు మాతృస్థానీయురాలైన మాతకు ప్రణతులు.

ఓం విష్ణుమాయాయై నమః : వైష్ణవ మాయా స్వరూపిణికి ప్రణతులు.

ఓం విలాసిన్యై నమః : విలాసినీ రూపాన్ని ధరించిన లలితకు వందనాలు.

ఓం క్షేత్రస్వరూపాయై నమః : క్షేత్రమే స్వరూపంగాగల మాతకు వందనాలు.

ఓం క్షేత్రేశ్యై నమః : క్షేత్రాలను పాలించు ఏలికకు వందనాలు.

ఓం క్షేత్ర క్షేత్రజ్ఞపాలిన్యై నమః : జీవుణ్ణీ శరీరాన్నీ రెండింటినీ పాలించునట్టి తల్లికి ప్రణతులు.

ఓం క్షయవృద్ధి వినిర్ముక్తాయై నమః : వృద్ధిక్షయాలు లేని మాతకు ప్రణతులు.

ఓం క్షేత్రపాల సమర్చితాయై నమః : క్షేత్రపాలునిచే అర్చించబడునట్టి దేవికి ప్రణతులు.

ఓం విజయాయై నమః : విజయమే స్వరూపంగా గల మాతకు ప్రణతులు

ఓం వమిలాయై నమః : తొలగిన అవిద్యా స్వరూపిణికి వందనాలు.

ఓం వద్యాయై నమః : నమస్కరించదగిన మాతకు ప్రణతులు.

ఓం వాగ్వాదిన్యై నమః : వాగ్వాదినీ శక్తికి వందనాలు.

ఓం వామకేశ్యై నమః : సుందరమైన కేశాలు కల తల్లికి వందనాలు.

ఓం వహ్నిమండల వాసిన్యై నమః : సోమ, సూర్య అగ్నిమండలాలయందు భాసిల్లునట్టి దేవికి ప్రణతులు

ఓం భక్తిమత్కల్పలతికాయై నమః : కల్పలతలవలె భక్తుల కోరికలను నెరవేర్చునట్టి మాతకు ప్రణతులు.

ఓం పశుపాశ విమోచన్యై నమః : అజ్ఞానరూప పశువులను అవిద్యారూప పాశాల నుండి విముక్తులను చేయగల మాతకు ప్రణతులు.

ఓం సంహృతాశేష పాషండాయై నమః : వేదరహితమైన ఆచారాలను పాటించువారు పాషండులు. అట్టి పాషండులను అందరినీ నాశనం చేయునట్టి తల్లికి వందనాలు.

ఓం సదాచార ప్రర్తికాయై నమః : వేదోక్త సదాచారాలను పాటింపచేయునట్టి పావనమూర్తికి ప్రణతులు.

ఓం తాపత్రయాగ్ని సంతప్త సమాహ్లాదన చంద్రికాయై నమః : తాపత్రయాగ్నిచే సంతప్తులైనవారికి వెన్నెలవలె చల్లదనాన్ని కలిగించునట్టి మాతకు వందనాలు.

ఓం తరుణ్యై నమః : నిత్య తారుణ్యము ( యౌవనము) గల దేవికి వందనాలు.

ఓం తాపసారాధ్యాయై నమః : తాపసోత్తములచే ఆరాధించబడునట్టి దేవినికి వందనాలు.

ఓం తనుమధ్యై నమః : కృశించిన మధ్యభాగం అంటే నడుముకల దేవికి వందనాలు.

ఓం తమోపహాయై నమః : అజ్ఞానాంధకారమును నాశనంచేయునట్టి దేవికి ప్రణతులు.

ఓం చిత్యై నమః : చిచ్ఛక్తి స్వరూపిణికి వందనాలు.

ఓం తత్పద లక్ష్యార్థయై నమః : పరబ్రహ్మ పదలక్ష్యార్థాన్ని వ్యక్తం చేయునట్టి దేవికి వందనాలు.

ఓం చిదాకార స్వరూపిణ్యై నమః : చిదాకార మూర్తి అయిన శ్రీ లలితాంబకు వందనాలు.

ఓం స్వాత్మానందలవీభూత బ్రహ్మాద్యానంద సంతత్యై నమః : ఆత్మానందంలో లయారూపులైన బ్రహ్మాదులు ఆనంద సముదాయం కల దేవికి ప్రణామాలు.

ఓం పరాయై నమః : పశ్యంతీ వాగ్రూపిణికి ప్రణతులు

ఓం పరదేవతాయై నమః : పరమపూజనీయురాలగు దేవతా స్వరూపిణికి వందనాలు.

ఓం మధ్యమాయై నమః : మధ్యమా వాగ్రూపికి ప్రణతులు

ఓం వైఖరీరూపాయై నమః : వైఖరీ వాగ్రూపిణికి ప్రణతులు.

ఓం భక్త మానస హంసికాయై నమః : భక్తుల మానసాలలో హంసివ వలె తేజరిల్లు శ్రీ లలితకు ప్రణతులు.

ఓం కామేశ్వర ప్రాణనాడ్యై నమః : కామేశ్వరుని ప్రేమనాడి వంటి మాతకు వందనాలు.

ఓం కృతజ్ఞాయై నమః : కృతజ్ఞతా స్వరూపిణికి వందనాలు.

ఓం కామపూజితాయై నమః : కాముడనగా మన్మథుడు అట్టి మన్మథునిచే పూజింపబడిన తల్లికి వందనాలు.

ఓం శృంగార రస సంపూర్ణాయై నమః : శృంగార రస పరిపూర్ణరూపిణియగు పరమేశ్వరికి ప్రణతులు.

ఓం జయాయై నమః : జయమే స్వరూపంగా గల మాతకు ప్రణతులు.

ఓం జలాంధర స్థితాయై నమః : జాలంధర పీఠంలో తేజరిల్లు నట్టి మాతకు ప్రణతులు.

ఓం ఓడ్యాణపీఠ నిలయాయై నమః : ఓడ్యాణపీఠము నిలయముగా కల తల్లికి నమస్కారాలు.

ఓం బిందుమండల వాసిన్యై నమః : బిందుమండలం వాసస్థానంగా కల తల్లికి ప్రణతులు.

ఓం రహోయాగ క్రమారాధ్యాయై నమః : రహోయాగంలో సక్రమంగా ఆరాధించబడునట్టి లలితాదేవికి వందనాలు.

ఓం రహస్తర్పణ తర్పితాయై నమః : జ్ఞానాగ్ని యందు ధర్మాధర్మ పుణ్యాపుణ్యములను హోమముచేయగా తృప్తి చెందునట్టి తలిలికి వందనాలు.

ఓం సద్యఃప్రసాదిన్యై నమః : శీఘ్రమే- తక్షణమే- ఫలాలను ప్రసాదించునట్టి మాతకు ప్రణతులు.

ఓం విశ్వసాక్షిణ్యై నమః : యావద్విశ్వానికి సాక్షిభూతురాలైన మాతకు ప్రణతులు.

ఓం సాక్షివర్జితాయై నమః : తను సర్వానికి సాక్షిగా ఉంటుంది. కానీ తనకు ఎట్టి సాక్షీలేదు, అట్టి సాక్షివర్జితకు వందనాలు.

ఓం షఢంగ దేవతాయుక్తాయై నమః : వేదాంగాలైన షడంగ దేవతలతో కూడిన శ్రీదేవికి వందనాలు.

ఓం షాడ్గుణ్య పరిపూరితాయై నమః : షడ్గుణాలతో పరిపూర్ణురాలైన పరమేశ్వరికి ప్రణతులు.

ఓం నిత్యక్లిన్నాయై నమః : నిత్యక్లిన్నా దేవికి – సదార్ద్రచిత్తకు ప్రణతులు.

ఓం నిరుపమాయై నమః : ఉపమానమే లేనట్టి దివికి వందనాలు.

ఓం నిర్వాణ సుఖదాయిన్యై నమః : నిర్వాణ సుఖాన్ని ప్రసాదించునట్టి పరమేశ్వరికి ప్రణతులు.

ఓం శ్రీకంఠార్థ శరీరిణ్యై నమః : పరమశివునికి శ్రీకంఠుడన్న నామమున్నది. అట్టి శ్రీకంఠుని అర్ధాంగికి వందనాలు.

ఓం ప్రభావత్యై నమః : మహత్తర ప్రభావంచే తేజరిల్లునట్టి మహేశ్వరికి వందనాలు.

ఓం ప్రభారూపాయై నమః : ప్రకాశమే స్వరూపంగా కల దేవికి వందనాలు.

ఓం ప్రసిద్ధాయై నమః : సర్వజగత్తులలో ప్రసిద్ధి చెందిన మాతకు ప్రణతులు.

ఓం పరమేశ్వర్యై నమః : పరమేశ్వరుని పత్నియైన పరమేశ్వరికి వందనాలు.

ఓం మూలప్రకృత్యై నమః : స్థావరజంగమాత్మకమైన యావద్విశ్వాన్నీ సృజించునట్టి మూలప్రకృతి స్వరూపిణికి ప్రణతులు.

ఓం అవ్యాక్తాయై నమః : అవ్యక్తశబ్దం బ్రహ్మవాచకము అనగా బ్రహ్మస్వరూపిణికి ప్రణతులు.

ఓం వ్యక్తావ్యక్త స్వరూపిణ్యై నమః : మహత్తత్త్వ – పరబ్రహ్మ స్వరూపిణికి వ్యక్తావ్యక్తస్వరూపమని పేరు. అట్టి రెండును తానైయున్న పరదేవతకు వందనాలు.

ఓం వ్యాపిన్యై నమః : యావద్విశ్వంలోనూ వ్యాపించియున్న సర్వవ్యాపినికి వందనాలు.

ఓం వివిధాకారాయై నమః : వైకృత, ప్రాకృత, కౌమార నామకమైన వివధాకృతులను దాల్చిన పరమేశ్వరికి ప్రణతులు.

ఓం విద్యాఽవిద్యా స్వరూపిణ్యై నమః : తానే విద్యా స్వరూపిణియై మరల తానే అవిద్యారూపిణియై కూడా ఉండునట్టి మాతకు ప్రణతులు.

ఓం మహాకామేశ నయన కుముదాహ్లాద కౌముద్యై నమః : మహాకామేశుడు అంటే పరమశివుడని అర్థము – అట్టి పరమశివుని నేత్రరూపమైన కలువలను వికసింపజేయు వెన్నెలవంటి తేజోమూర్తికి వందనాలు.

ఓం భక్తహార్దతమోభేద భానుమద్భాను సంతత్యై నమః : భక్తుల హృదయ గుహలలో రాశీభూతమైయున్న అజ్ఞానాంధకారాన్ని రూపుమాపడానికి అనంత

ప్రభలతో తేజరిల్లేభాస్కర స్వరూపిణికి నమోవాకాలు.

ఓం శివదుత్యై నమః : పరమశివుని దూతగాచేసి పంపగలిగిన శివదూతికి వందనాలు.

ఓం శివారాధ్యాయై నమః : శివునిచే సయిత మారాధించబడిన మహాశక్తికి ప్రణతులు.

ఓం శివమూర్త్యై నమః : శివ స్వరూపిణికి అంటే శాంతమూర్తికి వందనాలు.

ఓం శివంకర్యై నమః : జీవుని శివునిగ చేయగల మహత్తర శక్తి గల తల్లికి నమోవాకాలు.

ఓం శివప్రియాయై నమః : శివునికి ప్రియాన్ని చేకూర్చునట్టి శివప్రియకు ప్రణతులు

ఓం శివపరాయై నమః : శక్త్యాతీతుడైన శివునికంటె పరమైన దేవికి – శివునియందు దత్తచిత్తురాలైన మాతకు ప్రణతులు.

ఓం శిష్టేష్టాయై నమః : శిష్ట జనులయందు సద్ధర్మమార్గ చరితులైన వారియందు యిష్టముగల తల్లికి వందనాలు.

ఓం శిష్టపూజితాయై నమః : శిష్టజనులచే అంటే విశిష్ట వ్యకుల్తచే గొప్పవారిచే కీర్తించబడునట్టి తలిలికి వందనాలు.

ఓం అప్రమేయాయై నమః : కొలవ తగినదై యుండే కొలదీ అసాధ్యయై తేజరిల్లు అప్రమేయమూర్తికి వందనాలు.

ఓం స్వప్రకాశాయై నమః : నిజతేజస్సుతో ప్రకాశించునట్టి స్వయంప్రకాశ స్వరూపిణికి వందనాలు.

ఓం మనోవాచా మగోచరాయై నమః : మనస్సుకును వాక్కునకును గోచరించనిది, అందనిదియైన అతీత స్వరూపిణికి వందనాలు.

ఓం ఛిచ్ఛక్త్యై నమః : అజ్ఞానాన్ని దూరం చేయగల విద్యకు చైతన్యమని పేరు. ఆ చైతన్యానికే చిచ్ఛక్తి నామం ఉంది. అట్టి చిచ్ఛక్తి స్వరూపిణికి ప్రణతులు.

ఓం చేతనా రూపాయై నమః : చైతన్య స్వరూపిణియై తేజరిల్లు జగదంబకు వందనాలు.

ఓం జడశక్త్యై నమః : బ్రహ్మశక్తిద్వారా ప్రభవించునట్టి జడసృష్టి స్వరూపిణికి ప్రణతులు

ఓం జడాత్మికాయై నమః : కంటికి కనిపించునట్టి నామ రూపాత్మకమైన జడసృష్టిఆత్మగాగల తల్లికి వందనాలు.

ఓం గాయత్ర్యై నమః : గానం చేయువారిని తరింపజేయునది గాయత్రి, వేదజనని గాయత్రి, అట్టిగాయత్రీస్వరూపిణికి వందనాలు.

ఓం వ్యాహృత్యై నమః : విశేష మంత్రరూపంగల వ్యాహృత స్వరూపిణికి వందనాలు.

ఓం సంధ్యా నమః : సూర్యంసంబంధిత బ్రహ్మ పదార్థ విశేషానికి సంధ్య అని నామము. సంధికాలంలో అంటే ఉదయ, మధ్యాహ్నం సాయంకాల సంధివేళలో ఉపాసింపదగిన సంధ్యాస్వరూపిణికి వందనాలు.

ఓం దివజబృంద నిషేవితాయై నమః : ద్విజపరివారాలచే ఆరాధించబడునట్టి లేదా సేవింపబడునట్టి తల్లికి వందనాలు.

ఓం తత్త్వాసనాయై నమః : తత్త్వనామకమై యోగ పీఠమే ఆసనంగా కలిగిన తల్లికి వందనాలు.

ఓం తస్మై నమః : సర్వుల మనోబుద్ధులలో సంచరించునట్టి తల్లికి నమస్కారాలు.

ఓం తుభ్యం నమః : పరమేశ్వరివైన తల్లీ నీకు వందనాలు.

ఓం తత్త్వమయ్యై నమః : సర్వతత్త్వములకూ స్వరూపమై భాసిల్లు మహాదేవికి వందనాలు.

ఓం పంచకోశాంతరస్థితాయై నమః : అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ, నామకమైన పంచకోశాంతరాలలో తేజరిల్లునట్టి సర్వశక్తి స్వరూపిణికి ప్రణామాలు.

ఓం నిత్యయౌవనాయై నమః : సర్వవేళలా, సర్వకాలాలలో సదా సర్వదా యౌవనమూర్తిగా ఉండునట్టి మాతకు ప్రణామాలు.

ఓం మదశాలిన్యై నమః : ఆనందోత్సాహాలతో భాసిల్లునట్టి మాతకు ప్రణామాలు.

ఓం మదఘూర్ణితరక్తాక్ష్యై నమః : మదమువలని ఘూర్ణితములచే ఎర్రబారిన నేత్రాలు కల మాతకు నమస్కారాలు.

ఓం మదపాటలగండభువే నమః : కస్తూరి, పాటలాలతోచిత్రించబడడం వల్ల ఎరుపు, తెలుపు రంగులలో ప్రకాశించుచున్న గండస్థలం కల తల్లికి వందనాలు.

ఓం చందనద్రవ దిగ్ధాంగ్యై నమః : చందన ద్రవంచే లేపితమైన దివ్యాంగాలు కల మాతకు వందనాలు.

ఓం చాంపేయ కుసుమ ప్రియాయై నమః : చాంపేయ పుష్పాలయందు విశేషమయిన ప్రీతిగల మాతకు వందనాలు.

ఓం కుశలాయై నమః : సుకోమలమైన రూపం కల తల్లికి వందనాలు.

ఓం కురుకుళ్ళాయై నమః : శ్రీచక్రంలో తేజరిల్లునట్టి కురుళ్ళాదేవి స్వరూపిణి అయిన మాతకు ప్రణామాలు.

ఓం కుళేశ్వర్యై నమః : సజాతీయమైన మాతృకాబృందానికి కుళమని నామమున్నది. అట్టి బృందానికి అధీశ్వరియైన జగజ్జననికి వందనాలు.

ఓం కులకుండలాయై నమః : మూలాధారంలో స్థితమై యుండు కులకుండము నివాసస్థానంగా గల తల్లికి ప్రణామాలు.

ఓం కౌళమార్గ తత్పర సేవితాయై నమః : కౌళమార్గంలో తత్పరులైన వారిచే విశేషంగా సేవించబడు మాతకు ప్రణామాలు.

ఓం కుమార గణనాథాంబాయై నమః : కుమార గణపతుల వంటి ఇద్దలన కన్న మహామూర్తికి నమోవాకాలు.

ఓం తుష్ట్యై నమః : తుష్టిరూపిణికి వందనాలు.

ఓం పుష్ట్యై నమః : పుష్టిస్వరూపిణికి వందనాలు.

ఓం మత్యై నమః : బుద్ధి స్వరూపిణియై భాసిల్లునట్టి మాతకు ప్రణామాలు.

ఓం శాంత్యై నమః : సాంసారిక బాధలను దూరంచేసి శాంతిని ప్రసాదించునట్టి మాతకు ప్రణామాలు.

ఓం స్వస్తిమత్యై నమః : శుభప్రదమయిన మాతకు నమస్కారాలు.

ఓం శాంత్యై నమః : శాంతిస్వరూపిణికి నమస్కారాలు.

ఓం నందిన్యై నమః : సర్వులనూ విశేషంగా భక్తజనులను ఆనందింపజేయునట్టి మాతకు ప్రణామాలు.

ఓం విఘ్ననాశిన్యై నమః : విఘ్నాలను - అన్నింటినీ నాశనంచేసి భక్తజనుల మార్గాన్ని నిష్కంటకంగా చేయునట్టి దయామయికి కైమోడ్పులు.

ఓం తేజోవత్యై నమః : జగత్తుకు ప్రకాశాన్ని ప్రసాదించునది, సూర్యచంద్రాగ్ని తేజోమూర్తులకు సయితం తేజస్సును ప్రసాదించి స్వతేజంతో ప్రకాశించునట్టిదీ యైన మాతకు వందనాలు.

ఓం త్రినయనాయై నమః : సూర్యచంద్రాగ్నులే త్రేనేత్రాలుగా గల త్రినయనకు వందనాలు.

ఓం లోలాక్షీ కామరూపిణ్యై నమః : కామస్వరూపిణియై అంటే సర్వకామప్రదయై సుందర విశాల నయనాలతో భాసిల్లు మాతకు ప్రణతులు.

ఓం మాలిన్యై నమః : కన్యాస్వరూపిణికి (సప్తవర్షప్రాయమగు కన్యను మాలిని అంటారు) వందనాలు.

ఓం హంసిన్యై నమః : పరమహంస స్వరూపిణికి ప్రణామాలు. తురీయాశ్రమమైన సన్యాసాశ్రమంలో నాలుగు తరగతులున్నాయి. అందులో తృతీయాశ్రమాన్ని పొందిన సన్యాసికి హంస అని పేరు అట్టి పరమహంసకూ – పరమేశ్వరికీ అభేదము.

ఓం మాతాయై నమః : యావద్విశ్వానికీ మాతృస్వరూపిణియైన మాతృమూర్తికి వందనాలు.

ఓం మలయాచలవాసిన్యై నమః : మలయ పర్వతం వాసస్థానంగా గల తల్లికి ప్రణతులు.

ఓం సుముఖ్యై నమః : అంగీకరించదగిన సుందరముఖం కలిగిన తల్లికి వందనాలు.

ఓం నళిన్యై నమః : సర్వజనులను ఆకర్షించునట్టి పద్మదళ సుందరమూర్తికి ప్రణామాలు.

ఓం సుభ్రూయై నమః : సుందరమైన కనుబొమలుకల దేవికి నమస్కారాలు.

ఓం శోభనాయై నమః : శుభప్రదమైన దివ్యమంగళ మూర్తికి వందనాలు.

ఓం సరనాయికాయై నమః : దేవతలందరికినీ నాయకురాలైన మహాశక్తికి వందనాలు.

ఓం కాలకంఠ్యై నమః : దేవతలందరికినీ నాయకురాలైన మహాశక్తికి వందనాలు.

ఓం కాంతిమత్యై నమః : విశేషకాంతులతో ప్రకాశించునది జ్ఞాన ప్రకాశంలో భాసిల్లునట్టిదియైన దేవికి వందనాలు.

ఓం క్షోభిన్యై నమః : లయవేళలో క్షోభిమూర్తిని దాల్చు తల్లికి ప్రణతులు.

ఓం సూక్ష్మరూపిణ్యై నమః : గ్రహించ వీలుగాని అత్యంత సూక్ష్మస్వరూపిణికి ప్రణతులు.

ఓం వజ్రేశ్వర్యై నమః : జాలంధరీ పీఠంలో ష్ట తిథి నిత్యా దేవతయగు వజ్రేశ్వరీ శక్తిరూపిణిగా భాసిల్లు పరమేశ్వరికి వందనాలు.

ఓం వామదేవ్యై నమః : వామదేవుడనగా శివుడు వామదేవుని పత్ని కావున వామదేవి... అట్టి జననికి వందనాలు.

ఓం వయోవస్థా వివర్జితాయై నమః : అవస్థాత్రాయా తీతురాలుకు వయస్సుకు అతీతరూపిణియగు తల్లికి వందనాలు.

ఓం ఓం సిద్ధేశ్వర్యై నమః : దేవతాగణాలలో ఒక గణమైన సిద్ధులకు నాయికయైన లేదా అష్టసిద్ధులకూ అధిశ్వరియైన సిద్ధేశ్వకి వందనాలు.

ఓం సిద్ధవిద్యాయై నమః : సిద్ధులను ప్రసాదించునట్టి విద్యా స్వరూపిణికి వందనాలు.

ఓం సిద్ధమాతాయై నమః : సిద్ధులన్నింటికి మాతృస్వరూపురాలైన తల్లికి వందనాలు.

ఓం యశస్విన్యై నమః : కీర్తిస్వరూపిణికి ప్రణామాలు.

ఓం విశుద్ధచక్రనిలయాయై నమః : విశుద్ధకమల కర్ణికలో తేజరిల్లు భవానికి ప్రణామాలు.

ఓం రక్తవర్ణాయై నమః : ఎర్రటి కాంతులతో భాసిల్లు పరమేశ్వరికి ప్రణామాలు.

ఓం త్రిలోచనాయై నమః : మూడు కన్నులు కల మాతకు వందనాలు.

ఓం ఖట్వాంగాది ప్రహరణాయై నమః : ఖట్వాంగాది ఆయుధాలతో శత్రువులను కొట్టునట్టి దేవికి వందనాలు.

ఓం వదనైక సమన్వితాయై నమః : ఏకవదనయై భాసిల్లు జననికి వందనాలు.

ఓం పాయసాన్న ప్రియాయై నమః : పరమాన్నమందు విశేషప్రీతిగల దేవికి ప్రణామాలు.

ఓం త్వక్స్థాయై నమః : చర్మనామక ధాతువులో తేజరిల్లు శక్తికి వందనాలు.

ఓం పశులోక భయంకర్యై నమః : పశుస్వరూపులైన పామరులకు, అజ్ఞానులకు, దుష్టాత్ములకు భయాన్ని కలిగించునట్టి తల్లికి వందనాలు.

ఓం అమృతాది మహాశక్తి సంవృతాయై నమః : అమృత ఆదిగా గల షోడశశక్తులచే పరివృతురాలైన లలితాంబకు వందనాలు.

ఓం డాకినీశ్వర్యై నమః : డాకినీ రూపిణియగు మాతకు వందనాలు.

ఓం అనాహతాబ్జ నిలయాయై నమః : అనాహత కమలం నిలయ స్థానంగా కల తల్లికి నమస్కృతులు.

ఓం శ్యామాభాయై నమః : శ్యామల వర్ణశోభలతో అలరారు దేవికి వందనాలు.

ఓం వదనద్వయాయై నమః : రెండు ముఖాలతో భాసిల్లు తల్లికి ప్రణామాలు.

ఓం దంష్ట్రోజ్వలాయై నమః : దంష్ట్రలచే భాసిల్లు మాతకు ప్రణామాలు.

ఓం అక్షమాలాదిధరాయై నమః : అక్షమాలను ధరించిన మాతకు ప్రణామాలు.

ఓం రుధిర సంస్థితాయై నమః : రుధిరనామక ధాతువులో తేజరిల్లు శక్తికి వందనాలు.

ఓం కాళరాత్ర్యాది శక్త్యౌఘవృతాయై నమః : కాళరాత్రి మొదలుగా గల పన్నెండు శక్తులచే పరివేష్టించబడిన మాతకు వందనాలు.

ఓం స్నిగ్ధౌదన ప్రియాయై నమః : ఘృతమిశ్రితాన్నమగు స్నిగ్ధౌనమందు యిష్టము కల తల్లికి నమస్కారాలు.

ఓం మహావీరేంద్ర వరదాయై నమః : మహావీరులైన త్రిమూర్తులకు సయితము వరాలను ప్రసాదించగల తల్లికి వందనాలు.

ఓం రాకిన్యాంబా స్వరూపిణ్యై నమః : అనాహతచక్రంలో భాసిల్లునట్టి రాకిన్యంబా స్వరూపిణికి ప్రణామాలు.

ఓం మణిపూరాబ్జ నిలయాయై నమః : దశదళాలతో భాసిల్లునట్టి మణిపూరకమలంలో విలసిల్లు దేవికి నమోవాకాలు.

ఓం వదన త్రయ సంయుతాయై నమః : వజ్రాది ఆయుధాలను ధరించిన మాతకు నమస్కారాలు.

ఓం డమర్యాదిభిరావృతాయై నమః : డామర్యాది దశావరణ శక్తులతో పరివేష్టించబడిన మాతకు ప్రణతులు.

ఓం రక్తవర్ణాయై నమః : అరుణప్రభలతో భాసిల్లు తల్లికి వందనాలు.

ఓం మాసనిష్ఠాయై నమః : మాంసనామక ధాతువునందు భాసిల్లు తల్లికి వందనాలు.

ఓంగుడాన్న ప్రీతమానసాయై నమః : బెల్లముతో కూడిన అన్నమునందు ప్రీతికల తల్లికి వందనాలు.

ఓం సమస్త భక్త సుఖదాయై నమః : తన భక్తులైనవారికందరికినీ సుఖములను

చేకూర్చునట్టి మాతకు వందనాలు.

ఓం లాకిన్యంబాస్వరూపిణ్యై నమః : లాకినీ నామం గల అంబా స్వరూపిణికి వందనాలు.

ఓం స్వాధిష్ఠానాంబుజగతాయై నమః : ఆరుదళాలతో కూడినస్వాధిష్ఠానమనే కమలంలో విరాజిల్లు దేవికి వందనాలు.

ఓం చుర్వక్త్రమనోహరాయై నమః : చతుర్ముఖాలతో భాసిల్లు మనోహరమూర్తికి ప్రణతులు.

ఓం శూలాద్యాయుధ సంపన్నాయై నమః : శూలాదిగాగల ఆయుధాలను ధరించిన మాతకు ప్రణతులు.

ఓం పీతవర్ణాయై నమః : పసుపుపచ్చని రంగుతో భాసిల్లు మాతకు వందనాలు.

ఓం అతిగర్వితాయై నమః : సౌందర్య సంపదాది మహత్తరాతిశయంచే అత్యంత గర్వం కల దేవికి వందనాలు.

ఓం మేదో నిష్ఠాయై నమః : మేదోనిష్ఠురాలయిన మాతకు ప్రణతులు

ఓం మధుప్రీతాయై నమః : మధువును పానం చేయడంలో ప్రీతిగల మాతకు వందనాలు.

ఓ బందిన్యాది సమన్వితాయై నమః : బందిని ఆదిగాగల షడ్యోగినీ శక్తులతో పరివేష్టితమైన మాతకు నమస్కారాలు.

ఓం దధ్యన్నాసక్త హృదయాయై నమః : పెరుగుతో కూడిన అన్నమందు విశేషమైన ఆసక్తి - ఇష్టముగల తల్లికి వందనాలు.

ఓం డాకినీ రూపధారిణ్యై నమః : డాకినీ నామచక్రేశ్వరీ రూపధారిణికి వందనాలు.

ఓం మూలాధారాంబుజారూఢాయై నమః : మూలాధార చక్రంలో భాసిల్లునట్టి కమలకర్ణికలో విరాజిల్లు దేవికి ప్రణతులు.

ఓం పంచవక్త్రాయై నమః : పంచముఖాలతో తేజరిల్లునట్టి పంచముఖేశ్వరికి ప్రణతులు.

ఓం అస్థిసంస్థితాయై నమః : అస్థి (ఎముక) నామకమైన ధాతువులో శక్తిరూపంలో విలసిల్లు దేవికి వందనాలు.

ఓంఅకుశాదిప్రహరణాయై నమః : అంకుశము ఆదిగాగల ఆయుధాలతో ప్రహరించునట్టి మాతకు వందనాలు.

ఓం వరదాది నిషేవితాయై నమః : వరద మొదలుగాగల యోగినీ గణాలచే సేవించబడు మాతకు ప్రణతులు.

ఓం ముద్గౌదనాసక్త చిత్తాయై నమః : పులగముందు ఆసక్తమైన చిత్తముగల దేవికి వందనాలు.

ఓం సాకిన్యంబాస్వరూపిణ్యై నమః : సాకిని అనే చక్రేశ్వరీ రూపంలో భాసిల్లు దేవికి ప్రణతులు.

ఓం అజ్ఞా చక్రాబ్జనిలయాయై నమః : భ్రూమధ్య ప్రదేశంలో తేజరిల్లునట్టి అజ్ఞాన చక్రకమలం నిలయంగాగల దేవికి ప్రణతులు.

ఓం శుక్లవర్ణాయై నమః : తెల్లటి వర్ణంతో ప్రకాశించు మాతకు వందనాలు.

ఓం షడాననాయై నమః : షణ్ముఖాలతో భాసిల్లునట్టి దేవికి నమస్కారాలు.

ఓం మజ్జాసంస్థాయై నమః: మజ్జ నామక ధాతువులో ప్రకాశించు శక్తిస్వరూపిణికి ప్రణామాలు.

ఓం హసవతీ ముఖ్య శక్తి సమన్వితాయై నమః : హంసవతి ఆదిగాగలిగిన ముఖ్యశక్తులతో పరివేష్ఠితయైయున్న శక్తికి వందనాలు.

ఓం హరిద్రైన్నైకరసికాయై నమః : పసుపు కలిపిన అన్నము అంటే పులిహోరయందు యిష్టముకల తల్లికి వందనాలు.

ఓం హాకినీరూపధారిణ్యై నమః : హాకినీ రూపాన్ని ధరించి తేజరిల్లు మాతకు ప్రణతులు.

ఓం సహస్రదళపద్మస్థాయై నమః : శిరపోపరి మధ్యస్థానంలో సహస్రదళాలతో భాసిల్లు పద్మంలో నివసించు మాతకు ప్రణతులు.

ఓం సర్వవర్ణోపశోభితాయై నమః : సర్వ వర్ణములలోనూ శోభిల్లునట్టి దేవికి వందనాలు.

ఓం సర్వాయుధ ధరాయై నమః : సర్వాయుధాలనూ ధరించి తేజరిల్లునట్టి మాతకు ప్రణతులు.

ఓం సర్వతోముఖ్యై నమః : సర్వత్రా ముఖాలుగల సర్వతోముఖ రూపిణికి వందనాలు.

ఓం సర్వౌదన ప్రీతచిత్తాయై నమః : సర్వ విధాన్నము నందునా ప్రీత చిత్తంగల దేవికి వందనాలు.

ఓం యాకిన్యంబా స్వరూపిణ్యై నమః : యాకినీ నామక చక్రేశ్వరీ దేవికి వందనాలు.

ఓం స్వాహాయై నమః : స్వాహారూపిణికి నమస్కారాలు.

ఓం స్వధాయై నమః : స్వధారూపిణికి ప్రణామాలు.

ఓం మత్యై నమః : బుద్ధి స్వరూపిణికి నమస్కారాలు.

ఓం మేధాయై నమః : మేధాస్వరూపిణికి నమస్కారాలు.

ఓం శ్రుత్యై నమః : శ్రుతి అంటే వేద స్వరూపిణికి నమోవాకాలు.

ఓం స్మృత్యై నమః : స్మృతి అనగా స్మరించి అనుసరించి ఆచరింపదగిన ధర్మశాస్త్రము. అట్టి స్మృతి స్వరూపిణికి ప్రణతులు.

ఓం అనుత్తమాయై నమః : అనుత్తమమూర్తికి వందనాలు.

ఓం పుణ్యకీర్త్యై నమః : పుణ్యకీర్తిగల మాతకు వందనాలు.

ఓం పుణ్యలభ్యాయై నమః : పుణ్యకార్యాలవలన మాత్రమే లభించునట్టి మాతకు వందనాలు

ఓం పుణ్యశ్రవణకీర్తనాయై నమః : శ్రీ లలితానామ, గుణ, లీలాదుల శ్రవణకీర్తనాదుల మాత్రాన పుణ్యం లభిస్తుంది.

ఓం పులోమజార్చితాయై నమః : పులోమ మహరిషనందన అయిన శచీదేవిచే అర్చించబడిన తల్లికి ప్రణతులు.

ఓంబంధమోచిన్యై నమః : ప్రకృతి బంధనాలనుండీ సంసార బంధనాలనుండీ కూడా విముక్తిని ప్రసాదించగల మహేశ్వరికి ప్రణతులు.

ఓం బంధురాలకాయై నమః : దట్టమయిన కేశపాశంకల తల్లికి ప్రణతులు.

ఓం విమర్శరూపిణ్యై నమః : విమర్శించగల మహత్తర శక్తి స్వరూపిణికి ప్రణతులు.

ఓం విద్యాయై నమః : మోక్షదాయకమగు విద్యా స్వరూపిణికి వందనాలు.

ఓం వియాదాది జగత్ప్రసవే నమః : అకాశాది పాంచభౌతిక జగత్తును సృష్టించు మాతకు వందనాలు.

ఓం సర్వవ్యాధి ప్రశమన్యై నమః : శారీరక బాధలైన వ్యాధులను మానసిక బాధలనై ఆధులనూ, సర్వ వ్యాధులనూ రూపుమాపునట్టి మాతకు వందనాలు.

ఓం సర్వమృత్యు నివారిణ్యై నమః : అపమృత్యు, అకాల మృత్యువాదిగాగల సర్వమృత్యువులనూ నివారించునట్టి మాతకు ప్రణతులు.

ఓం అగ్రగణ్యాయై నమః : జగదాదికి కూడా ఆదిమూర్తి అయి ప్రప్రథమంగా గణించదగిన మాతకు వందనాలు.

ఓం అచిన్త్య రూపాయై నమః : చింతించుటకు వీలుగాని మహత్తర స్వరూపిణికి ప్రణతులు.

ఓం కలికల్మష నాశిన్యై నమః : కలికాల సంబంధమైన సమస్త కల్మషాలనూ నాశనం చేయునట్టి మాతకు ప్రణతులు.

ఓం కాత్యాయన్యై నమః : దేవతలందరి తేజస్సుతో కృత్యుడనే మహర్షిపుత్రికగా అవతరించిన కాత్యానీదేవికి ప్రణతులు.

ఓం కాలహన్త్రై నమః : కాలాన్ని సయితము హరించునట్టి దేవికి వందనాలు.

ఓం కమలాక్ష సేవితాయై నమః : కమలాక్షుడంటే శ్రీహరి. అట్టి శ్రీహరిచేతకూడా సేవింపబడెడి తల్లికి వందనాలు.

ఓం తాబూలపూరిత ముఖ్యై నమః : సుగంధ పరిమళోపేదమైన పచ్చకర్పూర మిశ్రిత తాంబూల పూరిత ముఖం కల మాతకు వందనాలు.

ఓం దాడిమీకుసుమ ప్రభాయై నమః : దానిమ్మపూవు వంటి అరుణారుణ శోభలతో భాసిల్లు లలితామాతకు ప్రణతులు.

ఓం మృగాక్ష్యై నమః : యావద్విశ్వాన్నీ మోహింపజేయునట్టి మోహినీ మూర్తికి ప్రణతులు.

ఓం ముఖ్యాయై నమః : మానవమాత్రునికే అననేల ప్రాణి మాత్రులకు జననికన్న ముఖ్యులెవరుంటారు? అట్టి ముఖ్యరాలికి వందనాలు.

ఓం మృడాన్యై నమః : మృడుడనగా శివుడు. అట్టి మృడుని ప్రియపత్నియైన మృడానీ దేవికి వందనాలు.

ఓం మిత్ర రూపిణ్యై నమః : ద్వాదశాదిత్యులలో మిత్రనామమొకటి ఉంది. జీవకోటికి భాస్కరుని కన్న మిత్రులు లేరు. అట్టి మిత్రస్వరూపిణికి వందనాలు.

ఓం నిత్యతృప్తాయై నమః : సర్వకాల సర్వావస్థలయందు తృప్తి కలిగియుండు మాతకు వందనాలు.

ఓం భక్తనిధయే నమః : భక్త జనులందరికిని నిధి వంటి మాతకు ప్రణతులు.

ఓం నియంత్ర్యై నమః : సర్వులనూ నియంత్రణలో అంటే ఆధీనంలో ఉంచుకొని శాసించునట్టి మాతకు ప్రణతులు.

ఓం నిఖిలేశ్వరై నమః : నిఖిలమైన అంటే సమస్తమైన విశ్వాలకూ అధీశ్వరియైన దేవికి వందనాలు.

ఓం మైత్ర్యాది వాసనాలభ్యాయై నమః : వాసనలు చతుర్విధాలు, 1 మైత్రి 2 కరుణ, 3. ముదిత, 4. ఉపేక్ష – వీటిచే ప్రన్నురాలగునట్టి లభించునట్టి మాతకు ప్రణతులు.

ఓం మహాప్రళయసాక్షిణ్యై నమః : మహాప్రళయవేళలో కూడ సాక్షిగా ఉండునట్టి మహాశక్తికి వందనాలు.

ఓం పరాశక్త్యై నమః : పరాశక్తి స్వరూపిణికి వందనాలు.

ఓం పరానిష్ఠాయై నమః : బ్రహ్మజ్ఞాన నిష్ఠా స్వరూపిణికి వందనాలు.

ఓం ప్రజ్ఞాన ఘనరూపిణ్యై నమః : భిన్నవృత్తిలేని బుద్ధికి ప్రజ్ఞాన ఘనమని నామము - అట్టి స్వరూపము గల దేవికి వందనాలు.

ఓం మాధ్వీపానాలసాయై నమః : పుష్ప, ద్రాక్షాసవాది మధుపానమందు లాలసగల దేవికి వందనాలు.

ఓం మత్తాయై నమః : మదత్త స్వరూపిణియైన శక్తికి ప్రణతులు

ఓం మాతృకావర్ణరూపిణ్యై నమః : అ కారాది క్ష కారాంతంగా గల మాతృకా వర్ణాలే స్వరూపంగాగల లలితా పరమేశ్వరికి వందనాలు.

ఓం మహాకైలాస నిలయాయై నమః : మహోన్నతమై మహోత్కృష్టమైన కైలసపర్వతశికరమే నిలయస్థానంగా కల దేవికి వందనాలు.

ఓం మృణాళ మృదుదోర్లతాయై నమః : మృదువైన లత, తామరతూడులవంటి కోమలభుజాలు కల తల్లికి వందనాలు.

ఓం మహనీయాయై నమః : మహాత్ములచే సయితము పూజింపబడునట్టి మహనీయమూర్తికి నమోవాకాలు.

ఓం దయామూర్త్యై నమః : దయయే స్వరూపంగాగల కరుణా స్వరూపిణికి వందనాలు.

ఓం మహాసామ్రాజ్యశాలిన్యై నమః : కైలాసాధిపత్యానికి మహాసామ్రాజ్యమని అర్థముంది. అట్టి మహాసామ్రాజ్యంలో తేజరిల్లునట్టి మహాదేవికి వందనలు.

ఓం ఆత్మవిద్యాయై నమః : బ్రహ్మ విద్యా స్వరూపిణికి వందనాలు.

ఓం మహావిద్యాయై నమః : శ్రీషోడశాక్షరీ మహామంత్రానికి మహావిద్య అనిపేరు. అట్టి మహావిద్యా స్వరూపిణికి ప్రణతులు.

ఓం శ్రీవిద్యాయై నమః : బాల, పంచదశాక్షరీ, షోడశాక్షరీ విద్యకు శ్రీవిద్య అనిపేరు. అట్టి శ్రీ విద్యారూపిణికి ప్రణతులు.

ఓం కామసేవితాయై నమః : కామదేవునిచే సేవించబడునట్టి తల్లికి వందనాలు.

ఓం శ్రీ షోడశాక్షరీ విద్యాయై నమః : పదహారు బీజాక్షరాలు గల విద్యాస్వరూపిణికి నమస్కారాలు.

ఓం కామకోటికాయై నమః : వాగ్భవ, మధ్య, శక్తినామక కూటత్రయ స్వరూపిణికి నమస్కారాలు.

ఓం కామకోటికాయై నమః : కామకోటిపీఠంలో తేజరిల్లునట్టి కోటికాముల సౌందర్యాన్నధిగమించిన మహాశక్తికి వందనాలు.

ఓం కటాక్షికింకరీ భూతకమలా కోటి సేవితాయై నమః : అనంత లక్ష్ములచే సేవింపబడు కటాక్షవీక్షణలుగల మహాశక్తికి ప్రణతులు.

ఓం శిరస్థితాయై నమః : గురుపాదుకల రూపంలో శిరోపరిబాగంలో భాసిల్లు దేవికి వందనాలు.

ఓం చంద్రనిభాయై నమః : పూర్ణచంద్రునివంటి చల్లని కాంతులతో ప్రకాశించు మాతకు వందనాలు.

ఓం ఫాలస్థాయై నమః : ఫాలభాగంలో జ్ఞాననేత్ర స్థానంలో విరాజిల్లు దేవికి వందనాలు.

ఓం ఇంద్రధనుః ప్రభాయై నమః : ఇంద్రధనుస్సమాన కాంతులతో ప్రకాశించు తల్లికి వందనాలు.

ఓం హృదయస్థాయై నమః : హృదయాంతరాళంలో భాసిల్లు భవానికి ప్రణతులు.

ఓం రవిప్రఖ్యాయై నమః : అనంత ప్రభలతో లోకాల చీకట్ల రూపుమాపే రవిస్వరూపిణికి వందనాలు.

ఓం త్రికోణాంతర దీపికాయై నమః : స్వాధిష్ఠాన చక్రంలో త్రికోణాకృతిలో తేజరిల్లు దీపికా స్వరూపిణికి ప్రణతులు.

ఓం దాక్షాయణ్యై నమః : దక్షప్రజాపతి సుతయైన సతీదేవి రూపంలో ఖ్యాతి

చెందిన మాతకు వందనాలు.

ఓం దైత్యహన్త్ర్యై నమః : దైత్యులను అంటే రాక్షసులను అంతంచేసిన శక్తికి నమస్కారాలు.

ఓం దక్షయజ్ఞ వినాశిన్యై నమః : దక్షుని యాగాన్ని విధ్వంసం చేసిన సతీ స్వరూపిణికి వందనాలు.

ఓం దరాందోళిత దీర్ఘాక్ష్యై నమః : ఆకర్ణాంతం వ్యాపించిన విశాలనేత్రాలు కల మాతకు నమస్కారాలు.

ఓం దరహాసోజ్వలన్ముఖ్యై నమః : మందస్మిత వదనారవిందంతో ప్రకాశించునట్టి ముఖంకల దేవికి వందనాలు.

ఓం గురుమూర్త్యై నమః : బ్రహ్మజ్ఞాన స్వరూపిణికి ప్రణతులు.

ఓం గుణనిధ్యై నమః : గుణాలకు నిధివంటి తల్లికి వందనాలు.

ఓం గోమాత్రే నమః : గోజాతికి తల్లివంటి దేవికి వందనాలు.

ఓం గుహజన్మభువే నమః : గుహుడనగా కుమారస్వామి కుమార జననికి ప్రణతులు.

ఓం దేవేశ్యై నమః : దేవతలకు అధీశ్వరియైన పరమేశ్వరికి ప్రణతులు.

ఓం దండ నీతిస్థాయై నమః : అర్థశాస్త్ర + నీతిశాస్త్ర వర్ణితమైన దండనీతిలో విలసిల్లు దేవికి ప్రణామాలు.

ఓం దహరాకాశ రూపిణ్యై నమః : హృదయ కుహరానికి దహరాకాశమని పేరు. అట్టి దహరాకాశ రూపిణికి వందనాలు.

ఓం ప్రతిపన్ముఖ్యరాకన్త తిథి మణ్డలపూజితాయై నమః : పాడ్యమీ ప్రభృతి పూర్ణిమా పర్యంతం విశేష విధులచే పూజించ దగిన మాతకు ప్రణతులు.

ఓం కళాత్మికాయై నమః : సర్వకళామతల్లికి నమోవాకాలు.

ఓం కలానాథాయై నమః : కళానాథ ( చంద్ర) స్వరూపిణికి ప్రణతులు.

ఓం కావ్యాలాప వినోదిన్యై నమః : కావ్యాలాపంతో వినోదించునట్టి మాతకు ప్రణతులు.

ఓం సమాచార రమావాణీ సవ్యదక్షిణ సేవితాయై నమః : కుడి ఎడమలలో నిలచిన లక్ష్మీ సరస్వతులచే సేవించబడు మాతకు ప్రణతులు.

ఓం ఆదిశక్త్యై నమః : ఆది శక్తియైన మాతకు వందనాలు.

ఓం అమేయాయై నమః : కొలవరాని అతీతమూర్తికి ప్రణామాలు.

ఓం ఆత్మనే నమః : ఆత్మస్వరూపిణికి ప్రణామాలు.

ఓం పరమాయై నమః : ఉత్కృష్టరూపం కల తల్లికి వందనాలు.

ఓం పావనాకృత్యై నమః : పవిత్రమైన ఆకారం కల జననికి వందనాలు.

ఓం అనేకకోటి బ్రహ్మాండ జనన్యై నమః : అనేక కోటి బ్రహ్మాండాలకు తల్లి ఇయన దేవికి వందనాలు.

ఓం దివ్యవిగ్రహాయై నమః : దివ్యస్వరూపం కల తల్లికి ప్రణతులు.

ఓం క్లీంకార్యై నమః : క్లీం కామరాజబీజము. అట్టి క్లీం బీజ స్వరూపిణికి నమస్కారాలు.

ఓం కేవలాయై నమః : సర్వధర్మాతీతయై కేవలంగా ఉండు అద్వితీయ మూర్తికి వందనాలు.

ఓం గుహ్యాయై నమః : రహస్యాతి రహస్య స్వరూపిణికి ప్రణతులు.

ఓం కైవల్యఫలదాయిన్యై నమః : సర్వోత్కృష్టమై సామాన్యజన దుర్లభమయిన కైవల్య పదాన్ని తన భక్త జనులకు ప్రసాదించునట్టి తల్లికి వందనాలు.

ఓం త్రిపురాయై నమః : త్రిపుసుందరీ దేవికి వందనాలు.

ఓం త్రిజగద్వంద్యాయై నమః : ముల్లోక వాసులచే వందనాలందుకొనునట్టి తల్లికి వందనాలు.

ఓం త్రిమూర్త్యై నమః : త్రిమూర్తి స్వరూపిణికి నమోవాకాలు.

ఓం త్రిదశేశ్వర్యై నమః : దేవతలకు నాయకయై ఈశ్వరికి వందనాలు.

ఓం త్రత్యక్షర్యై నమః : వాగ్భవ, కామ, శక్తి ఇవి మూడు బీజాక్షరాలు ఓం త్ర్యక్షరీ స్వరూపిణికి వందనాలు.

ఓం దివ్యగంధాఢ్యాయై నమః : దివ్యగంధాను లేపనాలతో కూడి భాసిల్లునట్టి దేవికి వందనాలు.

ఓం సింధూర తిలకాంచితాయై నమః : సింధూర తిలకంతో శోభిల్లునట్టి జననికి వందనాలు.

ఓం ఉమాయై నమః : బ్రహ్మవిద్యాధిష్ఠాన దేవియైన ఉమాభగవతికి ప్రణతులు.

ఓం శైలేన్ద్ర తనయాయై నమః : శైలేంద్రుడయిన పర్వతరాజపుత్రికి వందనాలు.

ఓం గౌర్యై నమః : గౌరవర్ణంకల గౌరీదేవికి ప్రణతులు.

ఓం గన్ధర్వ సేవితాయై నమః : గంధర్వులచే సేవించబడు జననికి ప్రణామాలు.

ఓం విశ్వగర్భాయై నమః : విశ్వాన్ని గర్భంలో ధరించిన మాతకు ప్రణామాలు.

ఓ స్వర్ణగర్భాయై నమః : స్వర్ణగర్భమూర్తికి ప్రణతులు.

ఓం అవరదాయై నమః : దుష్టులను అనుగ్రహించని, దుష్టులకు నాస్తికలకు వరాలు యీయని మాతకు నమస్కారాలు.

ఓం వాగధీశ్వర్యై నమః : వాక్కును శాసించునట్టి ఈశ్వరికి ప్రణతులు.

ఓం ధ్యానగమ్యాయై నమః : దేశకాలాదులచే పరిచ్ఛిన్నురాలు కాని మాతకు వందనాలు.

ఓం జ్ఞానదాయై నమః : జ్ఞానాన్ని ప్రసాదించునట్టి జ్ఞాన రూపిణికి ప్రణతులు.

ఓం జ్ఞాన విగ్రహాయై నమః : జ్ఞానమే స్వరూపంగా గల మాతకు ప్రణామాలు.

ఓం సర్వ వేదాంత సంవేద్యాయై నమః : సర్వవేదాంతాలచే అంటే సమస్తమైన ఉపనిషత్తులచే తెలిసికొనదగిన మాతకు వందనాలు.

ఓం సత్యానన్ద స్వరూపిణ్యై నమః : సత్యానందస్వరూపిణికి ప్రణామాలు.

ఓం లోపాముద్రార్చితాయై నమః : లోపాముద్రాదేవిచే అర్చించబడిన పాదకమలాలుగల తల్లికి నమస్కారాలు.

ఓం లీలాక్లప్త బ్రహ్మాణ్డ మణ్డలాయై నమః : లీలామాత్రగా అంటే అవలీలగా బ్రహ్మాండాలను సృష్టించునట్టి జననికి వందనాలు.

ఓం అదృశ్యాయై నమః : సామాన్య దృష్టికి కనిపించని దేవతకు ప్రణతులు.

ఓం దృశ్యరహితాయై నమః : లౌకిక విషయాతీతమూర్తికి ప్రణామాలు.

ఓం విజ్ఞాత్ర్యై నమః : సర్వజ్ఞమూర్తికి ప్రణతులు.

ఓం వేద వర్జితాయై నమః : తెలిసికోదగిన విషయాలను వర్జించిన మాతకు నమోవాకాలు.

ఓం యోగిన్యై నమః : యోగాభ్యాస రతురాలైన మాతకు వందనాలు.

ఓం యోగదాయై నమః : యోగాన్ని ప్రసాదించు మాతకు ప్రణతులు.

ఓం యోగ్యాయై నమః : సర్వోత్తమ యోగ స్వరూపిణికి ప్రణతులు.

ఓం యోగానన్దాయై నమః : యోగానంద స్వరూపిణికి ప్రణతులు.

ఓం యుగంధరాయై నమః : విశ్వరూప రథానికి శీలగా ఉండి సర్వాన్నీ సంరక్షించు మాతకు ప్రణామాలు.

ఓం ఇచ్ఛాశక్తిజ్ఞానశక్తిక్రియాశక్తి స్వరూపిణ్యై నమః : శక్తి త్రయస్వరూపిణికి వందనాలు.

ఓం సర్వాధారాయై నమః : యావద్విశ్వానికీ ఆధారస్వరూపిణియైన మాతకు నమస్కారాలు.

ఓం సుప్రతిష్ఠాయై నమః : సత్కీర్తిగల మాతకు వందనాలు.

ఓం సదసద్రూపధారిణ్యై నమః : సదసత్తులు రూపముగా ధారణచేసిన మాతకు నమస్కారాలు.

ఓం సుప్రతిష్ఠాయై నమః : సత్కీర్తిగల మాతకు వందనాలు.

ఓం సదసద్రూపధారిణ్యై నమః : సదసత్తులు రూపముగా ధారణచేసిన మాతకు వందనాలు.

ఓం అష్టమూర్త్యై నమః : అష్టమూర్తి స్వరూపుడైన శివునకు వలెనే అష్టమూర్తి స్వరూపిణికి వందనాలు.

ఓం అజాజైత్ర్యై నమః : బ్రహ్మ, విజయ స్వరూపిణికి వందనాలు.

ఓం లోకయాత్రా విధాయిన్యై నమః : లోకయాత్రను విశదీకరించి తద్విధాయినిగా భాసిల్లు మహేశ్వరికి ప్రణామాలు.

ఓం ఏకాకిన్యై నమః : అద్వైత మూర్తి స్వరూపిణికి ఏకాకికి నమస్కారాలు.

ఓం భూమరూపాయై నమః : సర్వాంతర్యామియైన భూమరూపిణికి ప్రణామాలు.

ఓం నిర్ద్వైతాయై నమః : ద్వైతాతీత స్వరూపిణికి ప్రణతులు.

ఓం ద్వైతవర్జితాయై నమః : ద్వైత భావాన్ని విసర్జించిన మాతకు ప్రణామాలు.

ఓం వసుధాయై నమః : ధనధాన్య రత్నాదులను ప్రసాదించు వసుధామూర్తికి ప్రణతులు.

ఓం వృద్ధాయై నమః : వృద్ధ స్వరూపిణికి ప్రణతులు.

ఓం బ్రహ్మాత్మైక స్వరూపిణ్యై నమః : బ్రహ్మాత్మైక స్వరూపిణికి వందనాలు.

ఓం బృహత్యై నమః : మహత్తర స్వరూపిణికి గొప్ప తల్లికి వందనాలు.

ఓం బ్రాహ్మణ్యై నమః : విప్రస్త్రీ స్వరూపిణికి ప్రణతులు.

ఓం బ్రాహ్మ్యై నమః : బ్రహ్మీదేవికి వందనాలు.

ఓం బ్రహ్మానందాయై నమః : బ్రహ్మానంద స్వరూపిణికి ప్రణతులు.

ఓం బలిప్రియాయై నమః : అర్చనోపచారాదులలో ఒకటైన బలియందు ప్రీతిగల మాతకు ప్రణతులు.

ఓం భాషారూపాయై నమః : భాషయే స్వరూపంగాకల మాతకు ప్రణతులు.

ఓం బృహత్సేనాయై నమః : విశేష సైన్యాలుకల మహాశక్తికి వందనాలు.

ఓం భావభావ వివర్జితాయై నమః : భావాన్నీ, అభావాన్నీ కూడ వర్జించిన అతీతమూర్తికి ప్రణతులు.

ఓం సుఖారాధ్యాయై నమః : సుఖంగా ఆరాధించదగిన దేవతతక్కు నమస్కారాలు.

ఓం శుభకర్త్ర్యై నమః : భక్తజనులకు శుభాలను చేకూర్చునట్టి మాతకు ప్రణతులు.

ఓం శోభనా సులభాగత్యై నమః : మంగళములను పొందుటకు అంటే మోక్షమార్గాన్ని సాధించుటకు సులభమైన గతిని ప్రసాదించు కరుణామయికి ప్రణతులు.

ఓం రాజ్యదాయిన్యై నమః : మహత్తర రాజ్యాన్ని ప్రసాదించగల దయామయికి ప్రణతులు.

ఓం రాజ్యవల్లభాయై నమః : వైకుంఠ, కైలాసాది దివ్య సామ్రాజ్యాధీశ్వరికి ప్రణతులు.

ఓం రాజత్కృపాయై నమః : కృపావిశేషంగా బాసిల్లునట్టి మాతకు ప్రణతులు.

ఓంరాజపీఠ నివేశితాయై నమః : మహత్తరైశ్వర్య సంబంధితమై పరమ పావనమైన రాజపీఠాలే నివాసంగా గల మాతకు ప్రణతులు.

ఓం రాజ్యలక్ష్మై నమః : రాజ్యలక్ష్మీ స్వరూపంతో శాసించు మాతకు వినయవందనాలు.

ఓం కోశనాథాయై నమః : నవ నిధులకు సకల సంపందలకు అధీశ్వరియైన మహా మాతకు వందనాలు.

ఓం చతురంగ బలేశ్వర్యై నమః : రథ, గజ, తురగ, పదాతివర్గానికి చతురంగబలం అని పేరు. అట్టి చతురంగ బలాలను శాశించునట్టి మహాశక్తికి వందనాలు.

ఓం సామ్రాజ్యదాయిన్యై నమః : మహోత్కృష్ట సామ్రాజ్యాలను ప్రసాదించునట్టి దేవికి వందనాలు.

ఓం సత్యసంధాయై నమః : సత్యమందు ఓతప్రోతయై భాసిల్లునట్టి సత్య సంధురాలికి వందనాలు.

ఓం సాగరమేఖలాయై నమః : సాగరమేఖల (మొలత్రాడు) గా గల మాతకు నమస్కారాలు.

ఓం దీక్షితాయై నమః : పూర్ణదీక్షాపరురాలైన మాతకు పూర్ణదీక్షాపరులను అనుగ్రహించు తల్లికి ప్రణతులు.

ఓం దైత్యశమన్యై నమః : దరహంకారపూరితులై ఉద్దండులైన లోకకంటకులైన రాక్షసులను అంతం చేయునట్టి మహేశ్వరికి నమస్కారాలు.

ఓం సర్వలోకవశంకర్త్యై నమః : సర్వలోకాలను వశమందుంచుకొనునట్టి మాతకు నమస్కారాలు.

ఓం సర్వార్థదాత్ర్యై నమః : సమస్తమైన అర్థాలనూ అంటే కోరికలనూ నెరవేర్చునట్టి మాతకు ప్రణతులు.

ఓం సావిత్ర్యై నమః : సావిత్రీదేవి స్వరూపంలో తేజరిల్లు ఆదిశక్తికి వందనాలు.

ఓం సచ్చిదానంద రూపిణ్యై నమః : అవినాశనమై జ్ఞానానంద స్వరూపంతో భాసిల్లునటిట దేవికి ప్రణతులు.

ఓం దేశకాలాపరిచ్ఛిన్నాయై నమః : దేశకాలాదులచే పరిచ్ఛిన్నురాలుకాని అపరిచ్ఛిన్నశక్తికి వందనాలు.

ఓం సర్వగాయై నమః : యావదిశ్వంలోని చరాచరాలలో సంచరించునట్టి మహాశక్తికి ప్రణతులు.

ఓం సర్వమోహిన్యై నమః : అందరినీ మోహింపజేయునట్టి మోహనమూర్తికి ప్రణతులు.

ఓం సర్వత్యై నమః : సుజ్ఞాన మూర్తియై, సర్వవిద్యా స్వరూపిణియై ఎల్ల చదువులునూ ప్రసాదించు సరస్వతీ మాతకు వందనాలు.

ఓం శాస్త్రమయ్యై నమః : సర్వ శాస్త్రులే స్వరూపంగా గల దేవికి ప్రణతులు.

ఓం గుహాంబాయై నమః : హృదయరూప గుహలో రహస్యంగా ఉండునది. గుహుడు అంటే కుమారస్వామికి అంబ అయిన దేవికి ప్రణతులు.

ఓం గుహ్యరూపిణ్యై నమః : అతయత రహస్యమైన పరమహంస్యాద్వైత రూపంగల మాతకు కైమోడ్పులు.

ఓం సర్వోపాధి వినిర్ముక్తాయై నమః : ఉపాధులేవీ లేని సమస్తమైన ఉపాధులచేతనూ ముక్తురలైన మాతకు నమస్కారాలు.

ఓం సదాశివ పతివ్రతాయై నమః : సదాశివదేవుని సతియై మహాపతివ్రతగా విశ్వవిఖ్యాతిగాంచు మాతకు నమస్కారాలు.

ఓం సంప్రదాయేశ్వర్యై నమః : సకల సంప్రదాయాలనూ శాసించు మాతకు నమస్కారాలు.

ఓం సాధ్వ్యై నమః : సాధ్వీమతల్లికి ప్రణామాలు.

ఓం ఈ నమః : కామకళా సంజ్ఞకమై 'ఈ' బీజాక్షర స్వరూపిణియైన పరమేశ్వరికి వందనాలు.

ఓం గురుమండల రూపిణ్యై నమః : పరమశివుడాదిగా తనకు మంత్రోపదేశం చేసిన గురుదేవుని వరకూ గల ఏ గురుమండలములున్నవో ఆ గురుమండల సర్వస్వ స్వరూపిణికి ప్రణామాలు.

ఓం కులోత్తీర్ణాయై నమః : కులోత్తీర్ణస్వరూపిణి అయిన మాతకు నమస్కారాలు.

ఓం మధుమత్యై నమః : మధురమైన మతిగల మాతకు ప్రణామాలు.

ఓం మహ్యై నమః : మహీరూపిణికి వందనాలు.

ఓం గణాంబాయై నమః : సర్వగణాలకూ మాతృమూర్తియైన మహామాతకు వందనాలు.

ఓం గుహ్యకారాధ్యాయై నమః : గుహ్యకులు – అనే దేవతలచే ఆరాధించబడిన మాతకు నమస్కారాలు.

ఓం కోమలాంగ్యై నమః : కోమలమైన అంగాలు కల తల్లికి వందనాలు.

ఓంగురుప్రియాయై నమః : విశ్వాలకే గురువైన మహాదేవుని యందు ప్రియము కల తల్లికి వందనాలు.

ఓం స్వతంత్రాయై నమః : సర్వతంత్ర స్వతంత్రురాలైన మాతకు నమస్కారాలు.

ఓం సర్వతంత్రాయై నమః : స్వతంత్ర స్వరూపిణికి ప్రణతులు.

ఓం దక్షిణామూర్తి రూపిణ్యై నమః : సాక్షాత్తూ దక్షిణామూర్తి స్వరూపిణిగా భాసిల్లే మాతకు ప్రణామాలు.

ఓం సనకాది సమారాధ్యా నమః : సనకాది దివ్యర్షులచే కూడా ఆరాధించబడిన మాతకు ప్రణతులు

ఓం శివజ్ఞాన ప్రదాయిన్యై నమః : పరమశివ సంబంధమైన జ్ఞా విషయాలను ప్రసాదించునట్టి తల్లికి వందనాలు.

ఓంచిత్కలాయై నమః : చైతన్య కళామూర్తికి వందనాలు.

ఓం ఆనందకలికాయై నమః : పరబ్రహ్మాంశా స్వరూపమైన ఆనందకళా స్వరూపిణి వందనాలు.

ఓం ప్రేమరూపాయై నమః : ప్రేమయే స్వరూపంగా గల దేవికి నమస్కారములు.

ఓం ప్రియంకర్యై నమః : ప్రియాన్ని కలుగుజేయునట్టి మాతకు ప్రణతులు.

ఓం నామపారాయణ ప్రీతాయై నమః : నామములను పారాయణ చేసెడివారి యందు ప్రీతికలిగి అనుగ్రహించునట్టి మాతకు వందనాలు.

ఓం నందివిద్యాయై నమః : నందీశ్వరునిచే ఉపాసించబడిన మహావిద్యాస్వరూపిణికి ప్రణతులు

ఓం నటేశ్వర్యై నమః : నటరాజ సతికి ప్రణతులు

ఓం మిథ్యాజగదధిష్ఠానాయై నమః : అసత్య రూపమైన విశ్వానికి అధిష్ఠాన రూపిణియైన తల్లికి ప్రణతులు.

ఓం ముక్తిదాయై నమః : మోక్షాన్ని ప్రసాదించు జననికి వందనాలు.

ఓం ముక్తిరూపిణ్యై నమః : ముక్తియే స్వరూపంగా గల మాతకు ప్రణతులు.

ఓం లాస్యప్రియాయై నమః : లాస్యమందు విశేష ప్రీతిగల మాతకు నమస్కారాలు.

ఓం లయకర్త్ర్యై నమః : నాట్యగాన తాళాలు సక్రమంగా ఉండుటకు లయమని పేరు అట్టి లయను చేయగల తల్లికి వందనాలు.

ఓం లజ్జాయై నమః : లజ్జా స్వరూపంలో భాసిల్లు మాతకు ప్రణతులు.

ఓం రంభాదివందితాయై నమః : రంభాద్యప్సరః కాంతలచే వందనాలందు కొనునట్టి తల్లికి వందనాలు.

ఓం భవదావ సుధావృష్ట్యై నమః : భవరూపమైన దావానంలో అమృతాన్ని వర్షింపజేయునట్టి మాతకు ప్రణతులు.

ఓం పాపారణ్య దవానలాయై నమః : పాపరూపారణ్యానికి దావానలంవంటి మాతృమూర్తికి వందనాలు.

ఓం దౌర్భాగ్యతూలవాతూలాయై నమః : దౌర్భాగ్యరూపమైన శుష్కగ్రాసాన్ని ఎగురగొట్టి వేయునట్టి ఝుం ఝూమారుత రూపిణికి ప్రణామాలు.

ఓం జరాధ్వాంత రవిప్రభాయై నమః : ముసలితనమనే అంధకారాన్ని రూపుమాపడానికి అనంత ప్రభలతో భాసిల్లునట్టి సూర్యస్వరూపిణికి ప్రణతులు.

ఓం భాగ్యాబ్ధి చంద్రికాయై నమః : భాగ్యరూపసాగరానికి చంద్రిక స్వరూపిణియైన మాతకు ప్రణతులు.

ఓం భక్తి చిత్త కేకి ఘనాఘనాయై నమః : భక్తజనుల చిత్తరూపమైన మయూరాన్ని ఆనందపరుచునట్టి మేఘజాల రూపిణి అయిన మాతకు ప్రణతులు.

ఓం రోగపర్వత దంభోళ్యై నమః : రోగరూప పర్వతాలకు వజ్రస్వరూపిణి అయిన మాతకు ప్రణతులు.

ఓం మృత్యుదారుకుఠారికాయై నమః : మృత్యురూప కాష్ఠాలను ఖండించుటకు

పరదాశువుని వంటి జననికి నమస్కారములు.

ఓం మహేశ్వర్యై నమః: మహేశ్వరీ మూర్తికి ప్రణతులు.

ఓం మహాకాళ్యై నమః : మహత్తరమైన మహిమలుకల మహాకాళీ రూపిణికి నమోవాకాలు.

ఓం మహాగ్రాసాయై నమః : మహత్తరమైన అపరిమితమైనదియగు ఆహారమును స్వీకరించు తల్లికి ప్రణతులు.

ఓం మహాశనాయై నమః : చరాచర విశ్వమే ఆసనముగా గల మాతకు ప్రణతులు.

ఓం అపర్ణాయై నమః : పరమశివునికై పత్రాలను కూడ త్యజించి తపస్సు చేసిన అపర్ణాదేవికి నమస్కారములు.

ఓంచండికాయై నమః : నాస్తికులయందు, భక్తిహీనులయందు క్రోధాన్ని చూపునట్టి చండికాదేవికి వందనాలు.

ఓం చండముండాసుర నిషూదిన్యై నమః : చండముండాది క్రూరరాక్షసులను సంహరించిన మాతకు ప్రణతులు.

ఓం క్షరాక్షరాత్మికాయై నమః : క్షరస్వరూపిణియు అక్షర స్వరూపిణియు తానేయై భాసిల్లునట్టి మాతకు నమస్కారాలు.

ఓం సర్వలోకేశ్యై నమః : సర్వలోకాలకూ శాసకురాలైన మహేశ్వరికి వందనాలు.

ఓం విశ్వధారిణ్యై నమః : విశ్వాలను అన్నింటినీ ధరించునట్టి మహామాతకు విజయాంజలులు.

ఓం త్రివర్గదాత్ర్యై నమః : ధర్మార్థకామాలనే త్రివర్గాలనూ ప్రసాదించునట్టి జననికి ప్రణతులు.

ఓం సుభగాయై నమః : పంచవర్షప్రాయ అయిన కన్యను సుభగ – అంటారు. అట్టి కన్యామూర్తికి ప్రణతులు.

ఓం త్ర్యంబకాయై నమః : త్రిమూర్తుల జననీ స్వరూపంతో లోకాలను పాలించు తల్లికి వందనాలు.

ఓం త్రిగుణాత్మికాయై నమః : సత్త్వరజస్తమోరూపిణికి ప్రణతులు.

ఓం స్వర్గాపవర్గదాయై నమః : స్వర్గ, మోక్షాలను ప్రసాదించు మాతృదేవతకు ప్రణతులు.

ఓం శుద్ధాయై నమః : శుద్ధ స్వరూపిణికి ప్రణతులు.

ఓం జపాపుష్ప నిభాకృత్యై నమః : జపాపుష్ప సమమైన కాంతిగల మాతృమూర్తికి నమస్కారాలు.

ఓం తేజోవత్యై నమః : తేజస్స్వరూపణికి ప్రణతులు.

ఓం ద్యుతిధరాయై నమః : ద్యుతిని – కాంతిని ధరించిన కాంతిమయ స్వరూపిణికి వందనాలు.

ఓం యజ్ఞరూపాయై నమః : యాగస్వరూపిణికి నమస్కారాలు.

ఓం ప్రియవ్రతాయై నమః : సమస్తమైన వ్రతాలయందు ప్రీతి అంటే ఇష్టంకల మాతకు ప్రణతులు.

ఓం దురారాధ్యాయై నమః : దురాత్ములు ఆరాధించుటకు వీలుకాని మహేశ్వరికి వందనాలు.

ఓం దురాధర్షాయై నమః : దురాత్ములకు ప్రసన్నంకాని మాతకు వందనాలు.

ఓం పాటవీకుసుమప్రియాయై నమః : పాటలీ పుష్పమంటే ప్రీతికల మాతకు వందనాలు.

ఓం మహత్యై నమః : గొప్పదైన తల్లికి వందనాలు.

ఓం మేరునిలయాయై నమః : సుమేరుగిరి నిలయస్థానంగా గల నీకు వందనాలు.

ఓం మందారకుసుమప్రియాయై నమః : మందారపుష్పమంటే యిష్టంకల లలితామాతకు నమస్కారాలు.

ఓం వీరారాధ్యాయై నమః : వీరులచే ఆరాధించబడునట్టి తల్లికి ప్రణామాలు.

ఓం విరాడ్రూపాయై నమః : విరాట్ స్వరూపిణికి నమస్కారాలు.

ఓం విరజాయై నమః : విరజా స్వరూపిణికి వందనాలు.

ఓం విశ్వతోముఖ్యై నమః : విశ్వమంతా వ్యాపించిన సర్వతోముఖ స్వరూపిణికి ప్రణతులు.

ఓం ప్రత్యగ్రూపాయై నమః : ప్రత్యగాత్మ – ఆత్మస్వరూపిణికి అంజలులు.

ఓం పరాకాశాయై నమః : పరాకాశమంటే – పరబ్రహ్మ – అట్టి స్వరూపంకల మాతకు వందనాలు.

ఓం ప్రాణదాయై నమః : ప్రాణశక్తిని ప్రసాదించి వర్ధిల్లజేయు శక్తి స్వరూపిణికి ప్రణతులు.

ఓం ప్రాణరూపిణ్యై నమః : ప్రాణశక్తి స్వరూపిణికి నమస్కారాలు.

ఓం మార్తాండ భైరవ వారాధ్యాయై నమః : మార్తాండ భైరవుని చేత కూడా ఆరాధింపబడిన మాతకు ప్రణామములు.

ఓం మన్త్రిణీ న్యస్తరాజ్యధురే నమః : మంత్రిణీశక్తి యందుగల రాజ్యభారంగల మాతకు వందనాలు.

ఓం త్రిపురేశ్యై నమః : త్రిపురనాయికా స్వరూపిణికి వందనాలు.

ఓం జయత్సేనాయై నమః : జయమే లక్ష్యంగా గల సేనగల లలితామాతకు ప్రణతులు.

ఓం నిస్త్రైగుణ్యాయై నమః : త్రిగుణాతీత మూర్తికి వందనాలు.

ఓం పరాపరాయై నమః : పరస్వరూపిణియు, అపరా స్వరూపిణియు అయిన మాతకు వందనాలు.

ఓం సత్యజ్ఞానాన్ద రూపాయై నమః : సత్యము, జ్ఞానము ఆనందము యీ మూడు కలిసిన స్వరూపంగల తల్లికి వందనాలు.

ఓం సమారస్య పరాయణాయై నమః : సామరస్య బావంలో విశేషాసక్తికల

మాతకు, సమాగానరసమందు ప్రీతిగల మాతకు నమస్కారాలు.

ఓం కపర్దిన్యై నమః : కపర్ది అనగా శివుడు. శివపత్ని కావున కపర్దిని – అట్టి తల్లికి వందనాలు.

ఓం కళామాలాయై నమః : కళలనే మాలగా ధరించిన మాతకు ప్రణామాలు.

ఓం కామదుఘే నమః : కామధేను స్వరూపిణికి వందనాలు.

ఓం కామరూపిణ్యై నమః : మన్మథస్వరూపిణికి వందనాలు.

ఓం కళానిధ్యై నమః : కావ్యకళా స్వరూపిణి అయిన లలితాంబకు వందనాలు.

ఓం రసజ్ఞాయై నమః : సర్వరస పరిజ్ఞానం కల తల్లికి నమస్కారాలు.

ఓం రసశేవధయే నమః : వేదసామ్రాజ్యంగల రసమే ఆత్మగాగల దేవికి నమోవాకాలు.

ఓం పుష్టాయై నమః : పష్ఠిరూపిణికి, పుష్టిప్రదాయినియైన మాతకు ప్రణామాలు.

ఓం పురాతనాయై నమః : అత్యంత పురాతన స్వరూపిణికి ప్రణామాలు.

ఓం పూజ్యాయై నమః : పూజనీయురాలైన అమ్మకు వందనాలు.

ఓం పుష్కరాయై నమః : పుష్కరనామక దివ్యతీర్థ స్వరూపిణికి ప్రణామాలు.

ఓం పుష్కరేక్షణాయై నమః : విశాల పద్మసదృశ సుందర ప్రఫుల్ల నయనాలు కల మాతకు ప్రణామాలు.

ఓం పరంజ్యోతిషే నమః : పరంజ్యోతి స్వరూపిణికి వందనాలు.

ఓం పరస్మైధామ్నే నమః : పరంధామ స్వరూపిణికి వందనాలు.

ఓం పరమాణవే నమః : అత్యంత సూక్ష్మ స్వరూపమైనపరమాణు స్వరూపిణికి వందనాలు.

ఓం పరాత్పరాయై నమః : సమస్త దేవతలకన్న త్రిమూర్తులకన్న మిన్నయైన పరాత్పర స్వరూపిణికి వందనాలు.

ఓం పాశహస్తాయై నమః : పాశాన్ని ధరించిన మాతకు నమస్కారాలు.

ఓం పాశహన్త్ర్యై నమః : అఖండనీయ సంసార పాశాలను పశుపాశాలను, బంధనాలను ఖండించి విముక్తిని ప్రసాదించునట్టి తల్లికి వందనాలు.

ఓం పరమంత్ర విభేదిన్యై నమః : శత్రువలచే ప్రయోగింపబడిన మంత్ర ప్రయోగాతులను భేదించి తన భక్తులను రక్షించునట్టి మాతకు వందనాలు.

ఓం మూర్తాయై నమః : మూర్త స్వరూపిణికి వందనాలు.

ఓం అమూర్తాయై నమః : రూపరహితంగా భాసిల్లునట్టి అమూర్తకు వందనాలు.

ఓం అనిత్యతృప్తాయై నమః : అనిత్యమైన తృప్తిగల దేవికి వందనాలు.

ఓం మునిమానస హంసికాయై నమః : మునుల మనస్సరోవరాలలో విహరించునట్టి హంసినీ రూపిణికి వందనాలు.

ఓం సత్యవ్రతాయై నమః : సత్య సంభాషణమే వ్రతంగా గల మాతకు ప్రణతులు.

ఓం సత్యరూపాయై నమః : సత్యమే స్వరూపంగా గల మాతకు వందనాలు.

ఓం సర్వాన్తర్యామిన్యై నమః : సర్వేసర్వత్రా వ్యాపించి భాసిల్లు లలితాంబకు వందనాలు.

ఓం సత్యై నమః : సతీత్వ స్వరూపిణికి పతివ్రతా పవిత్ర రూపిణికి నమోవాకాలు.

ఓం బ్రహ్మాణ్యై నమః : బ్రహ్మాణీ శక్తి స్వరూపిణికి వందనాలు.

ఓం బ్రహ్మజనన్యై నమః : బ్రహ్మనామక దేవతామూర్తికి జనని అయిన తల్లికి వందనాలు.

ఓం బహురూపాయై నమః : అనేక రూపాలుగల మాతకు వందనాలు.

ఓం బుధార్చితాయై నమః : పండితులచే, దేవతలచే ఆరాధించబడునట్టి మాతకు నమస్కారాలు.

ఓం ప్రసవిత్ర్యై నమః : సర్వమునూ సృష్టించునట్టి తల్లికి వందనాలు.

ఓం ప్రచండాయై నమః : తీవ్రక్రోధ స్వరూపిణికి వందనాలు.

ఓం ఆజ్ఞాయై నమః : సర్వులను ఆజ్ఞాపించగల శక్తి స్వరూపిణికి వందనాలు.

ఓం ప్రతిష్ఠాయై నమః : విశ్వ విఖ్యాత మహత్తర ప్రతిష్ఠకల మాతకు వంధనాలు.

ఓం ప్రకటాకృతయే నమః : ప్రకటితమగు ఆకృతిగల జననికి నమస్కారాలు.

ఓం ప్రాణేశ్వర్యై నమః : ప్రాణశక్తికి – ప్రాణాలను శాసించునట్టి ఈశ్వరికి ప్రణతులు.

ఓం ప్రాణధాత్ర్యై నమః : సమస్త విశ్వాలకూ ప్రాణశక్తిని ప్రసాదించునట్టి తల్లికి నమోవాకాలు.

ఓం పంచాశత్పీఠ రూపిణ్యై నమః : పంచాశత్ (ఏబది) పీఠాలనూ అధిష్ఠించినట్టిపీఠ స్వరూపిణియైన మహాశక్తికికి వందనాలు.

ఓం శృంఖలాయై నమః : ఏ విధమైన బంధనాలూ, విఘ్నాలూ లేనట్టి స్వేచ్ఛామయ స్వరూపిణికి వందనాలు.

ఓం వివిక్తస్థాయై నమః : నిర్జనదేశంలో పవిత్ర ఏకాంత స్థానంలో తేజరిల్లునట్టి జగజ్జననికి వందనాలు.

ఓం వీరమాతాయై నమః : వీరమూర్తులను కన్న జననికి ముఖ్యంగా విశేషార్థంలో వీరులంటే ఉపాసకులని అర్థమున్నది. వీరుడంటే గణాధిపతి అయిన వినాయకుడని ఉంది. గణనాథాంబ అయిన పరమేశ్వరికి అంజలులు.

ఓం వియత్ప్రసవే నమః : ఆకాశాన్ని సృజించిన మహత్తర శక్తి స్వరూపిణికి ప్రణామాలు.

ఓం ముకున్దాయై నమః : ముకుంద స్వరూపిణికి అంటే కృష్ణ స్వరూపిణికి వందనాలు.

ఓం ముక్తి నిలయాయై నమః : ముక్తికి ఆధారస్థానమైనట్టి ముక్తి స్వరూపిణియైనట్టి మాతకు ప్రణతులు.

ఓం మూలవిగ్రహ రూపిణ్యై నమః : దేవతలందరికీ మూలవిగ్రహ స్వరూపిణియైన ఆది పరాశక్తికి వందనాలు.

ఓం భావజ్ఞాయై నమః : బావసర్వస్వాన్నీ గ్రహించునట్టి తెలిసికొనునట్టి భావజ్ఞ మూర్తికి ప్రణతులు.

ఓం భవరోగఘ్న్యై నమః : భవరూప అంటే సంసార రూపమునగా జనన మరణ రూపమయిన మహారోగాని నాశనం చేయునట్టి కరుణామయ మూర్తికి ప్రణతులు.

ఓం భవచక్ర ప్రవర్తిన్యై నమః : మహాసంసార రూపచక్రాన్ని ప్రవర్తింపజేయునట్టి తల్లికి వందనాలు.

ఓం ఛందస్సారాయై నమః : సమస్తమైన ఛందస్సుల యొక్కయు సారస్వరూపిణియై భాసిల్లు మాతకు వందనాలు.

ఓం శాస్త్రసారయై నమః : శాసించునట్టిది శస్త్రవత్ ఖండించి చెప్పునది శాస్త్రము. అట్టి సర్వశాస్త్రాల స్వరూపిణియైన జ్ఞాన స్వరూపిణికి ప్రణతులు.

ఓం మన్త్రసారాయై నమః : సర్వమన్త్రసార స్వరూపిణియైన శ్రీ రాజరాజేశ్వరీ దేవికి వందనాలు.

ఓం తలోదర్యై నమః : కృశోదరియైన జననికి వందనాలు.

ఓం ఉదారకీర్తయై నమః : ఔదార్యాన్ని చూపడమే నైసర్గిక లక్షణంగా గల ఉదారకీర్తి స్వరూపిణికి ప్రణతులు.

ఓం ఉద్దామ వైభవాయై నమః : అఖండమై, అపారమైన కొలతకు అందని వైభవం కల మాతకు ప్రణతులు.

ఓం వర్ణరూపిణ్యై నమః : సర్వవర్ణ స్వరూపిణియైన దేవికి నమస్కారాలు.

ఓం జన్మమృత్యుజరాతప్తజన విశ్రాన్తిదాయిన్యై నమః : జనన, జర, మరణాదులచే తపింపబడి వేదనచెందు భక్తజనులకు విశ్రాంతిని ప్రసాదించునట్టి మాతకు ప్రణతులు.

ఓం సర్వోపనిషదుద్ఘుష్టాయై నమః : సర్వోపనిషత్తులచే తెలియజేయబడు మహత్తర శక్తిగల మాతకు వందనాలు.

ఓం శాన్త్యతీత కళాత్మికాయై నమః : ద్వైతభావాన్ని దూరంచేయునట్టి శాంత్యతీత కళాస్వరూపిణికి అంటే మహత్తర శాంత మూర్తికి, శాంతి ప్రదాత్రికి ప్రణతులు.

ఓం గంభీరాయై నమః : గాంభీర్యమూర్తికి, అందు దొరకని గంభీరశక్తి స్వరూపిణికి వందనాలు.

ఓం గగనాంతస్థాయై నమః : గగనాంతరాళంలో భాసిల్లు గగనమూర్తికి, గగన విహారిణికి గగనంలో భాసిల్లు మాతకు వందనాలు.

ఓం గర్వితాయై నమః : విశ్వాన్ని సృజించునట్టి పరహంతకు గర్వమని పేరు. అట్టి స్వరూపాన్ని ధరించిన మాతకు ప్రణామాలు.

ఓం గానలోలుపాయై నమః : గానమందు విశేషాసక్తిగల మాతకు ప్రణతులు.

ఓం కల్పనారహితాయై నమః : కల్పనలేని మాతకు ప్రణతులు.

ఓం కాష్ఠాయై నమః : కాల ప్రమాణాన్ని కొలుచువాటిలో కాష్టమొకటి. అట్టి కాష్ఠాస్వరూపిణికి ప్రణామాలు.

ఓం అకాన్తాయై నమః : అకాంతామూర్తికి నమస్కారాలు.

ఓం కాంతార్థ విగ్రహాయై నమః : అర్ధనారీశ్వరమూర్తికి నమోవాకాలు.

ఓం కార్యకారణ నిర్ముక్తాయై నమః : సర్వకార్య, కారణాలకు మూర్తియైన మాతకు వందనాలు.

ఓం కామకేళి తరంగితాయై నమః : కామకేళీతరంగిణీ రూపిణికి వందనాలు.

ఓం కనత్కనక తాటంకాయై నమః : భాసిల్లునట్టి సువర్ణ తాటంకాలు ధరించిన మాతకు వందనాలు.

ఓం లీలావిగ్రహధారిణ్యై నమః : లీలామాత్రంగా అనేక అవతారాలను ధరించునట్టి మాతకువందనాలు.

ఓం అజాయై నమః : పుట్టుకలేని ఆదిశక్తికి ప్రణతులు.

ఓం క్షయవినిర్ముక్తాయై నమః : నాశనమన్నదే లేని వినాశినికి వందనాలు.

ఓం ముగ్ధాయై నమః : ముగ్ధాసుందర స్వరూపిణియగు తల్లికి నమస్సులు.

ఓం క్షిప్రప్రసాదిన్యై నమః : అతిశీఘ్రంగా ప్రసన్నురాలగునట్టి మాతకు వందనాలు.

ఓం అంతర్ముఖ సమారాధ్యాయై నమః : అంతర్ముఖులైన వారిచే మాత్రమే చక్కగా ఆరాధించబడునట్టి మాతకు నమస్కారాలు.

ఓం బహిర్ముఖ సుదుర్లభాయై నమః : బాహ్య విషయ వాసనలలో చిక్కుకున్న వారికి లభించని మహాశక్తికి వందనాలు.

ఓం త్రయ్యై నమః : వేదత్రయ స్వరూపిణికి నమోవాకాలు.

ఓం త్రివర్గనిలయాయై నమః : ధర్మార్థకామాలనే త్రివర్గాలకూ నిలయస్థాన స్వరూపిణి అయిన మాతకు వందనాలు.

ఓం త్రిస్థాయై నమః : లోకాలు, దేవతలు, విద్యలు, అగ్నులు, జ్యోతిస్సులు, వర్గాలు, ధర్మాలు, గుణాలు, ఈ విధంగా త్రయాలన్నియు గల దేవికి వందనాలు.

ఓం త్రిపుర మాలిన్యై నమః : త్రిపుర మాలినీ నామకదేవతా స్వరూపిణికి నమస్కారాలు.

ఓం నిరామయాయై నమః : నిరామయమూర్తికి నమోవాకాలు.

ఓం నిరాలంబాయై నమః : ఏ విధమైన ఆలంబనమూ లేని మాతకు ప్రణతులు.

ఓం స్వాత్మారామాయై నమః : స్వాత్మయందే రమించు మాతకు ప్రణతులు.

ఓం సుధాసృతయై నమః : అమృతాన్ని స్రవింపజేయునట్టి అమృతమయ మూర్తికి ప్రణతులు.

ఓం సంసారపఙ్క నిర్మగ్న సముద్ధరణ పణ్డితాయై నమః : సంసారమనే బురదలోపడి చిక్కుకుపోయిన భక్తులను సముద్ధరించగల కరుణామయికి ప్రణతులు.

ఓం యజ్ఞప్రియాయై నమః : యాగములందు ప్రీతిగల మాతకు వందనాలు.

ఓం యజ్ఞకర్త్ర్యై నమః : యాగములను చేయించునట్టి తల్లికి వందనాలు.

ఓం యజమాన స్వరూపిణ్యై నమః : యజమాన స్వరూపిణికి నమస్కారాలు.

ఓం ధర్మాధారాయై నమః : ధర్మానికి ఆధారభూతురాలైన జననికి వందనాలు.

ఓం ధనాధ్యక్షాయై నమః : ధనాధ్యక్షుడైన కుబేర స్వరూపముగల మాతకు నమస్కారాలు.

ఓం ధనధాన్య వివర్ధిన్యై నమః : ధనధాన్యాలను వర్ధిల్లజేయునట్టి మాతకు ప్రణతులు.

ఓం విప్రప్రియాయై నమః : వేదశాస్త్రవేత్తలై సదాచార సంపన్నులైన, భక్తులైన విప్రులయందు ప్రేమభావం – అనుగ్రహభావంకల మాతకు నమస్కారాలు.

ఓం విప్రరూపాయై నమః : విప్ర స్వరూపిణికి నమస్కారాలు.

ఓం విశ్వభ్రమణ కారిణ్యై నమః : విశ్వభ్రమణానికి కారణమూర్తి అయిన దేవికి వందనాలు.

ఓం విశ్వగ్రాసాయై నమః : యావద్విస్వాన్నీ గ్రాసంగాచేసికొనునట్టి కబలించునట్టి శక్తికి వందనాలు.

ఓం విద్రుమాభాయై నమః : పగడంవలె ఎర్రని కాంతులతో తేజరిల్లు మాతకు నమస్కారాలు.

ఓం వైష్ణవ్యై నమః : వైష్ణవిశక్తికి వందనాలు.

ఓం విష్ణుస్వరూపిణ్యై నమః : విష్ణుస్వరూపాన్నికూడా ధరించిన మాతకు ప్రణతులు.

ఓం అయోన్యై నమః : యోని రహితురాలగు శక్తికి వందనాలు.

ఓం యోనినిలయాయై నమః : శ్రీ చక్రంలోని త్రికోణాంతర్గత బిందుస్థానమే నిలయంగాగల మాతకు వందనాలు.

ఓం కూటస్థాయై నమః : కూటశబ్దానికి – అజ్ఞానార్థమున్నది. అట్టి అజ్ఞానానికి స్థానంగా గల మాతకు వందనాలు.

ఓం కులరూపిణ్యై నమః : బాహ్యపూజ – వంశాచారాదులకు కులమని పేరు. అట్టి కులస్వరూపిణికి వందనాలు.

ఓం వీరగోష్ఠీ ప్రియాయై నమః : వీరులకు సంబంధించిన గోష్ఠులయందు అభిరుచిగల అంబకు వందనాలు.

ఓం వీరాయై నమః : వీరమూర్తికి నమస్కారాలు.

ఓం నైష్కర్మ్యాయై నమః : కర్మరహితకు వందనాలు.

ఓం నాదరూపిణ్యై నమః : నాద స్వరూపిణికి నమోవాకాలు.

ఓం విజ్ఞానకలనాయై నమః : విద్యలయందు విశేషాదరణకల మాతకు వందనాలు.

ఓం కల్యాయై నమః : సృజనశక్తి స్వరూపిణికి ప్రణతులు.

ఓం విదగ్ధాయై నమః : చాతుర్యమూర్తికి వందనాలు.

ఓం బైందవాసనాయై నమః : బిందువే ఆసనంగా గల మాతకు ప్రణతులు.

ఓం తత్త్వాధికాయై నమః : సర్వతత్త్వాల కన్న అతీతురాలగు మాతకు ప్రణతులు.

ఓం తత్త్వమార్థ స్వూరపిణ్యై నమః : తత్త్వమర్థస్వరూపిణికి వందనాలు.

ఓం సామగాన ప్రియాయై నమః : సామగానమునందు విశేష ప్రీతిగల మాతకు నమస్కారాలు.

ఓం సౌమ్యాయై నమః : సౌమ్యశాంత స్వరూపిణికి వందనాలు.

ఓం సదాశివకుటుంబిన్యై నమః : సదాశివుని పత్నికి వందనాలు.

ఓం సవ్యాపసవ్య మార్గస్థాయై నమః : సవ్యమార్గంలోను, అపసవ్య మార్గంలోనూ కూడా భాసిల్లునట్టి మాతకు వందనాలు.

ఓం సర్వాపద్వినివారిణ్యై నమః : సమస్తమైన ఆపదలను నివారించునట్టి మాతకు వందనాలు.

ఓం స్వస్థాయై నమః : స్వస్థానంలో భాసిల్లు మాతకు వందనాలు.

ఓం స్వభావమధురాయై నమః : సహజంగా మధురమూర్తియైన మాతకు వందనాలు.

ఓం ధీరాయై నమః : ధైర్య స్వరూపిణికి ప్రణామాలు.

ఓం ధీర సమర్చితాయై నమః : ధీరులచే చక్కగా పూజింపబడునట్టి మాతకు నమస్కారాలు.

ఓం చైతన్యార్ఘ్య సమారాధ్యాయై నమః : ఆత్మజ్ఞానం ద్వారా ఆరాధించబడునట్టి మాతకు వందనాలు.

ఓం చైతన్య కుసుమప్రియాయై నమః : మహత్తర ఫలాలను ప్రసాదించునట్టి

చైతన్య కుసుమము నందు ప్రీతిగల మాతకు నమస్కారాలు.

ఓం సదోదితాయై నమః : సదా సర్వదా ప్రకాశించునట్టి మాతకు ప్రణతులు.

ఓం సదాతుష్టాయై నమః : సదా సర్వదా తుష్టికలిగి ఉండునట్టి మాతకు వందనాలు.

ఓం తరుణాదిత్య పాటలాయై నమః : మధ్యాహ్న మార్తాండుని వంటి అరుణకాంతులతో భాసిల్లు మాతకు నమస్కారాలు.

ఓం దక్షిణాదక్షిణారాధ్యాయై నమః : దక్షిణ మార్గంలోను అదక్షిణ మార్గంద్వారానూ కూడా ఆరాధించబడునట్టి మాతకు ప్రణతులు.

ఓం దరస్మేర ముఖాంబుజాయై నమః : మందస్మితవదనారవిందంగల మాతకు ప్రణతులు.

ఓం కౌళినీ కేవలాయై నమః : ఏకైక కౌళినీ స్వరూపిణి అయిన మాతకు వందనాలు.

ఓం అనర్ఘ్యకైవల్యపదదాయిన్యై నమః : అనర్ఘమైన కైవల్య పదాన్ని ప్రసాదించు మాతకు వందనాలు.

ఓం స్తోత్రప్రియాయై నమః : పరమ పవిత్రమైన భగవత్ గుణగణవర్ణనాత్మకమైన స్తోత్రాలయందు ప్రీతికల మతాకు నమస్కారాలు.

ఓం స్తుమత్యై నమః : స్తుతిమతి స్వరూపిణికి వందనాలు.

ఓం శ్రుతిసంస్తు వైభవాయై నమః : వేదలాచే సంస్తుతింపబడిన మహత్తర వైభవంకల మాతకు వందనాలు.

ఓం మనస్విన్యై నమః : స్వాధీనంలో ఉన్న మనస్సుగల మాతకు వందనాలు.

ఓం మానవత్యై నమః : మానవత్వం – కరుణ, దాతృత్వాది మహోత్తమ సద్గుణాలు కల తల్లికి వందనాలు.

ఓం మహేశ్యై నమః : మహేశుని అర్ధాంగి అయిన మహేశికి నమస్కారాలు.

ఓం మంగళాకృత్యై నమః : మంగళకరమైన ఆకారంకల మాతకు వందనాలు.

ఓం విశ్వమాత్రే నమః : అఖిల విశ్వాలకు జననియైన లలితాదేవికి వందనాలు.

ఓం జగద్ధాత్ర్యై నమః : ధాత్రీరూపంలో సర్వప్రాణులను పోషించు తల్లికి నమస్కారాలు.

ఓం విశాలాక్ష్యై నమః : విశాలమైన సుందర నయనాలు కల మాతకు నమస్కారాలు.

ఓం విరాగిణ్యై నమః : వైరాగ్య భావం కల తల్లికి ప్రణతులు.

ఓం ప్రగల్భాయై నమః : మహత్తర చాతుర్యాన్ని సృష్టిస్థితి సంహారాలలో ప్రదర్శించగల మాతకు వందనాలు.

ఓం పరమోదారాయై నమః : ప్రాణికోటియందు, భక్త, జనులయందు విశేషమైన ఔదార్యాన్ని చూపు తల్లికి వందనాలు.

ఓం పరామోదాయై నమః : మహత్తరమైన ఆమోదం ఆనందం ప్రసాదించగల మాతకు వందనాలు.

ఓం మనోమయ్యై నమః : మనోమయరూపిణికి నమోవాకాలు.

ఓం వ్యోమకేశ్యై నమః : అంబర పర్యంతం వ్యాపించిన పాశం కలది అంబరమే పాశంగాగల విరాడ్రూపిణికి నమోవాకాలు.

ఓం విమానస్థాయై నమః : దివ్య విమాన విరాజమానయై విహరించు తల్లికి ప్రణతులు.

ఓం వజ్రిణ్యై నమః : వజ్రహస్తుడైన ఇంద్రపత్నియైన శచీదేవి స్వరూపంలో స్వరూపంలో స్వర్గరాజ్యలక్ష్మియై భాసిల్లునట్టి వజ్రహస్తకు వందనాలు.

ఓం వామకేశ్వర్యై నమః : వామకేశ్వరుడనగా శివుడు. అట్టి సవిపత్నియైన దేవికి వందనాలు.

ఓం పంచయజ్ఞ ప్రియాయై నమః : అగ్నిహోత్ర దర్శపూర్ణమాస, చాతుర్మాస, పశుసోమాలు పంచయజ్ఞాలని పిలువబడతాయి. ఈ పంచ యజ్ఞాలయందు ప్రీతిగల మాతకు వందనాలు.

ఓం పంచ ప్రేతమంచాధి శాయిన్యై నమః : బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఈశ్వరులు – నాలుగు మంచంకోళ్ళుగాను, సదాశివుడు ఫలక స్థానంలో విరాజిల్లు నట్టి

మంచంమీద శయనించు మహేశ్వరికి వందనాలు.

ఓం పంచమ్యై నమః : పంచమీ తిథి దేవతా రూపిణికి ప్రణామాలు.

ఓం పంచభూతేశ్యై నమః : పంచమహాభూతాలకూ అధీశ్వరి అయిన మాతకు వందనాలు.

ఓం పచసంఖ్యోపచారిణ్యై నమః : ధూప, దీప పుష్ప, గంధ, నైవేద్యాలు ఇవి ఐదూ పంచోపచారాలు వీటిచే ఆరాధింపబడు మాతకు వందనాలు.

ఓం శాశ్వత్యై నమః : నిత్యమై, సత్యమై శాశ్వతంగా భాసిల్లు మహేశ్వరికి ప్రణామాలు.

ఓం శాశత్ర్యై నమః : నిత్యమై, స్తయమై శాశ్వతంగా భాసిల్లు మహేశ్వరికి ప్రణామాలు.

ఓం శాశ్వతైశ్వర్యాయై నమః : అఖండ అపారమై శాశ్వతమైన మహత్తరైశ్వర్యం కల మాతకు ప్రణామాలు.

ఓం శర్మదాయై నమః : సుఖ, సంతోషాదులను ప్రసాదించు తల్లికి వందనాలు.

ఓం శంభుమోహిన్యై నమః : వైరాగ్యమూర్తి, వైరాగ్యోపదేశకుడూ అయిన శంకరుని కూడ మోహంలో ముంచవేసన మహత్తర సౌందర్య లావణ్య మూర్తియైన మోహన మూర్తికి నమోవాకాలు.

ఓం ధరయై నమః : సర్వులనూ ధరించునట్టి భూస్వరూపిణికి ప్రణామాలు.

ఓం ధరసుతాయై నమః : ధరసుత అంటే భూసుత – అంటే సీతా స్వరూపిణియై తేజరిల్లిన అమ్మకు నమస్కారాలు.

ఓం ధన్యాయై నమః : ధన్యమూర్తియై, ధవళవర్జితయై ప్రకాశించు మాతకు వందనాలు.

ఓం ధర్మిణ్యై నమః : ధర్మ స్వరూపిణికి ప్రణామాలు.

ఓం ధర్మవర్ధిన్యై నమః : ధర్మాన్ని వర్ధిల్లజేయునట్టి మాతకు ప్రణామాలు.

ఓం లోకావతీతాయై నమః : నిఖిల లోకాలను అతిక్రమించిన లోకాతీత స్వరూపిణికి వందనాలు.

ఓం గుణాతీతాయై నమః : సమస్త గుణాలను అధిగమించిన అతీత లోకాతీత స్వరూపిణికి ప్రణామాలు.

ఓం సర్వాతీతాయై నమః : సర్వాన్ని మించినట్టి సర్వాతీత మూర్తికి ప్రణతులు.

ఓం సమాత్మికాయై నమః : శమాన్ని – శాంతిని కల్గించడమే ఆత్మ స్వరూపంగా సహజ లక్షణంగాగల జననికి ప్రణతులు.

ఓం బంధూక కుసుమ ప్రఖ్యాయై నమః : బంధూక పుష్పంతో సమానమైన కాంతితో భాసిల్లునట్టి మాతకు వందనాలు.

ఓం బాలాయై నమః : బాల స్వరూపిణియై భాసిల్లునట్టి తల్లికి వినయాంజలలు.

ఓం లీలా వినోదిన్యై నమః : లీలచేసి చూసి అందులో వినోదాన్ని పొందునటిట మాతకు నమస్కారాలు.

ఓం సుమంగళ్యై నమః : శుభకరమైన మంగళ స్వరూపిణికి వందనాలు.

ఓం సుఖకర్యై నమః : సుఖాలను చేయునట్టి ప్రసాదించునట్టి మాతృదేవతకు వందనాలు.

ఓం సువేషాఢ్యాయై నమః : సుందరమైన మనోహర వేషంగల తల్లికి వందనాలు.

ఓం సువాసిన్యై నమః : నిత్యసువాసినీ మూర్తియై భాసిల్లు మాతృమూర్తికి ప్రణతులు.

ఓం సువాసిన్యర్చన ప్రీతాయై నమః : సువాసినులు చేయు పూజకు ఆనందపడునటిట తల్లికి వందనాలు.

ఓం శోభనాయై నమః : శోభనాకారం కల సౌందర్యరాశియైన లలితామాతకు వందనాలు.

ఓం శుద్ధ మానసాయై నమః : విశుద్ధాంతరంగం కల శుద్ధ మనస్వినికి ప్రణతులు

ఓం బిందుతర్పణ సంతుష్టాయై నమః : బిందు శబ్దానికి గల అర్థాలలో జ్ఞానమని కూడా ఉంది. అట్టి జ్ఞానులు చేయునట్టి తర్పణాదులకు సంతుష్టి నందునట్టి దేవికి వందనాలు.

ఓం త్రిపురాంబికాయై నమః : త్రిపురసుందరీ మాతకు నమస్కారాలు.

ఓం దశముద్రా సమారాధ్యాయై నమః : దశ ముద్రలు ప్రదర్శించి తద్వారా చక్కగా ఆరాధించదగినట్టి మాతకు ప్రణతులు.

ఓం త్రిపురా శ్రీ వశంకర్యై నమః : త్రిపురా శ్రీ దేవతను వశమును చేసికొన్నట్టి, భక్తులకు వశము చేయునట్టి వశంకర మూర్తికి వందనాలు.

ఓం జ్ఞానముద్రాయై నమః : తర్జనీ అంగుష్ఠాలు రెంటినీ కలిపి ఉంచుటయే జ్ఞానముద్ర, అట్టి ముద్రకలిగిన మాతకు నమస్కారాలు.

ఓం జ్ఞానగమ్యాయై నమః : జ్ఞానం వల్ల పొందగలిగిన తల్లికి వందనాలు.

ఓం జ్ఞానజ్ఞేయ స్వరూపిణ్యై నమః : జ్ఞాన జ్ఞేయాలే తృక్‌దృశ్యాలే స్వరూపంగా గల మాతక వందనాలు.

ఓం యోనిముద్రాయై నమః : యోనిముద్రలో భాసిల్లు మాతకు వందనాలు.

ఓం త్రిఖండేశ్యై నమః : సోమసూర్యాగ్ని మంత్రఖండాలకు త్రిఖండాలని పేరు. వాటికి అధీశ్వరియై తేజరిల్లు మాతకు ప్రణతులు.

ఓం త్రిగుణాయై నమః : మూడు గుణాలుగల – త్రిగుణ స్వరూపిణికి నమస్కారాలు.

ఓం అంబాయై నమః : చరాచరమైన అఖిలాండకోటి బ్రహ్మాండాలకూ తల్లి అయిన అంబాస్వరూపిణికి వందనాలు.

ఓం త్రికోణగాయై నమః : మూలప్రకృతి రూపిణియై త్రికోణంలో భాసిల్లు మాతకు వందనాలు.

ఓం అనఘాయై నమః : పాపరహితకు వందనాలు.

ఓం అద్భుత చారిత్రాయై నమః : ఆశ్చర్యకరమై పరమ పావన చరిత్రగల మాతకు వందనాలు.

ఓం వాంఛితార్థ ప్రదాయిన్యై నమః : తనను సేవించువారి, ఆరాధించువారి కోర్కెలను నెరవేర్చునట్టి మాతకు నమస్కారాలు.

ఓం అభ్యాసాతిశయ జ్ఞాతయై నమః : అతిశయాభ్యాసం ద్వారా తెలిసికోదగిన దేవతకు వందనాలు.

చేయునపుడు విజృంభించి స్వైర విహారము గావించును.
దేవి సమస్త కోటిని స్వాధీనమునందుంచు కొన్నచో భక్తుల
వశవర్తినియై ముక్తిని ప్రసాదించును.
సకల లోకైక జననియు, సర్వభూతములకు
అనురాగవతినగు మాతా నమస్కారము.
భక్తులు సకల వాంఛితములు ప్రసాదించును.
భోగ ఐశ్వర్యములు ప్రసాదించును.
సర్వ ఐశ్వర్యములను ప్రసాదించు శ్రీచక్రాదిష్టయగు
లలితా మాతకు నమస్కారము.
గురుశిష్య సంబంధమైన ఉపాసింపబడు పంచాక్షరీ
మహావిద్యా యోగిని యగు లలిత మాతకు నమస్కరించుచున్నాను.
శ్రీమాత భక్తులకు అష్టసిద్ధులను ప్రసాదించును. సిద్ధస్వరూపిణి
సంపదలిచ్చు మాతకు నమస్కారము.
భక్తుల సమస్త వాంఛలను నెరవేర్చును. నిత్య
కల్యాణియై స్మరణ మాత్రముచేత ఉపాసకులకు మంగళమొనర్చు
ఉపాసకుని సర్వ వాంఛలు సిద్ధింపచేయును.
అమ్మా అన్నంతమాత్రాన సర్వ దుఃఖములనుండి విముక్తి చేయును.
జన్మక్రమమున భక్తుల మరణ ధర్మమును నశింపచేసి
ఉత్కృష్ట జన్మాంతరమున అమృత తత్వము
ప్రసాదించి లీనము చేసికొనును.
సర్వాంగ శోభితమై, సర్వ లక్షణ సంపన్నయై సౌందర్య
రాశియై ప్రకాశించు అమ్మా నమస్కారము
సర్వ శుభములును, సౌభాగ్యైశ్వర్యములను ప్రసాదించును.
సర్వవాంఛిత ప్రదాయిని, సర్వులచే ఆరాధింపబడు
శ్రీమాతా నమస్కారములు.
శ్రీ చక్రమందలిన నివారణ దేవతలందరు యోగినులన
బడుదురు. వారందరూ శ్రీమాత అంశలే. వారి అధిపతి
యైబిందు మధ్య స్వరూపిణి పరాశక్తియే కులయోగిని

దేవి త్రికాల జ్ఞాన రూపిణి. పరాశక్తి సృష్టి స్థితి లయములు
కలిగించు శక్తి స్వరూపిణి,
స్మరణ మాత్రాన బ్రహ్మజ్ఞానమును ప్రసాదించు
భక్తుల మానసిక, శారీరకాది వ్యాధులనుండి విముక్తి
గావించు అమ్మా నీకు నమస్కారములు
భక్తజనుల కానంద మొనర్చును. భక్తులను సర్వ
సంసార బంధములనుండి పాప కర్మలనుండి ముక్తిని ప్రసాదించును.
జీవకోటి కోరికలను నామస్మరణ మాత్రమున సిద్ధింప
చేయును. శ్రీ చక్ర రూపిణి భక్తుల రక్షించును.
దేవియోని కూట స్వరూపిణి, వశిని శక్తిరూపిణి,
భక్తవ శంకరియగు మాతకు నమస్సులు.
కాది విద్యాస్వరూపిణి, విగత జీవి మన్మథుని
బ్రతికించిన సంజీవిని కామేశసతి నీకు నమస్కారము.
దేవి స్మరణ మాత్రమున సంతుష్టురాలు.
మాతదశ సంస్కార రహిత శ్రీ విద్యారూపిణి, శుద్ధ
సత్త్వస్వరూపిణి దేవి ప్రొద్దున ఎఱుపురంగు చీర ధరించును
సర్వత్రజయమును పొందు సేనా సమన్విత
త్రిమూర్తి రూపిణీ పాలకురాలు
సచ్చితానంద నిర్గుణ స్వరూపిణి. పరాదేవత
శివుడు జగత్కారణమగు సుగుణ బ్రహ్మయే శక్తి
వీటి సమారస్య సూచకమగు కౌశిని రూపియగు మాతకు నమస్కారము.
సర్వరోగ బాధా నాశిని యగు మాత శ్రీ చక్రమందు బిందు
రూపవాసినియై యుండును.
శ్రీ చక్రాన వారణ దేవతలందరు శ్రీలలితాంశ వారే, వారికి అధిష్ఠాన దేవత
శ్రీ లలితా పరాశక్తి. చాపమును ఆయుధము, పాశధారిణి, అంకుశ ధారిణి,
కామేశుని సతి పరాశక్తికి నమస్కారము.
శుక్లపక్ష అతిథి తిధి, అధిష్టాన దేవత శ్రీదేవి
షడ్గుణైశ్వర్య పరమగు ఐశ్వర్యములను సూర్యమండల

పరమగు ద్వాదశాదిత్యులను మాలగా ధరించిన జగన్మాతకు నమస్సుల
దేవి ఉపాసకుల కోర్కెల తీర్చు శ్రీపంచాక్షరీ విద్యా
పూరకమగు శ్రీ చక్రమందు బిందువుగా నివశించును.
శ్రీమాత, శ్రీ చక్రాంతర్గత ఆవరణ దేవతలగు
అతిరహస్యయోగిని.
శక్తి రూపిణులగు నవారణ దేవతలచేతను, రాక్షస
సంహార రూపిణిలైన కాళిక, దుర్గా, చండి, ప్రచండి,
శక్తులచేతను సేవింపబడుచు వారిచే పరివేష్ఠింపబడి,
సింహాసనాధిష్ఠాత అయిన శ్రీ లలితా మహారాజ్ఞికి నమస్కారములు.
ఉపాసక భక్తజన రక్షిణి శ్రీచక్రాధినేత్రి
తమ తమ భేదములు, స్థిరలయములు లేనిదై వాటికి
కారణ భూతురాలై రహస్యముగాచరించు సాధారణముగా
దృగ్గోచరము గాని ఆ కారస్వరూపిణి జగన్మాత.
ఉపాస జనులకు ఆనందమొనర్చు శ్రీ చక్రాధినేత్రి
తమ తమ భేదములు స్థిర లయములు లేనిదై వాటికి
కారణ భూతురాలై, రహస్యముగా చరించుచు సాధారణ
ముగా దృగ్గోచరము గాని ఆకార స్వరూపిణి జగన్మాత.
త్రిపురార్త్యాది సృష్టికి పూర్వీకురాలు
స్థూలసూక్ష్మ కారణ దేహములను మూడుపురములకు
శ్రీమాత అధినేత్రి
త్రిపుర సుందరి త్రిమూర్తుల యందలి పరమ శివుని పత్నీ
త్రిపుర వాసిని శ్రీచక్ర కోణమందలి త్రికోమందు బిందు
రూపిణిగా నుండును.
శ్రీ లలిత సూర్య చంద్ర కైవల్య పదస్వరూపిణి
శ్రీ విద్యా పంచదశీమంత్ర, త్రికూటమునకు, శరీరత్రయ
మునకు, శరీరత్రయమునకు ఏలికయై త్రితత్త్వములను
మాలికగా ధరించినది.
త్రిపుర సిద్ధులు ప్రసాదించు దేవికి నమస్కారములు

ులు.

సృష్టి, స్థితి లయములకును, గుణతంత్రములకును
దేహత్రయములకును త్రిమూర్తులకును మాతృస్వరూపిణీ
మహేశుని శక్తి రూపిణియు బ్రహ్మాండముల నిర్మాణ
నిర్వహణ, నిర్మూల కారిణియగు జగజ్జననికి
అమ్మా నీకు నమస్కరించు చున్నాను.
శ్రీదేవి సృష్టి, స్థితి, కారణ భూతురాలు, జీవకోటికి
బ్రహ్మాండములకు అధిష్టాన దేవత
శ్రీమాత అనంత శక్తిస్వరూపిణి
మహాప్రళయకాలమందు సర్వ సృష్టికారణ
బీజములను మాత తనయందు నిబిడీకృతము
చేసికొనును. సర్వము భూత, భవిష్యత్
వర్తమాన సృష్టి పూర్వ రహస్యములు
తెలిసిన తల్లికి నమస్కారములు.
జగన్మాతా, సర్వమంగళదాయినీ, సర్వసౌందర్య వతి,
ఆనంద రూపిణి, మహోన్నత మహాకార్య భారాలు
మోసే నీ భుజస్కంధములకు అమ్మా నీకు నమస్కారము.
భక్త జనాశ్రయములను సిద్ధింపజేసి, దేవతలకు
కారణ రూపములగు, చక్రములందు, పరమేశ్వరీ
రూపమగు శ్రీ చక్రమనెడి నగరమునకు మహారాజ్ఞి
యగు జగన్మాతా అనేక కోట్లానేక వందనాలు.
పాదాభివందనాలు. హరిచందనాలు.



# చింతామణి ద్వీప
# మహా అతి రహస్య నాట్యాలు
# కృష్ణనీలిమ

ముమ్మారు నను కనిపెంచి పెద్ద చేసి విద్య భక్తులు నేర్పిన శ్రీమాన్ గూడా బాలం భొట్లు గారిమూలాన కూడా, ప్రేమ కుమారిగారికి నమస్కారములు. పవిత్ర గర్భమున పుట్టి దైవత్వము వారి వల్లనే అలవడింది. ఇహ విద్య – పరా విద్యకు తల్లిదండ్రులే బీజము నాట శ్రీ లలిత కృపతో ఈనాడు శ్రీ విద్య నేర్పింది.

అమ్మలగన్న అమ్మా నిన్ను ఏరీతి వర్ణింప శక్యమే శ్రీమాతా అని పిలువగనే గర్భ నరక బాధపోగొట్టు సంజీవినీ అమ్మా హృదయం ఉప్పొంగునే అఖిల చరాచరా జగత్తుకు అమ్మావు నీవే కదా. అమ్మా శ్రీ మహారాజ్ఞే మహావీర శౌర్య పరాక్రమ శృంగారరూపిణి స్వయం పరిపాలనా పదునాలుగు భువనేలు ఏలే తల్లి భువనేశ్వరి, అమ్మా వజ్రవైఢూర్య మాణిక్య ఖచిత సింహాసనీ లోకాల రక్షించు సింహినీ సర్వమంగళ స్వరూపిణి, చిదగ్ని కుండ సంభూత, సహస్రానేక సూర్యకాంతులతో, చతుర్భుజాలతో, పాశా అంకుశం విల్లు అంబుల ధరించిన ధీమణి, ఎఱ్ఱని రంగు తీవ్రమైన త్రిచూర్ణ రంగుల కాంతుల కలనేత చీరతో కలహంసిని. అమ్మ సిగలో అశోక పున్నాగ చంపక ఎఱ్ఱని పుష్పాలతో, సవాసనలతో రతనాల చింతామణితో, వ్యోమకేశికి చక్కని పద్మరాగ కిరీట ధారిణీ, లలాటమున కర్పూర చందన కుంకుమ అష్టమి చంద్ర బిబంబము సరివచ్చునా.

అమ్మా సౌందర్య రాశి జగన్మోహిని మోముకు విల్లు వలె వంగిన కనుబొమ్మల అవి దివ్య మంగళ తోరణములా! అమృత సరస్సులోని మీనములు గురుతు వచ్చేనమ్మా సువిశాల సోగకన్నుల వంపు సొంపులు, దీర్ఘమైన నాశిక నత్తు బేసరి ఆభరణాలు కుడివైపు సూర్యబింబ రతన సముద్ర, వామభాగాన చంద్రకాంతుల తళుకులు నాశికకు రతనాల నత్తు, పద్మరాగ వొంపులు తిరిగిన నీ మోహన చిరునగవు పెదవులకవి అందమా, ఏది దేనికి అందమే సౌందర్యాల నిధి, నాసికా ఆభరణాలు నక్షత్రాలు తిరస్కరింప ఒక వంక దర్పము, మరొకవంక నీ అందాల

సంకెళ్ళు నేత్రాల రెప్ప పడుటలేదు కర్ణాలకు పై కడిమి గుత్తి, కర్ణాలకు చంద్ర సూర్య ముద్రలు రతనాలు ఆభరణములు అమ్మను పైన నీ చెక్కిళ్ళలో కామేశు ప్రతిబింబము స్వచ్ఛ స్ఫటిక తెల్లని రూపు కానవచ్చెన్, పెదవుల ఒంపు కామేశు రూపము దర్పణములో చూసిన మరింత ఎఱుపు వంపుల కెంపుల పెదవులా, షోడాశాక్షరీ తళుకుల పలు వరుసతతో చిరునగవు కనీకనిపించని పలు వరసను పలురకాల పెదవుల చిరునగవు వర్ణించాలని పించు, సుగంధ తాంబూలము, నీ మృదుమధురాతి అధర సుధల వాక్కుకు సరస్వతి వీణకచ్ఛపి సిగ్గుతో తలవంచెనే, చుబుకపు అందాలకు సరిసాటేలేదు భువనాలలో ఇక్కడ భుజాల అమ్మ మంఘాది శాయిని మండపమునిగూఢము అగోచరము నీ కరుణ నీ ఆనతినే ప్రవేశింపగల వారము, బ్రహ్మవేద యుక్తపూజ, లక్ష్మీ సరస్వతీ వింజామర, రుద్రుడు మహాశక్తి అనేక వేలాది బాలరెల చిత్రాన్నాల సర్వ భక్ష్యముల బంగారు భాండాల మోయు శక్తులై, నీవే నిర్మితమైన కామేశుల క్రీకంట చూచి నిర్మితమైన మహాశక్తి విద్యుతతంగాల దివ్య తటాకము కేవము మీ కోరకే వినియోగింప బడునది, ఎంత గంభీరవో అంతమోహనాంగివే తల్లీ.

ముత్యాల ప్రాకారమున నీ మూల పరాశక్తి నుండే నిరాధార ముత్యాల ఊయ అయిదు హంసల ముతాయ్ల ఆసనమున అకస్మాత్తుగా ఆవిర్భవింప ఆత్మానందమే అమ్మ పరమానందమే, తెల్లని సున్నిత పట్టుచీరకు ఎఱ్ఱని వన్నె అంచుతో పగడాలు జాలువారు చీర కుచ్చెళ్ళు పమిట చెంగుకు, ఎఱ్ఱని అంచు రవికెకు, ముత్యాలు జాలు జాలువారగా, నీ నీల కురులకు ముత్యాల కిరీటం మద్యగా చంద్రవంక ఆకారమున, పాపిడి పిందినాలతో జాలువారు హంసముద్రిక వంకీలతో, ముత్యాల గాజులతో, మృదు హస్తాల ముత్యాల గాజుల, హంస పతకమురిడీ గొలుసులు, చిన్ని ముద్రలు ఉంగరాలు నీ వేలి గోరు రూపుకాంతులు, హంస పతకాల సందించిన జాలువారు ముత్యాల సరులకు మద్యగ చిరు చిరు కడిమి గుత్తులు, పాద పద్మాలకు హంసల పతాకాలు జాలువారే మంజీరముత్యాల సరుల మద్యగా చంపకాలు, కొంగ్రొత్త మట్టెల హంస ముద్రలు జాలువారే ముతాయ్ల వరుసలకు చంకలమర్చు హొయలు, కామేశు మణిమయ మాంగల్యము, చింతామణి పతః ముత్యాల సరుట, వయ్యారి జడవంపులకు చింతాశిరోమణి సుగుంధ పరిణః

మువ్వల మాలల, హంస ముత్యాల పతకాల ముత్యాల జాలరుల ఎట్టని జడగంటల. హొయల రాజసాన భుజకీర్తుల అటునిటు ఊగాడుచు అల శిరోభాగాన పాపిడి పిందినీలు ముత్యాలు వరుసల నుండి పాద మంజీర హొయలతో మా చింతామణి ఏలిక మహాసింహాని నేడ హంసల అలంకారముతో హల్లిహాలల ఆనంద నృత్యకేళీలో. గంధర్వ గానముతో, అష్టనాద సమ్మేళనలో సమ్మోహనింగిని ఏమని ఏమని వర్ణింతు భాషకే అందని అదమునకే అందము తెచ్చే నీ మేని హొయల అందాల అలల సోయగాల ఆస్వాదించి ఆనందించే నీ దాసులము. అమ్మ అనేక రతనాభరణాలు చింతామణి పతకమేలిమి దివ్య ముత్యాలు, నడుమనకు రతనాల జాలరుల వడ్డాణమునకు చిరు చిరు రవళుల మణులు, పాదమంజీరాల రతనాల ముద్రికలకు జాలరుల చిరుమువ్వల మణులు, మూర్తీభవించిను జగత్సమ్మోహిని, ఉత్తుంగ వక్షస్థలి నూగారు తీగ భాగము సన్నని నడుముకు కట్టిగా కట్టిన సన్నని మెత్తని ఎరుపు వస్త్రము ముమ్మారు కట్టినగాని నడుము కాన వచ్చుటలేదు, కామేశ్వరుడు అనెక పరతత్వాల చిహ్నాల మణుల మాంగల్యము కట్టిన కల్యాణ శోభకమనీయం రమణీయం, కామేశుడే చెప్పిన మృధువగునీ తొడ భాగము నుండి పిక్కల వరకు మోహన కటీ ప్రదేశము సర్వలోకాల నిక్షిప్తమా? మోపుగానుండే మంజీరాలకు ఐదువేళ్ళకు అటునిటు మట్టెలు జాలరులు మంజీరాలతో కలిపికట్టిన కామేశుని తీవ్రఅనురాగమోన నీ రూపునకే ముద్దు చేసే కొంగ్రొత్త మట్టెల మంజీరాలతో కలిపి పారాణి పాదాలే మరి మరి తలచి ఆనందడోలలో తేలెదను. మోపుగా కూర్మ పాదాల మధ్య చక్కని రతనాల ముద్రిక మణిమయ మట్టెల పాదాలకు శ్రీకామేశ బద్ధమాంగళ్య సూత్ర శోభిత కంధరకు కల్యాణ మంగళహారతులు.

భుజాలకు రతనాల ఆభరణ మయూర రతన జాలరుల కేసరుల రాజ చిహ్నాల, మృదువగు భుజాల రతనాల వంకీల మణి జాలరులు పదపల్లవంబులకు రతనాల గాజుల మురిణీ గొలుసులు చేతిపై భాగాన రతనాలు ముద్ర, సహజ ఎఱుపు నీ నఖకాంతులకు ఉంగరాలే అందవూ నీకు ఈ అలంకారాలే అందవూ? అలంకారములే అమ్మా సరిసాటిలేని అందాలు, వాలుజడకు రతనాలు పరతత్వ చిహ్నాలు ముద్రలు. కామేశుడు మాంగల్యము కట్టే సందర్భము రతనాల నవరతనాల పట్టుదారాల జడగంటలు హొయలలతో, నీ శంఖాకార మేడలో చింతామణి

పతక ముత్యాల జాలరుల అనేక ఆభరణాల కామేశు మాంగల్యము మరింత శోభలు తెచ్చెనే.

**1. చైత్ర పౌర్ణమి**

సీతారాముల కల్యాణం, ఆనందం కలకలలాడు అనేక ఆనంద అలంకారములు చేసే నాట్యం ఇది. అమ్మ శ్రీ లలత పద్మరాగాలనికే వస్తుంది. దివ్యాలంకారాలనేకంగా ఉంటాయి. మహాశిల్పులు మిథిలానగర జనక మహారాజు కొలువు కూటంలో భృగుమహర్షి దాకా కలయా నిజమా అన్నట్లు సజీవంగా చేస్తారు. రాజలాంఛనాలతో అమ్మ ఆరోజు ఎనిమిది తెల్లని ఎఱ్ఱని నీలవర్ణము గల విచిత్ర హరిణుల రథముపై సర్వాలంకార భూషితమై మహా కటక కిరీటకాంతులే చాలు అమ్మ చిటికెన వ్రేలు చాలు వేలాది సూర్య కాంతులుతో నిండిపోతుంది యుద్ధ సేనల ఆనందం కొరకై వస్తుంది.

సకల రాజ లాంఛనాలతో మేము కల్యాణ నాట్యము చేస్తాము ముహూర్తము ముందుగానము హరికథా నాట్యము భూలోకములో నాడు ఉండేవి కదా అయితే పదియోజనాల పొడవు పది యోజనాల వెడల్పుగల ఈ ప్రాకార పందిరి నీలాల పద్మరాగాల చంపక, తులసీ దళాలతో సీతారామ నామధేయాలతో ఇరువురు కల్యాణ మాలలతో అద్భుత అలంకారం ముత్యాలు తలంబ్రాలు నిజం చెప్పాలంటే ఆ రోజు శిల్పుల చాతుర్యంతో నిండిపోయిన వేదికపై మేము సీతా రామ కల్యాణం అభినయంచేస్తాము. అందు వీరాంజనేయునిగా వేయునది, హనుమా వేగ, వారికి రావణ, కుంభకర్ణ, ఇంద్రజిత్తు, రాక్షసవధ, తాటకి, మారీచ సుభాహువులు ఆంజనేయ ప్రతిభా రాక్షస శిక్షణతో కూడిన రామాయణం చూసి చాలా ఆనందిస్తారు. ఆ తల్లి మృధు మధుర హావ భావాలకు ఎవరికి తగినట్లు వారిని నియమిస్తుంది. ఇది అరువది నాలుగు ముద్రలతో కూడుకొన్నది. అమ్మ అందరిపై అంతరిక్షపూల వాన కురిపిస్తుంది. మధు పానీయాలతో ఆనందంగా ఉంటారు.

**2. వైశాఖపౌర్ణిమ**

శ్రీ లలిత అతిప్రీతికరమైన వైశాఖ పౌర్ణమి ఎందరో మహనీయులు ఉద్భవించిన వైశాఖమాసం అమ్మకు మిక్కిలి ప్రీతిపాత్రం మార్గశిర పౌర్ణమి పిమ్మట ఇదే, కదంబ

వృక్షాలతో చింతామణి ద్వీపం వేయిమండపాలు అలంకరించే రోజు, పారిజాతాలు, పుష్పగుచ్ఛాలు, పుష్పాభరణాలు పుష్పాలు బంగారు ఛాయలో అమృతం స్రవిస్తూ ఉన్నవి, పద్మరాగాలు, గోమేధిక, కెంపుల, వజ్ర వైఢూర్య, యింద్ర నీల, ముత్యాలు, మరకతాలు, ప్రవాళ, నవరత్న ప్రాకారం, చిత్ర విచిత్ర విజయ పతాకాలు, సూర్యచంద్రకాంతులతో మెరసిపోయే రత్నసోపానాలు, వేయిస్థంభాలతో విద్యుల్లతవలె మెరిసిపోతూ మంత్రులు శిల్పులు దివ్యాలంకారం చేస్తారు. రత్నసోపానునాదులలో సమయోచితంగా సర్వదేవతలు వారి వారి ఆసనాలలో ఆశీనులై ఉంటారు. శ్రీ లలిత ధరిస్తుంది శ్రీ లలంతికు పాపిడి పిందినీలు రతనాలు ముద్ర (సర్వ మంత్ర శక్తివి) ముత్యాలు వ్రేలాడుతూ ఉంటాయి. పదివేల దళాల కమలంలో శ్రీలలితా సహిత కామేశ్వరులు ఏకామ్రుదు ఆసనముపై ఆసీనులైన పిమ్మట నూగూరు తీగలుపై పద్మాలు హంసలు ఏర్పడతాయి. అమృత పక్షులలో హంస జాతిలో ప్రత్యేక ఉత్తమ చింతామణీ ద్వీపానికి వైశాఖ పౌర్ణమకు కోటానుకోట్ల మంత్రశక్తులతో సేవిస్తా మొక్కుకున్న సిద్ధులు. నాభి భాగాన మహా ఆగమాది వేదమృతధారలతో నిండి అవి అమ్మకు ఇష్టమైన ఎట్టిని రంగులో ఉంటాయి. నాడు మేము, సమస్త నాట్యాలు ప్రదర్శిస్తాము. తులసీ, బిల్వ పత్ర, రుద్రఫలకొమ్మల, ఉసిరి కొమ్మల, వేప మట్టి, మోదుగ, చూత పత్రాలు, అనేక దేవతా పత్రాలు, గుచ్ఛాలతో చేస్తాము. సౌగంధికా, అశోక, పున్నాగ, పారిజాత, చంపక పుష్పాలతో నాట్యం చేస్తాము. అనేక నక్షత్ర, పంచ, షోడశ, సప్త, నవ, దశకాల దీపాలతో నాట్యం బంగారు ప్రమిదెలలో చేస్తాము. నాగ, గరుఢ, కీర, హంస, మయూర, హరిణీ నాట్యాలు చేస్తాము. గంభీర రణరంగ నాట్యం చేస్తాము. అరువది నాలుగు అమర కళలు, సమస్త నాట్య ముఖ్య ముద్రలు వెయ్యినూలు పదహార చేసి పూర్తి అయ్యేటప్పటికి ఆ మహాఋషులు ప్రభావంత పద్మనీలాలు ముత్యాలు రతనాలు సమస్తం అత్యంత పద్మాలు అందు హంసల బారులుగా వారి పాద పద్మాల ఏర్పాడతాయి. సంపూర్ణంగా నాట్యం అయ్యేవరకు దేవతలకు ఎవరికి తెలియని చింతామణి ద్వీప రహస్యం.

మట్టెలు కామేశులే పెట్టు దివ్య ముగ్ధ మోహన ముద్దుమురిపాలకేమిలోటు సిరులకురిసే చింతామణిద్వీపంబును, కుంకుమ గంధము పసుపు పన్నీరు అనేక సుగంధ పరిమళాలు, దివ్య పూదండలు ఇరువురిచే మార్చించి మురిసిపోవు

మాధవుడు, సర్వ మహాపతివ్రతామ తల్లుల మాంగళ్య ఐశ్వర్య వంశీభివృద్ధి వరలక్ష్మి వరదేవత సుస్థిరమైన చోట అష్టలక్ష్మి ముద్రల నాట్యము చేసెదము.

### 3. జ్యేష్ట పౌర్ణమి

అష్టసిరులతో ఆయురారోగ్యములతో సర్వ కల్యాణ సుఖ సంతోష దాంపత్య జీవన సత్సాంతన, ధన, కనక, వస్తు వాహన సర్వ సుఖ సంతోషాలత వినయ విద్యలతో సుభిక్షంగా ఉండవలెనని చేయు నాట్యము. ముగ్ధమోహన మహేంద్రనీల మేని కొంతుల నీలాల ఉంగరాలు ముంగురులు ముద్దుమోముపై అల్లాలాడ వైఢూర్యపాపిడి పిందినీలు, అటునిటు సూర్యచంద్రులు, నిడుపాటి జడకు బంగారంతో వజ్రముద్రలు, నవరత్నాల జడగంటలు నవ్యాతి నవ్య శృంగార ప్రణయముద్రలజడ, జడ, జటాధారికే తెలియు, ఫాలభాగాన కస్తూరి సుగంధ పరిమళాలు, సువిశాల నేత్రాలకు కాటుక అందాలు కటి ప్రదేశ సూచికాలు, సుదీర్ఘనాశికకు నత్తు అడ్డబాస ముక్కుపుడక, పద్మరాగాల పెదవులు రెండు సన్నని ముద్దుపెదవులు మదనద్వారము స్ఫురించు మన్మదబాణవంగిని పెదవవిరుపులు విరహతాపంబుపెంచ పరమేశ్వరుడు అంగాంగశోభల వీక్షించు చుండె, కంఠము శివమాంగళ్య శోభల చూపి శోభనరాత్రులకు మంగళము పాడుచుండె మంగళ సూత్రాలు తెల్లని పలుచని వస్త్రము ఎట్టినిజరీ అంచు నవవధువు మదుపర్కంలా రత్నాలహారలు స్పష్టంగా కన్పిస్తున్నాయి, విలువలె వంగిన కనుబొమ్మలు, నీ కర్ణంబుల ఊగాడు తాటంక కమ్మల మహిమొనీలాంబరివిగాన కాలకూటవిషము నీ పాతివ్రత్యము వలన కాబోలు శుద్ధస్ఫటిక కోటి సూర్యకాంతులతో ఆజాను బాహుడు మూర్తిభవించిన పురుషాకబుతితో పరమేశ్వరుడు వసంతమాసం అనేక పుష్పరాజముల సుగంధాలతో మలమమారుతం కదన మదనరంగంముల ముద్రల మోహన మూర్తి భవించిన మోహ దేవదేవి శరత్ పూర్ణిమ చంద్రముఖి చంద్రకిరీటం పాపిటమధ్యగా మహోత్తుంగ వక్షస్థలి, సన్నని నడుము ఓపలకేకున్న రతనాల జాలరుల అతినాజుకుగా పంచరతనాలు మధ్య జారులు పంచాక్షరికి ఎట్టని పట్టువస్త్రముపై అలంకరించిరి, శివుని నేత్రాలు నిన్నే మరి మరి చూడరవిక తడిసి గజ వక్షోజకుచాలు క్రింది నాభిభాగం అలవోకవలె ఉన్న వంకీలు కూడా ప్రకృతిపురుషుల సమాగమాన్ని తొందరపెడుతున్నాయి. కదంబమాలల వంటి

కాళ్ళతో విశాలంగాపై భాగం పాదములకు మంజీరమణులు, సర్వాలంకారాలు ఓం హ్రీం అంటూ 'అ, ఉ' అనుశబ్దంతో మదనలోకానికి దారి తీస్తున్నట్లు పాదాల నఖకాంతులు దశమాణిక్యాలై 'మ' కారంవినవస్తున్నది, పారాణి పాదాలు నీలవర్ణం శ్వేత వర్ణం అనేక వింత రంగులతో కాలి అందెలరవళి, మిగాళ్ళుతాబేటి చిప్పలతో పోల్చ బడితే ఈశుడు పాదాలు సన్నికల్లుపై నుంచి మట్టెలు పెట్టిన మహాపురుషుడు మహేశుడు మహేశ్వరి ఒకరిలో ఒకరైమబ్బులే చుట్టూ ఎత్తయిన ప్రాకారాలు కాగా వేయేండ్లయినా తనివితీరనే లేదట జగదీశ్వరునికి, రతీమన్మథులైన విష్ణుమూర్తి మోహిని అవతారం అమ్మమోహనరూపం గుర్తు చేసుకొని ధరించిండట అందులకే మోహిన అవతారములో నీవు కానవచ్చుటవల్లనే శివుడు వశమయినాడు. శివపార్వతులే అక్షర సరస్వతియై వ్రాయించినారు.

### 4. గురు పౌర్ణిమ (ఆషాఢ పౌర్ణిమ)

గురుపౌర్ణిమ రోజున శ్రీ లలితా సహిత కామేశ్వరులు సర్వాభరణాలతో అగోచరమైన చింతామణి ద్వీపం మంచాది శాయినిగా దర్శనమిస్తుంది. త్రిమూర్తులు, ముక్కోటి దేవతలు సర్వులు గురుస్తుతి చేస్తారు. అమ్మ చిదగ్నినుండి ఉద్భవించిడం ఆ కటకిరీటం, కస్తూరి తిలకం, వ్యోమకేశి కిరీటం ఒక ప్రత్యేకమైన కేశముడితో సర్వమణి మయాలతో వజ్ర వైఢూర్యమణి ఖచిత కిరీటంలో సృష్టి అంతా నీలిమేఘ మండల వినీలకురులతో, విశ్వం వీక్షించే విశాల నేత్రాలతో ఎఱ్ఱని పట్టుచీరతో కామేశ్వరులు మహా తపః ఫల తేజస్సుతో ఇరువురి శక్తుల మేలుకలియకతో ఉంటారు. ఇరువురు రెండువేల హస్తాలతో చింతామణి ద్వీపవాసులు అరువది నాలుగు కోట్లమంది, సమస్త దేవతలు కిరీటం ధరించారు, ఎవరి వృత్తి ధర్మాలు వారు నిర్విఘ్నంగా సాగునట్లు సహస్రారముపై శ్రీ లలితా కామేశుల దృష్టి అంతర్గతం చేసుకొనే తపో సంపన్నులై సాధ్యమైనంత వరకు ఎవరి మటుకు వారు తీవ్ర తపోసాధనతో భక్తి వినయాలతో అమ్మ తమ తపో ఫలాలలను సమర్పించుకొని, మరల చేయవలసిన వృత్తి ధర్మాలను కేవల తేజస్సుతో భాష తెలుసుకుంటారు. శ్రీ లలిత సర్వ వివిధ రకములైన ఆభరణాలతో రెండువేల చేతులకు వివిధ రకములైన ఆయుధాలు ధరించి సర్వులకు దీవెనలిస్తుంది. ఆ ఆయుధాలు అనేక రకరకాల వృత్తులకు సంబంధించించినవి. వచ్చిన వారికి బట్టి

అప్పటికప్పుడు ఆయాశక్తులు ఉద్భవింపచేసి మహామకుటాయమానమై అనేక వేదమంత్ర చింతామణి దీపధర్మమునమసరించి నాలుగువేలమంది ఒక్కమారు వెడతారు. శ్రీలలితా కామేశులిరువులు ఘడియలో ఎనిమిదోవంతు వారిగా దీవిస్తారు. అందరికి దీవెనలిచ్చి ఆ రోజు గురుస్థాను మహానాట్యం జరుగుతుంది. ఎవిరిని ఏమని సందేశం ఇస్తుందో వారికే తెలుస్తుంది. ఎంత కోలాహలమైనావారికే, ఎవరికి వారికే తెలుస్తుంది.

## 5. శ్రావణపౌర్ణమి

శ్రావణపౌర్ణమినాడు ప్రవాళప్రాకరములో నాట్యము, అమ్మ శ్రావణలక్ష్మియై మహాతేజస్సుతో శ్రావణ మేఘాల నీలమహేంద్రదమణులకేమి అదృష్టమో శ్రీ మహావిష్ణువుని పోల్చు యోగము పట్టె సోదరికి సర్వాభరణములిచ్చును. ప్రత్యేకముద్రల నవ్యాతి నవ్యాలంకారమే శ్రీలలిత బ్రహ్మవిష్ణు మహేశ్వరుల దేవత లెల్లవచ్చి కానుకలర్పించ, మహారాజ్ఞి రాజ లాంఛనాల సగౌరముగా క్రీకంట శ్యామల వెంపు చూడ సర్వసిద్ధములై సిద్ధులకు యోగలుకు ఋషులకు సమయోచిత రీతి సర్వాధికానులందచేయుబడు, శ్రావణాన అమ్మ ఎఱ్ఱని పట్టుచీర రవికి ఆభరణములు ఒకే మాంగల్యంబు ఎప్పుడు మెరసిపోతుండును మహా పతివ్రతకు, వైష్ణవి అలంకారము వైరు ముడి కిరీటమునకు రతనాలు జాలువార, వైష్ణవ తిలకధారిణిగా అందాల బొమ్మ నిలువ తిలకపు తణుకుల నామము, నుదుటిపై కామేశు రూపముద్ర రతనాల పాపిడీ పిందినీలు, సువిశాల సోగకన్నుల సోగలు తీరిన కస్తూరీ గంథకాటుక పరిమళాలు, శ్రావణ మాస కాటుక జ్యోతుల కాటుక అందము అమ్మలోకనిపించు, తనసోదరీ ప్రవీణ విద్యాముద్రలు అంతటిదని చెప్పకనే చెప్పే ఆభరణరతనాలు కామేశుని కెఱుకయే, అమ్మహస్తాలకు చక్రవజ్ర శంఖముద్ర కంకణాలు, మురడీ గొలుసుల మధ్య "శ్రీ చక్ర ముద్ర" అమ్మ వేళకు దశముద్రలు అంగుళీయకములు (ఉంగరాలు, కంఠాన అనేక పరతత్వ చిహ్న రతనాల ఆభరణాలు, భుజకీర్తులకు సొంపైన రతనాల పుష్పాల శుక్రవార తొమ్మిది పోగుల కేసరులు చివరగానుండు చంపకాలు, నడుమున రతనాల మేఖలాలలతో నవరతనాల ముద్రల జాలరుల మధ్యగా చిరు చిరు మణులు, చింతామణి మధ్యగా, శిరోజాలకు మధ్యగా, రతనాల తొమ్మిది ముద్రల జడనాడు అమ్మదివ్యదేవతా

ముద్రలు రతనాల జడగంటలు వయ్యారముగా, నడుమునకు కూడ పసుపు కుంకాల మాంగాసిరి లక్ష్మి సంపద చిహ్నరతనాల జాలరుల వడ్డాణమే ఎఱ్ఱని చీర రవికెకు, వంకీలకు ఈ పతకము చుట్టూ సరస్వతీ బ్రహ్మ వేద దీవెనల నిబిడీకృతమై చేయునాట్యము, పారాణిపాదాలకు ఈ రీతి ప్రత్యేక శుభసుమంగళీ ముద్రలతో సర్వ భక్తులకు పసుపుకుంకుమ దివ్య మాంగల్యసిరి, లక్ష్మి ఐశ్వర్యము సర్వశుభముల దీవించు, వాస్తవము సింధూరసిరి మాంగల్య ఆభరణముకన్నా వేరేది లేదు.

### 6. భాద్రపదపౌర్ణమి

'భాద్రపద శుద్ధ చవితి మహాగణేశునకు' జయ విజయ నాదాల సర్వశాస్త్ర కోవిదుడు నక్షత్ర మండలమున గజవదనమున ఏర్పడిన నక్షత్రములు, అమ్మ తనయుని దీవించుటకు వచ్చును సర్వ శాస్త్రకోవిద సర్వ వేదానేక మంత్ర తంత్ర యంత్ర రీతుల శ్వేత పట్టుపంచె చింతామణి పతకము భండాసురుని సంహార వేళ ఆనందముగా నిచ్చిన కానుక, అంతియే కాక అనేక విధముల కానుకలిచ్చి దీవించి స్వయముగా తానేకుడుముల తినిపించి తన ప్రక్కగానే రతనాల ఛత్ర నవరత్న ఖచిత కిరిటిగా కూర్చుండ, అమ్మ రతనాల సింహాసనమున కూర్చొని మమతల, అనురాగాల అవ్యాజ కరుణామూర్తి, తీరమే లేని ప్రేమామృత సాగరము అమ్మకు ప్రత్యేక ఆభరణాల నిచ్చును పరాశక్తి కామేశునితో మంచాధి శాయినియై అచలగానుండి ఒకానొక అంశలో ఆవిర్భవించి అందరి యోగక్షేమములు స్వయముగా చూసుకొనును మేము విఘ్నరాజసర్వ పత్రపుష్ప భక్తి నాట్యాల కొలచి సేవించెదము. ఆ రోజు అమ్మయోగుల ధ్యానమునకు మెచ్చి వరాల నొసగును. మానవుల భక్తిశ్రద్ధల నిజ భక్తుల కందరికి వరములు ఎటువంటి విఘ్నములు లేక వరములిచ్చును. ఈ హల్లీ హాలస నాట్యము ఇరువది ఒక్క ముద్రలతో చేయుదుము.

### 7. ఆశ్వయుజ పౌర్ణమి (శరత్ పౌర్ణమి)

శ్రీ లలిత చంద్రమణుల కిరీటము అర్ధచంద్రాకారముగా 8 తరువాత పూర్ణచంద్రబింబముగా పైన వ్యోమకేశిగా ధరించి, లలాటపట్టిక అర్ధచంద్రా కారముగా మణులు వ్రేలాడుచు, వెనుక అర్ధచంద్రాకార చూడామణి, జడకు

నిలువెల్ల చంద్రమణుల అలంకారము చామంతిపూవు కూడా 9 అర్ధచంద్రాకారములు పూర్ణచంద్రునిగానగును.

ఎఱ్ఱని వస్త్రము అర్ధచంద్రాకార మణులు పొదగబడి పమిట చెంగుకి 108 చంద్రరేఖలు పూర్ణచంద్రునిగానగును. చెవులకు చంద్రాకారాభరణములు, మాటీలు వెనుక చూడామణికి అమరకిగా చంద్రాకార జాలరులు, నాసికకు అర్ధచంద్రాకారములనత్తు బేసరి అడ్డబాస ధరించి నాసికకు కుడి భాగానా చంద్రాకారా జాలరులు కర్ణాభరణములకు పొందికగా నుండును, వరుసుగా తొమ్మిది అర్ధచంద్రాకార పతక, అర్ధచంద్రాకార గొలుసుల హారాల, కంఠాన పూర్ణ చంద్రబింబము మణులు వ్రేలాడుతు, భుజకీర్తుల అర్ధచంద్రాకారములుగా రవికకు హారములకు బిగించి, చివరగా అర్ధచంద్రాకారమునకు పూర్ణచంద్రబింబము జాలరులు, వంకీలు ఐదు వరుసల అర్ధచంద్రాకారములు క్రిందుగా పూర్ణచంద్ర జాలరుల, కరముల రెండు అర్ధచంద్రాకారములు కలసి పూర్ణచంద్రకంకణాలు, వేళ్ళకు అర్ధచంద్రాకార ఉంగరాలు, అర్ధచంద్రాకార గొలుసులు మధ్యగా చేయిపై పూర్ణచంద్ర బింబము చంద్రజాలరులతో కంకణములకు అమర్చబడియుండును.

మొలనూలు మధ్యగా పూర్ణచంద్ర బింబము అర్ధ చంద్రాకార ముద్రలు జాలరులతో నుండును. పాదములకు అర్ధచంద్రాకార మట్టెలు పాదము మధ్య పూర్ణచంద్రబిబంబము, అర్ధచంద్రాకార జాలరుల మంజీరాలు మణులతో సమ్మోహన రూపముగా కోట్లాది చంద్రకాంతులతో నవరాత్రిబడలిక తీరి పోవునట్లు అమ్మ రూపము సౌందర్యమునకే సౌందర్యము, మోహము ఆనందము దివ్య నిశ్చేష్టతతో ఆనందపరవశము అది పరానంద "పరవశము".

విజయదశమి వజయోత్సవాలు శరత్ పౌర్ణిమ. శ్రీ లలిత శృంగార చింతామణి మండపాన జరుగును.

1. కుమారి - దుఃఖ దారిద్ర్య నాశనము ఆయుస్సు, ధనవృద్ధి
2. త్రిమూర్తి - రోగనాశని
3. రోహిణి - సకల కామ ప్రదాయిని
4. కల్యాణి - శత్రునాశనము
6. చండిక - ఐశ్వర్య, ధనకామ, భక్తి

7. శాంభవి - శోక దారిద్ర్యనాశనము, సమర విజయము
రాజ సమ్మోహనము

8. సుభద్ర - వాంచితార్థ సిద్ధి

9. విజయదశమి శాంభవి.

పరాశక్తి సాక్షిగా మొదలవుతుంది. ఆమె సర్వరత్నాలంకృతమైన దివ్య పరారత్నం భాండాలు చీర రవికె, చింతా కిరీటాగ్రమున, వంకీలు, మురిణీ గొలుసు ముద్రలు, హస్తాల గాజులు భుజకీర్తులు, రతనహారాల చింతామణిపతక మధ్య రతన భాండము మొదలు 9 ఆభరణాలు నడుమునకు వడ్డాణం తొమ్మిది భాండాలు, తొమ్మిది జాలరకు మధ్య తొమ్మిది మువ్వలు, కాలి మంజీరాలు తొమ్మిది, తొమ్మిది వరుసల జాలరుల మధ్య భాండాలు, పారాణి పాద పద్మాలు.

కుంకుమ కుంభాలు, పసుపు, సర్వ నివేదనలు, సర్వ వీణలు సరస్వతీ పూజ. వాయు, మేఘవీణ మేఘ కదలికల కదిలేది, చంద్రవీణ (హంసముద్ర) సరస్వతి కచ్ఛపి, నారద తుంబర వీణా నాదాలు, హనుమ, రావణ వీణ, కుంభవీణ వేద స్వరసామగాన వీణ. అమ్మ పరాశక్తిది పరతత్వార్థ సర్వ ఆగమవేద వేదాంగ రతనాల వీణ, అమ్మ మనస్సుతో సంకల్పించి వీణాలాపన చేస్తే, గణేశుడు కుమార స్వామి శివపార్వతులు నాగగణాలు అందరు నాట్యం చేసే మనోహర దృశ్యం.

సప్త మహర్షులు బ్రహ్మదేవుడు గణేశుడు నవ సువర్ణ కుంభాలతో నవార్ణవ పూజ సకల సర్వ శాస్త్ర పరావేద మంత్రాలతో పరాశక్తి సాక్షిగా చేస్తారు. అతి జాగరూకతగ, సమయస్ఫూర్తితో, సర్వకార్యాలు సమర్థవంతంగా, కుశాగ్ర చిత్తులై, అప్రమత్తతతో, అతి సూక్ష్మబుద్ధి శాలురై వాయు మనో వేగాల కన్నా శీఘ్ర పరావేగంతో పరమ ఆనందోత్సవాల సాగే ఉత్సవము. ఈ నవరాత్రి సంబరాలలో అనేక దివ్య జ్యోతులై ముందు అనేక భంగిమల వలయాకారంలో నమస్కరించి అరువది నాలుగు ముద్రలతో అలా సాగే హల్లీ హాలస నాట్యం అతి మనోహరము దావహం జన్మజన్మల తపః ఫలము. ఈ ఆశ్వీయుజ మాసంలో ఆయుధ పూజలు జరుగుతాయి, వారి ఆయుధాలు పరాశక్తి వద్ద నుంచి తేజః స్వరూపులై అమ్మ వద్ద ఉంచి ఎవరి ఆయుధాల గురుతులు వారివే ఈ తొమ్మది రోజులలో పరాశక్తి మహోన్నత శక్తుల ప్రసాదిస్తుంది. సర్వలోకాల వారు ఈ విజయ దశమి వేడుక

ఆర్భాటంగా అక్కర్లేదు శక్త్యాను సారం భక్తి శ్రద్ధ ఆర్తి ఉన్నవాళ్ళకి వరాలిస్తుంది. దశమినాడు ఎవరి ఆయుధాల వారికి సమర్పించే వేళ విజయదశమినాడు.

విజయదశమినాడు అమ్మ నాలుగు సింహాలపై రతనాలరథంలో అత్యంత అద్భుత విజయోత్సవ దేవ దుంధుబులు మ్రోగగా శ్రీ లలితా సహిత కామేశ్వరునితో దర్శనమిస్తుంది. విజయ సువర్ణ పతాక గురుతులనేకాలతో అనేక పుష్ప పరిమళాలలతో అనంత కోలాహలమది, యోగులు, బ్రహ్మ విష్ణు మహేశ్వరులు సర్వ దేవతలు, బాలా త్రిపుర సుందరి అమ్మలోంచే ఆవిర్భవించి ఆనంద తాండవం,చేస్తుంది. ముక్కోటి దేవతలు ఎల్లరు వేయి స్థంభాల చింతామణి ద్వీపం అంతా మేలిమి బంగారముతో తొమ్మిది పోగులు జిగి బిగి కట్టి అల్లిక అమ్మకామేశులు అతి సూక్ష్మరూపంగా ఉంటారుగాన ఎల్లరు ఊరేగింపుగా ముక్తి జ్ఞాన ఏకాంత, శృంగార మండప విజయ నాట్యం 999 ముద్రలతో చేస్తాము. శ్రీ పరాశక్తి స్వయముగా ఆయుధాలు అన్నీ భువనాల వారికి స్వయముగా కానుకలు సమర్పిస్తూ పన్నెండు గురుమంత్రులు, సేనాధిపతుల ఆధ్వర్యంలో అంగరంగ వైభోగంగా జరిగే మహోత్సహ విజయ దశమి పండుగ. ఏడాదిలో విజయదశమి, కార్తీక మార్గశిరాల్లో కొలిస్తే మానవులు పొందలేనిదే లేదు అంటుంది అమ్మ. ఎవరు ఎంత చెప్పినా బుద్ధి అనేది సహస్రారంలో ఉండి సరిగా తోచనివ్వదు. చేసిన వారిదే యోగము. చేయని వారిదే నిర్భాగ్యము.

### 8. కార్తీక పౌర్ణమి

శివశివాని నాట్యహేల

అమ్మా శివాని తండ్రి శివ

తల్లిదండ్రులకు శివ శివానీలకు భక్తితో బిల్వ పత్రాల, రుద్రాక్షలు పూజించి, అమ్మకు పసుపుకుంకువుల పూలతో దివ్య వస్త్రంబు అనేక ఆభరణంబులిచ్చినట్లు. శివయ్యను (కామేశ రూపము) బిల్వరుద్ర విభూది అభిషేకాల ప్రీతునికి పంచామృతాది అనేక సుగంధ పరిమళాల అభిషేకించి చక్కని పట్టు పంచెను, అనేక ఆభరణంబులిచ్చినట్లుగాను, అమ్మకు శిరస్నానంబు చేసిన తర్వాత సాంబ్రాణితో అమ్మ కురుల చక్కగా ఆరబెట్టిన పిమ్మట, అలాగునే

ధ్యానంబులో అగుపించిరి, అమా శివానీ (శ్రీదేవి) ఎఱ్ఱని జలతారు చీరపై. శివలింగాలే అంచుగా పమిటికొంగుకు కోట్ల చిరులింగాలు వజ్రాలతో అమర్చి రవికె ఇరుంకల భుజములపై భుజాంగాలు, చేతులకు లింగాకార వంకీలు మణులు పొదగబడి చిరుమువ్వలధ్వని ఫాలభాగాన కస్తూరి తిలకము శివలింగాకారము, రవ్వల నత్తు బేసరి ముక్కు పుడక, కర్ణంబులకు శివలింగాకార తాటంకంబులు ధరించి, నాగాకారంబుల మాటీలు, సువిశాలనయనాలకు కస్తూరి కాటుక, శివమాంగళ్యము మరింత శోభలతో రత్నాకరుని పుత్రిక అనేక దివ్య వజ్ర వైఢూర్యకెంపుల హారాలు, వక్షస్థలి బరువునకు అమర్చిరి. అమ్మ కరములకు నవరత్నరాగాల గాజులు, అమ్మ హస్తపద్మములకు మురుడీగొలుసులు ఈశ్వర రూపఉంగరాలు అమ్మ చేతులకు మధ్య చంద్రవంక నక్షత్రముద్రలు, అమ్మ ముద్దు అదరాల ఎరుపుదనమునకు, గోరింటాకు ఎరుపు మరీ అందముగా అమర్చిరి చెలులు. అందాల వడ్డాణముతో శివలింగాకార రతనాల వజ్రాల తళుకులతో పతి అన్న ఎంతటి అంతే పట్టని అనురాగమైనా అంతటి శివరూప చిహ్నంబులే, ఇక జటాధారికి ఇంపైన వాలు జడ వయ్యార శోభలు జడకు మధ్యగా శివలింగరతనాలు పొందికగా అమర్చిచూడామణిలో ఈశ్వరుని సుందరేశ్వరుని ప్రతిమ చూడామణి పెట్టిరి చెలులు, దివ్యసుగంధ పరిమళాల పుష్పాలు పెట్టిరి పాపిట మధ్యగా నెలవంక కిరీటము శివలింగ పాపిట పిందినీలు చంద్రముఖికి చక్కగా అమర్చిరి, సూర్య చంద్రుల అటునిటు శిరోజాలమధ్య అమర్చిరి. పాదాల పారాణి పెట్టిరి మణిమయ మట్టెలకు అందంబుగా మంజీరంబులు బిల్వపత్ర రతనాల మంజీరాలు, చిరుమువ్వలు రుద్రాక్షల మణుల జాలరులతో నిలువెల్ల జఘనభాగమున పృథ్వీమండలమంతా, దాచెనా అమ్మ గజ చర్మ దారికి గజకుంభస్థలి పోలుపయోధరాలతో పరమేశుని మోహావేశుని చేసెనా, పరమేశుడు అమ్మకిష్టమైన రీతి కవచకుండలాలు రతనాల కదలాడ, జటాఝూటంబునకు వజ్రకిరీటము అర్ధనారీస్వరూప చిహ్నము, శ్వేతవర్ణపట్టు పంచెతో నిలువెల్ల నాగాభరణముతో రతనాల ముత్యాల హారాల బంగారు అందెలతో దివ్య తేజోమయుడు మంద హాసమూ మోహమూ పరవశమూ శృంగారమూ, మదనకేళీ అభినయనీయనమా ఎంతటి దానా ఆదిదంపతుల శృంగారలీలలకు శివలింగాకారములే సాక్ష్యంబులు. శివపార్వతులే వ్రాయించిరి.

శంభోమహాదేవ, శంభోమహాదేవ, మహాదేవ, గంగాధరా దిగ్విజయా, వందారు శారిప్రియా, సామగానప్రియా, సోమేశ్వరా రాకేన్దుకోట్లాది ప్రభా మహాదివ్య తాండవ నటరాజేశ్వరా, నూట ఎనిమిది తాండవ రీతుల అసమాన ప్రతిభా, భవాయ కళాకదంబ మంజీర రసప్రవాహ మాధురీ ఢమఢమ మంగళ ప్రణయ తాండవ నాట్యదేవాధిదేవా నమశ్శివాయ నీలాంబరీప్రియ సహిత నాట్యప్రియ, మహావిశ్వ సమ్మోహినీ, శివనామ భాగనిలయా ఢమరుక మృదంగ వీణావేణు సామ గానప్రియ అర్ధనారీశ్వర తాండవ దక్షిణ భాగ పాదమునకు బంగారు నవరత్న అందె, వామభాగాన మరకత, గోమేధిక మంజీర పాద పద్మం, సువిశాల నడుమునకు పులి చర్మంబు, అటు తెల్లని జలతారు ఎర్రని అంచు చీర బిగించి వెల లేని దివ్యరత్నంబులు వ్రేలాడుచు మువ్వల రవ్వల వడ్డాణము, ఢమురకముతో, ఇరుబాహులకు నాగాభరణములు, ఇటు రవ్వల మువ్వల కెంపుల వంకీలతో వజ్రవైఢూర్యగాజులు, మరకత గోమేధిక మువ్వల మణుల మురిడి గొలుసులు, ఇటు సువిశాల వక్షస్థలుడు ముత్యాల మేలిమిరతనాల పతకముతో ఈశుడు, అమ్మ ఉత్తుంగ వక్షస్థలిపై మహేంద్ర నీలి రతన మాంగల్యంబుతో, అనేక వజ్రవైఢూర్య పుష్యరాగ హేమరత్న ఖచిత హారాలు, శివయ్య స్ఫటిక నాగేంద్ర కుండలాలు, ఇటు అమ్మ, నాగేంద్ర ప్రవాల మరకతగోమేధిక కర్ణాభరణాలు, మరకత గోమేధిక మాటీలు, ఈశుడు ఎగుభుజకీర్తితో, నీలకంఠుడు మహాదివ్య రత్నంబు కంఠమున ధరించె, శంకాకార కంఠుడు గంభీర నేత్రముతో ఇటు, కస్తూరి తలకపు తళుకుల, కాటుక సోగకన్నుల సొగసుల ఒంపు సొంపుల సహస్రాధికమై, ఈశుడు దీర్ఘమైన నాశిక, ఎఱ్ఱని పెవుల ఒప్పుచున్నాడు, విశాల ఫాల భాగాన విభూది రేఖల చందన సహిత కుంకుమ, అమ్మ సుదీర్ఘ కుంతలములకు రతనాల మువ్వల చిరు మణుల పంచజడగంటల, అశోక చంపక పున్నాగ దివ్య సుగంధ పత్రాల సహిత సుమమాలలు, ఓంకార చింతామణి, రతనాలు పాపిడి పిందినీలు, ఢమరుక పతకమునకు మువ్వల ముత్యాలు, ఇరుప్రక్క కమల, కలువ రతనాలు ముద్రలు, జటా ఝూటంబునకు చంద్ర కిరీటగంగముద్రిక గౌరికి ప్రీతకరమైన దివ్యరతన కటక కిరీటము, ఇవ్విధంబున అర్ధనారీశు నాట్యహేలలు, హారాలు, గజ్జెల గల గలలు, దివ్యముద్రలు ఒకప్రక్క పరమేశు ముద్రలు, మరొక ప్రక్క అంబిక ముద్రికలు, దివ్య సామగానమున, అనేక దివ్యమంగళ నాదాల, గంధర్వ గానాల,

నారద తుంబుర వీణా ధ్వనుల, నందీశుడు గజ్జెల ఘల్లుఘల్లు మన, అర్ధనారీశునాట్యం, నృత్యగీత తాళవాద్యకుంభవాద్య, బ్రహ్మతాళ భరతనాట్యము ఆనంద భరితముగా సాగెను.

ఈ నాట్యము ఆదిదంపతుల కృపతో వ్రాయించిరి.

ముల్లోకముల సమ్మోహితము చేసే శివశివానీ నాట్యమునే వ్రాయనా, ముగ్ధ మోహన లోకము ఎటు చూచిన వసంత ఋతువుల సోయగాలే దుర్భేద్యము అందు ప్రవేశింపనా రీతి సృష్టించె ఈశుడు, పచ్చిక బయళ్ళతో, అనేక పుష్పాలతోటలు, అమృత ఫలాలు దివ్యతటాకాలు, దివ్య సుగంధ పుష్పాలు, అనేక పక్షిజాతి కుహూ కుహూ నాదాల చిలుకల సైతము మదన కేళిలో అలసిన అది శృంగార భరితము, రామంచల రతిక్రీడా తటాకాల, ఈ రీతినున్న ఈశ మోహన రూపము కోట్లాది మన్మథ రూపము మూర్తీభవించినా పురుషాకృతి దివ్య తేజంబుతో దవళ వర్ణ తేజంబుల ప్రకాశించుచు, అమ్మను ఆలింగనమునుండి వీడడు, నీలాంబరిని పూర్తి మేలి ముత్యాల అలంకారమున అమ్మ అందాలు చూడసంకల్పింప, సర్వమేలిమి ముత్యాల ఆభరణాలు తెల్లని పట్టుచీర తెల్లని రవికకు పట్టు చీరకు కెంపుల అంచులతో, మంజీరాలు ముత్యాలు, ముత్యాల పాపిడి పిందినీలు సూర్యచంద్రుల, నిడుపాటి జడకు నాగువోలె చుట్టిన ముత్యాల జడగంటల ధ్వనితో, ముత్యాల కెంపుల కంకణాల రవళుల సర్వనాదములు వాయు ప్రభావమున అతి మోహన శృంగార రాగాల ఆలపించె, అనేకానేక శృంగార భంగిమలు, సౌందర్యలహరి సమ్మోహనాంగి అంగ అంగాల అతి రతి భంగిమల శివరేతస్సు నాట్యవేళ అమ్మ ముగ్ధమోహన రూపమునకు మోహితుడై, అమ్మ పానపట్టమై పట్ట అదియే శివలింగ స్వరూపమయ్యెను. అనేక తేజోలింగములు, శక్తి పీఠాలు మహాపూజ్యనాయాలు. అష్టదశ పీఠాలు వాస్తవమునకు శివపార్వతుల ప్రణయ చిహ్నంబులే, అన్యోన్య దాంపత్య సౌఖ్యమునకు, సత్సంతానమును ప్రసాదింప ప్రకృతి పురుషులు సంకల్పించిరి.

ఆదిదంపతులే వ్రాయించిరి.

## 9. మార్గశిర పౌర్ణిమ

శ్రీలలితే కృష్ణుడై రాధతో రసా అంగాంగ తీవ్రరసావేసనాట్యము కన్నా నీవే ముద్దు, నీవే రాధా ముద్దుమురిపాలు, ఆనందము, చక్కని శయ్య అమర్చె బృందావనికుంజము ఎంత మమతారా, చక్కని శయ్యనమర్చి, రాధమ్మకు ఇష్టమైన తినుబండారాల తీయని మోహాల హస్యాల ఛలోక్తుల ముగ్ధమనో హరి చుంబునాన తినిపించి, రాధా మాధుర్య ఫలమింకను తీయని చక్రవాక పక్షుల కరుణాస్వరము నీ కృష్ణుని విరహము వినిపింపలేదా, అని తలచె తరుణీ రత్నరాధకై రాధా ముగ్ధ మోహన దివ్య సౌందర్యరాశి వచ్చును. మోహావేశమున రాధ వచ్చె రాధమాధవ ప్రణయ లోకమే బెదురు చూపుల సిగ్గులొలుకు సన్నని నడుము భయమును ఆరాటమున నడచివచ్చె వక్షాలెగిసిపడె, మదన మనోహరి, శ్రీ కృష్ణ నీకు నీవె, రాధే, సర్వస్వమని ఆనందానుభూతిని తన సర్వస్వము నీకర్పించిన రాధమ్మ ఒక్కతే సుమా ధరిత్రి సర్వప్రకృతి, భూమ్యాకాశములు సర్వము తెలుపు రాధామాధవా ప్రణయ విరహ తీవ్ర అనురాగ రంజిత తత్వమే రాధామాధువులు ప్రవీణులైన సర్వఅప్సరసలు రతీమన్మధులు హల్లీహాలస నాట్యము అతికష్టతరము. కేవలం తీవ్ర ప్రావీణ్యంగలవారు చేస్తారు.

సంక్రాంతి నాట్యం మకర సంక్రమణం.

మకర సంక్రాంతి రోజున పరాశక్తి మహాదివ్య సూర్య ప్రభలతో సూర్య ముద్రికల కటక కిరీటం, సూర్య ముద్రిక చూడామణి, సూర్య ముద్రికల రతనాల సప్త సంగమ ముద్రల జడ, రతనాల సూర్య ముద్రికల ఎరుపు పట్టు కాంచనదారాల జడగంటలు, చీరకు రవికెకు సూర్య ముద్రికలు, సూర్య ముద్రిక కస్తూరి తిలకలు, గుండ్రని మహా తేజస్సునయనాల, సూర్య ముద్రికల నాసికకు నత్తుచే సరి అడ్డబాస, వంకీలు, కంఠాన ఏడు సూర్యముద్రలహారాలు, నడుమునకు 7 ముద్రికల సూర్యబింబాలు, 7 జాలరుల మువ్వల మణులు, పాద పద్మాలకు పారాణి పాదాలు సూర్య ముద్రికలు, 7 మురిడి గోలుసు ముద్రల సహితం గాజులు వేలి ఉంగరాలు సర్వం సూర్య ముద్రికల ధరించి, సప్త రతనాల ఆశ్వాల రథముపై దర్శనం సర్వ మోక్ష ప్రదాయకం మహోన్నత తపః ఫలం ఎట్టిని అశ్వాలపై మరకత మణుల తీవ్రత ఎక్కువగా ఉంటుంది. ఆ రోజు శ్రీ లలితా కామేశు సహితంగా అందరు దేవతలు

చింతామణి ద్వీపంలో వేదోక్త విధానంగా నాలుగు వేదాలు, ఋగ్వేదము యజుర్వేదము, సమావేదము, అధర్వణవేదము చదువుతారు. మాఘ పౌర్ణిమ వరకు నాట్య రీతుల సాగుతునే ఉంటాయి. సూర్య దేవుని ముద్రల నాట్యాలు జరుగుతూనే ఉంటాయి. 799 ముద్రల నాట్యం అలా సాగుతునే ఉంటుంది.

**10. పుష్య పౌర్ణిమ**

పుష్యరాగ ప్రాకారంలో జరుగుతుంది. మహావీర పరాక్రమ శౌర్యరణరంగ రాజనీతుల సమస్తము, అనేక యుద్ధరీతులు, తీవ్రనైపుణ్యం వాడిగా శస్త్ర నాపుణ్యం అతి లాఘవంగా శత్రువును ఒడిసి పట్టుట, తీవ్ర వేగమహావేగ పరావేగ రథ చక్రాల పరిభ్రమణముద్రల సర్వము, పద సరళిలో, హస్తముద్రలో ముఖ కవళికలలో సర్వ అంగాంగాన వీర రౌద్ర పరాక్రమ శౌర్యప్రతాప రీతులుతో చేసే ఈ నాట్యమునకు, గజ, అశ్వ, వరాహ, సింహ, రథ వ్యాఘ్రా, వృషభ వాహనాలతో శ్రీ లలితా పరాభట్టారికకు అందమైన వాహనాలతో కూడినదే చుట్టూ మధ్యగా అతి మృదువైన సున్నిత ఆసనం శిల్పులు నిర్మిస్తారు. అమ్మ శ్రీ లలితా రణరంగ ధీర తలపాగాతో ఎఱ్ఱని రతనాల ఆభరణాల భుజకీర్తులతో అంకుశపాశం, విల్లు అంబులతో వాళ్ళుకోరుకొన్నరీతి దర్శనమీయ కోట్లాది పారిజాతాలతో అమ్మకు బాటలు వేసి పూజిస్తారు. వీరరసం ఎఱ్ఱనిది ఇస్తారు. మేము సంగీత, నాద, నాట్యాల హల్లీహాలస నాట్యం అరువది నాలుగు ముద్రలతో చేస్తాము. యుద్ధ వీరులు మహా హాహాకారాలతో ఆయుధాలతో గుండెలు మారుమ్రోగే మహా ఘీంకారాలతో యుద్ధ వీరులు ఆనందపూల శస్త్రాలతో అమ్మను యుద్ధ కౌసల్యం చూపి ఆనందపరుస్తారు. మేము అబలలము ముద్రలు పదసరళి ముఖ కవళికలు పెట్టినా అంతటి అట్టహాసం మాకు అలా కర్ణాలలో ప్రతిధ్వనిస్తూ ఉంటుంది.

**11. మాఘపౌర్ణిమ**

మాఘ మాసాన క్షీరతటాక సమీపాన అగ్నితో సర్పులు గోకుల బియ్యము విష్ణుక్షీరం లక్ష్మీ చక్కెర అని పాయసంచేసి ఆవునెయ్యి ఏలకి మొదలగు దినుసులతో పాయసం శ్రీ లలితకు ముఖ్యముగా ఆదివారాలు పెడతారు. సంపూర్ణమైన రోజున అమ్మ, అమృత సరస్సు చింతామణిద్వీపాన్న ఉంటుంది. పన్నెండు శ్వేతపద్మములో పన్నెండు మంత్రులు, భువనేశ్వరీ, అనంగరూప, అనంగమదన,

మదనాతుర, భువనవేగ, భువనపాలిక, సర్వశిశిర విద్యుల్లతల వలె మెరసిపోతూ దండినీ, బ్రాహ్మీ, వైష్ణవి, వారాహిలతో, అమృతసరస్సు శ్వేత సహస్ర కమలానులైతే, అమ్మ శ్రీలలిత సహస్రాసహస్ర ఎర్రని కమలంలో క్రీడిస్తూ అనేక రాజ కార్యాలకు అలసినవేళ క్రీడా వినోదార్థం అమ్మ ఎలా క్రీడిస్తే ఆ విధంగా ఆనంద భంగిమలు 333 పెట్టి వేగంగా సాగే అమ్మతో అమృత సాగర సమీపంగా పదాలు హస్తముఖ అభినయాలు వేవేగంగా సాగాలి. పరాశక్తి అమ్మవేగం సామాన్యమా?

కాని ఇటువంటి నాట్యాలనంతరం అమ్మ పాద పద్మాలకు నమస్కరించే వేళ అలసటపోయే వరం అనుగ్రహించి విశ్రాంతి నిస్తుంది. దయానిధి పరాశక్తి పరాక్రమ శోభిత శ్రీ లలితా దేవదేవి. పరాశక్తి మహారాజ్ఞి శ్రీ లలితా మంత్రుల గౌరవార్థం చేసే క్రీడా వినోద నాట్యం, అందరి మంత్రుల ప్రావీణ్యము ముద్రల రూపాన, అమ్మ పరాశక్తి మనస్సంకల్పముగా ముద్రల రూపాన క్రీడగా జయ చిహ్నాల విజయ పరంపరంగా చేస్తాము.

### 12. ఫాల్గుణ పౌర్ణమి

ఈ పౌర్ణిమ నాడే, రాధాకృష్ణ సమాగం, ఈ ఫాల్గుణ పౌర్ణమి నాడే నరసింహావతారి, భూలోకంలో చెంచులక్ష్మి కోయజాతితో ఉత్సవాలు జరుపుకొన్నది. ఈ ఫాల్గుణ పౌర్ణమి నాడే స్కంధుడు వల్లీ ప్రణయాల కోయజాతిలో జరుపుకొన్నది. ఈ ఫాల్గుణ పౌర్ణిమ నాడే, మదించిన మదగజముతో ఆకాశ రాజోద్యానవనంలో మదన పౌర్ణిమ పద్మావతి మన్మథ వేషంలో పూల బాణాలతో ఉన్న, పద్మావతికి కళ్ళకు గంతలు కట్టినప్పుడు వేంకటేశుని తొలి స్పర్శ తొలిచూపు, తొలిమాట, తొలివలపు.

శ్రీ లలిత మహేంద్ర నీలమహేంద్రమదన మోహన సమ్మోహన మూర్తి భవించిన నవనీత చోరునివలె మా హృదయాల దోచుకునే కన్నయ్య రూపం దాల్చి, రాధమ్మతో పూలపుప్పొడుల, వసంతం అనేకానేక రంగుల జల్లే మన్మథ పౌర్ణిమినాడు, శ్రీ లలిత కృష్ణ రాధమ్మతో, హల్లీహాలస నాట్యము చేసే ప్రణయ ముద్రలు పెట్టె వేళ శ్రీ లలిత కృష్ణ మాయపూల పరిమళాల విల్లుపూలు పంచ బాణాలు కావు, పంచవందల బాణాలు వేసేస్తూ ఉంటుంది. హల్లీ హాలస సమస్తముద్రలు పెట్టేవారు ముందు ఐదువరుసలో నిలువబడే వారు, మూడు వందల

మంది ఉంటే, మిగిలిన రెండు వందల మంది వలయాకారంలో హల్లీహాలస క్రమము తప్పకుండా సహాయానికి, ఉంటారు, ఇందుముందు వరుసలో హంస మదన, మత్స్యగామిని, హరిణవేగ, మదన మనోవేగ, కృష్ణనీలిమ, నాగమోహన, చిత్రముద్ర పద్మముఖి, విరహవేగ, అభిసారసారిక, మయూర ముద్రవేగ, కీరమధులతాంగి, ముందు వరుసలో పన్నెండు పున్నముల ముద్రలలో మిక్కిలి ప్రావీణ్యం, ధైర్యంగా, ఉండాలి. పరాశక్తిముందు చేయవలెనంటే, మహా వీరప్రతాప వంతులు గాని నిలువబడి చేయలేరు, మించి మహాలావణ్య మోహనాంగితేజః స్వరూపుల కను రెప్పపాటే లేకున్నా అమ్మజగన్మోహిని రూపంనుంచి దృష్టిమరల్చి వేవేగంగా ముద్రలు పెట్టి పదసరళి, ముఖ కవళులు ఏనాట్యానికి తగ్గట్టు ఆ రీతిగా చెయ్యాలి, అమ్మ అందరిని పుప్పొడులతో వసంతం మా అందరి పై జల్లి వేస్తోంది, కోట్లాది నవమన్మథాకారికి అమ్మ కృష్ణా, రాధమ్మల రాసలీల షోడ్రశకళానిధికి 6, నవనిధి ప్రదాత 9, నవవసంతాల ఆనందం 9. ఆరువందల తొంభై తొమ్మిది మన్మథ ముద్ర నాట్యము.

స్కంధుని షష్ఠికి నాగుల చవితి, కార్తీక పౌర్ణమి, వైకుంఠ ఏకాదశి, వినాయక చవితి, విజయదశమి, సంక్రాంతి యుగాది, శ్రీరామ నవమి, గోకులాష్టమికి ఇవన్నీ సర్వసామాన్యంగా చేసే నాట్యాలు, లక్ష్మీ నృసింహ కల్యాణం, అనేకం శ్రీ లలితా సంకల్పముపై తప్పక చేస్తాము. జ్యేష్ఠ పౌర్ణమి అన్ని పున్నములు చేస్తాము. భూలోక వాసులు సూర్య చంద్రులు వరణడు పడాలనే చావిడి ఇళ్ళు కట్టుకొనేవారు.

## బ్రహ్మముహూర్త కాలమున వచ్చిన అనుభవము

బ్రహ్మముహూర్తాన కంటిన్ శ్రీలలితాదేవి వెలసిన ప్రదేశము నాలుగు బంగారు నవరత్నాలు పొదిగిన మహాదివ్య మండపమును, అనేక చిగురు మామిడి కొమ్మల, కదంబ వృక్ష సహిత కదంబ ఫలాలు నాలుగింటిని, వేపకొమ్మల అందముగా మండపాలకు మహా తేజస్వీ స్త్రీలు అలంకరించిరి, మండపమున హంస చిహ్నములు, మహాగోపుర బంగారు దివ్య నవరత్న శోభల, గోపుర శిఖరాన రతన హంసముద్ర, మండపమధ్యవేయి పత్రాల రతనాల కమలము మధ్యగా సుతిమెత్తని పరుపు, పీఠకపై పాద పద్మాలు పెట్టుకొనుటకు వీలుగా కమల రేకులు వాలి ఉన్నవి.

బంగారు దివ్య నవరత్న పీఠిక, అష్ట దళపద్మ అనేక పరతత్వ ముత్యాలు, శ్రీ లలితా సహిత కామేశ్వరుడు ఆశీనులైరి, శ్రీ లలితా దేవి సహజ ఏలకీ కేశాలు, వ్యోమికేశి పద్మ రాగమణికఖిత కిరీటి, లలాట రతన ముత్యాలు జాలువారు లలింతిక, ఫాలభాగాన కస్తూరి తిలకము, సుగంధ కస్తూరి గంధకాటుక, సువిశాల నేత్రాలు, కర్ణాపై భాగాన రతన కడిమి గుత్తి, కర్ణంబుల చంద్రముద్రపైన సూర్య రతన కుండలాలు, పంచకొన నక్షత్ర మాటీలు, నవగ్రహాలు, కోణాల నక్షత్ర జాలరు వెనుక భాగాన చింతామణికి అమర్చె, రతన ముద్రికల జడవాగు వోలె సాగ నవరత్నాల చిరుగంట మణులు, అశోక, పున్నాగ, చంపక సౌగంధిక, జపాపుష్ప సుగంధమాలలు, కంఠానమూడు ముద్రలు సత్వర జోతమోగుణాల సూచింపు, చింతామణి ముద్రకు ముత్యాలు వ్రేలాడ, ముతాయ్ల దండు, బాహువులకు అష్ట దిక్పాలుర నక్షత్రారూప అష్టకోణములు హంసరతనముద్రిక ముత్యాలు అటునిటు భజంభునకు వ్రేలాడు , కోట్లాది వేల సూర్యకాంతుల ఎట్టని వస్త్రము అనేక ఆభరణములు, కామేశ బద్ధమాంగళ్య మంగళ సూత్రములు అనేక పరతత్వ చిహ్నల మరింత శోభ, అమ్మ ఉత్తుంగ వక్షస్థలికి, నూగారు బంగారు సనన్నని నడుమునకు ఎట్టని పట్టు వస్త్రము ముమ్మారు కటి, రతన ముద్రల సన్నని బంగారు తీగెకు జాలరుల మణి సవ్వణులతో, హస్తాల మురిడీ గొలుసుల మద్యహంస రతన ముద్రికలతో, రతనాల గాజులతో, అభయ హస్తముద్రల జాలరులు, కొంగ్రొత్త రతనాల మట్టెలకు జాలరులు పాద పద్మముల మధ్య హంస రతన ముద్రల జాలరుల, మంజీరాలకు అమర్చబడె, ఎట్టని మేలు ముసుగుపై హంస చిహ్నల రతన ఆముద్రలతో మేలిముసుగు మహారాజ్ఞి కోట్లాది కందర్పుల అందాన్ని మించిన వాడు, కోటిసూర్య చంద్ర మహాతేజస్సుతో కామేశుడు పంచ ముఖాలతో మహాదవళ తేజోకాంతులతో, పంచవదనాల కలుక కిరీటములు పంచవేదాలుగా, అనేక వజ్రజ వైఢూర్య, రతన నవరత్నల శోభాయ మానమై ధవళ వర్ణంబునకే వన్నె తెచ్చే కోడె వయసు పదునారు ఏండ్లవాడు స్పటికాకారం అమ్మ ప్రేమ చిహ్నరతనాల ముద్రిక మద్యగా, భుజకీర్తుల, భుజా ఆభరణముల, నవరత్నల బంగారు జంధ్యము, దవళ వర్ణము పోటీ పడుతు ధవళ పట్టు వస్త్రము, పాదాలకు పట్టెడలు , అరిపాదాల పరతత్వ చిహ్నల, పాలభాగాన విభూది రేఖల సింధూరము, వింతకాంతుల అయోమయావస్థలో ఎందరో స్త్రీలు సహాయమందింప బంగారు

పళ్ళెమున ఇరువురికి పాద పద్మాలు కడిగి, మెత్తని సుతి మెత్తని వస్త్రంబుతో ఒత్తి, నవ వధూవరులవలె, అమ్మకు గంధము కస్తూరితో కూడిన తిలకము, కాటుక, పువ్వులు, అనేక రకాల పళ్ళు, ఎఱ్ఱని చీర బంగారు నేతతో హంసముద్రలతో, అమ్మకు, కామేశునకు, గంధము, పట్టువస్త్ర తాంబూలము, ఇరువురికి పన్నీరు, సుగంధ పళాలు జల్లి, బంగారు వింజామరలతో విసిరి, ముందుగా చంద్ర సూర్య నక్షత్ర పంచ, నవ, సప్త, ఏకహారతి, అఖండ ఆనంద కర్పూర నీరాజనము. ఇచ్చి వేలాది బూరెలు గారెలు చిత్రాన్నాలు, మధుర రసాలు నివేదనచేసి, అమ్మకు కామేశునకు దేవకాంతలు దిష్టిలు తీసి, ఏమియో చేసిరి ఆ తల్లి కామేశులు ఎంతో ఆదరముగా చూసి అక్షింతలతోకాదు బంగారు తేలికైన కాసులతో పూలతో వర్షంవలె దీవెనలు కురిపించారు. ఇద్దరి పాదాలకు నమస్కరించి ఇంతటి అనుభూతిని పొంది, ఎలాగో కాలకృత్యాలు తీసికొని, ఆరోజంతా లేవలేకపోయాను. మహాదివ్య కాంతులతో శరీరము ప్రకాశించడము మొదలి పెట్టింది. ఆతరువాత ఉదయానికి కొంత మామూలు స్థితికి రాగలిగాను. అనుభవమో, వాస్తవమో, భావనయో గాని , ఇంతగ పరవశించితిని, ఆ దివ్యాని దివ్యమధురమునకే మధురమైన అనుభూతిని ఆరీతిగా పదిలముగా లయమైపాయో సమయము వరకు పదిలపరచుకోవలసిన మహాయోగము.

### చింతామణి ద్వీప ప్రత్యేక వర్ణన

చింతామణి ప్రాకారం: వేయి యోజనాలు పొడవు వెడల్పు గలిగి వేయి రత్న స్థంభాలతో అతివైభవంగా చింతామణులతో పొదగబడి ఉంటుంది. జ్ఞాన ముక్తి, శృంగార, ఏకాంత మండపాలు ఉంటాయి. శ్రీ లలితా దేవి సహిత కామేశ్వరులు ఆశీనులు కాగానే రాజకొలువులో ఇరు పాదనమస్కారము నాట్యము మొదలు, తుదిలోను చేస్తాము. శృంగార మండపంలోనే అమృత సరస్సు పద్మాలతో ఉంటుంది. అది కేవలం అమ్మ పన్నెండు మంత్రులకు శ్రీదేవికి తప్ప మరెవ్వరూ ప్రవేశించరు. ఆ సరస్సు చుట్టూ అత్యంత అద్భుత వనాలు, అశోక, నాగ, పున్నాగ, కనకాంబర బంగారు రంగులో ఉంటాయి చంపక, అనేక లతల పత్రాలు సుగంధాలతో ఆనందమయమై శృంగారమండపము అంతా అత్యంత అద్భుత నాట్య శిల్ప ముద్రలు పెట్టిన వజ్రవైఢూర్య మరకత మాణిక్య చంద్రసూర్య ప్రభలతో

నిండియుంటుంది.

జ్ఞాన మండపంలో జ్ఞానులతో, ముక్తి మండపంలో ముక్తిని భక్తులకు అనుగ్రహిస్తూ, ఏకాంత మండపంలో స్వయంగా రాజ్యాంగాలు సమాచారం గురించి తెలిసికొని తానే స్వయం పరిపాలన చేస్తుంది.

దధి, క్షీర, మధుకుల్యటా, జంబూ ద్రాక్ష, ఆమ్ల, యక్షు రసాలు అనేకానేక దివ్య సరస్సులతో నిండి ఉంటుంది. కల్ప వృక్షా ఫలాలు, దివ్య మకరందాలు, దివ్య నాదా మకరందాలు, దివ్య గాన పుష్ప మకరందాలు నదులు ఉంటాయి. చింతామణి ద్వీపానికి చుట్టూ బ్రహ్మ విష్ణుమహేశ నాట్యగాన నృత్య మంత్రులతో చుట్టుతము చుట్టి ఉంటాయి. మంత్రులు మేధాశక్తి మకరందరసా పానీయాలు త్రాగుతారు.

## చింతామణి ద్వీపం

యుద్ధ నిపుణులందరు ఎట్టిని వీర వగరు తీవ్రకారం ఘాటుగా ఉంటుంది. తటాక సమీపానికే వెడితే నాసికా పుటాల్లోంచి రక్తం వచ్చే అంతఘాటుగ ఉంటుంది. ఎవరికి వారికే దివ్య తేజస్సు సంచారం పంపబడుతుంది అరఘడియల మొత్తం చింతామణి ద్వీపం వేయి యోజనాల వెడల్పు పొడవుగల అరువది నాలుగ మంది సేవకులతో ఉన్నదంతా అమ్మేందు ప్రత్యక్షం అయ్యేశక్తి గలిగి ఉంటుంది

అయితే ఈ ముక్తి జ్ఞాన శృంగార ఏకాంత మండపంలో నిగూఢమైన మండప ఉంటుంది. అది సర్వ సాధారణంగా ఎవరికి గోచరించదు. అది జా ఉంటుంది. చింతామణులతో ఉంటుంది. నూటఎనిమిది (108) మండపస్థంభా ఉంటాయి. ఒక్కొక్క స్థంభానికి నూట ఎనిమిది యోజనాలు వెడల్పు ఉంటుం ఇచట వేదోక్తంగా అన్ని జరుగుతాయి. అచల మంచాధి శాయిని ఇక్కడ ఉంటుం కామేశ్వరుడు పరుండ బ్రహ్మ విష్ణు మహేశ్వర రుద్రులు ప్రేతలై ఫలక అధోభాగా సదాశివుడు, ఇరువెంపుల గణేశ షణ్ముఖులు ఉంటారు. సరస్వతీ దేవి, ల దేవి వింజామరలు వీస్తుండ, శక్తి రుద్రశక్తి అనేక రూపాలతో వేలాది బూరె గారెలు చిత్రాన్నాలు శ్రీ లలితచే సృష్టింప బడిన దిగుడుగా ఉండే దివ్య జ కోట్లాది వేల విద్యుచ్ఛక్తి సామాన్యులు త్రాగలేరు బంగారు బిందెలతో వీరు పెరు

నెయ్యి సమస్తము, బ్రహ్మదేవుడు వేదోక్తంగా నివేదన చేసి విష్ణువు జరుగుతున్నది సక్రమ పర్యవేక్షణ, రుద్రశక్తి ఆవహించి పవిత్రం చేస్తుంది. నివేదనానంతరము సుగంధ పరిమళ తాంబూలం ఉంచి ఎవరి నిర్ణీత గృహాలకు వారు వస్తారు. విశేషదినాలలో మాకు నాట్యగాన వాయిద్య బృందాల వారికి దర్శనం ఇస్తుంది.

చింతామణి ద్వీపంలో శ్రీ లలితా పరాభట్టారిక సహస్రానేక కోట్ల కాంతులతో, హయగ్రీవులు చదువుతూ ఉంటే వేదానికే దివ్య మధురాతి మధుర స్వరంగా, లయబద్ధంగా అతి శ్రావ్యంగా చదువుతారు. వశిన్యాది దేవతలు అనువదించి భూలోకవాసులకు ప్రసాదించారు. అనేకవేద వేదాంగ ఋషిపరిమండల వేష్టితమై బ్రహ్మ విష్ణ మహేశ్వర సహితంగా స్తుతిస్తారు.

అమ్మా ఎఱ్ఱని చీరతో అపార అవ్యాజ కరుణామూర్తి కుడిచేతి వెనుక అంకుశం ఎడమచేతిలో పాశం ధరించి, వజ్ర వైఢూర్య రతన మణులతో దివ్యాతి దివ్య ప్రకాశమా, పద్మాసనే, ఎఱ్ఱని పట్టుచీరతో పద్మాలకు అసమానమయిన అభయ ముద్రలతో సర్వ దేవతలు ముకుళిత హస్తాలతో అమ్మా నీకు నమస్కారం చేస్తున్నారు. శ్రీ విద్యవు సకల శాస్త్ర మూర్తివి సకల దేవతలకు అభయ హస్తంతో దీవిస్తున్న నీకు సాష్టాంగ కోటి ప్రణామములు కుంకుమ కుంభాలతో, కస్తూరి చందన తిలకంతో చిరుమందహాసముతో, పంచ బాణాలు కుడిముంజేత, ఎడమవైపున ఎఱ్ఱని చెఱకు విల్లుగా ధరించి, అశేష దేవదానవ మానవులందరును మహాదివ్య మోహావేశులచేస్తూ జపాకుసుమాలు జపవిధితో నీకు అర్పిస్తున్నాను.

అమ్మా అనేకానేక సూర్యకాంతుల ఎఱ్ఱని వస్త్రంతో, త్రినేత్రాలతో, మాణిక్య వజ్ర వైఢూర్య, రతనాలతో ధగధగాయ కాంతులతో దేవతలందరికి మహా వరకిరీటానివి, చిరునగవుతో, అమ్మా చేతులలో నీవు ధరించినవి కూడా ఎరుపు నీవు ధరించిన పట్టుతీరు ఉత్తుంగ వక్షంతో నీ దివ్య తేజస్సు సర్వ సింధూరం రంగులోనే ఉందమ్మా కటి ప్రదేశము పాద పద్మాలు మోపుగా కూర్మంలా నీవు మాత్రము సహనంగా దేవదానవ మానవ సర్వలోకాలను చిరునగవుతో శాంత వదనంతో బిడ్డలపై మమత తెలుస్తోంది. అమ్మా నీకు అనేక కోటి నమస్కారములు.

వజ్ర కెంపుల ప్రాకారం : మహా రుద్రుడు, మహాశక్తి మహారుద్ర మహాశక్తులు

మహోన్నత అలంకార మూర్తులై ఎటూ కాంచినా అనేక నాట్యముద్రలతో మణిమయాల రూపాల మూర్తులు కానవస్తాయి. అనేక కానేకమంది సేవిస్తూ ఉంటారు. ఇరువురు హల్లీహాలస నాట్యరీతులు 1,116 రీతులు ప్రతని నిత్యం సాధన చేస్తాము. శివతాండవ రీతులు 108, హల్లీ హాలస నాట్యానికి ప్రత్యేకమైన రీతులులలో 1,116 నృత్యాలలో ఆరితేరిన వారిలో ఈ అభాగ్యురాలు ఈనాడు భూలోకమున ఉంది కృష్ణనీలిమ పదసరళి, ముద్ర పట్టుటలో నాట్య భంగిమలలో శ్రీ లలితా దేవదేవిచే దీవించబడి అమ్మ అపార కృపకు పాత్రురాలినైనదానను. ఇచ్చట భూలోకంలో ఆడపిల్ల అత్తవారింటికి వెళ్ళేవేళ తల్లిదండ్రులు ఆడపిల్ల అనుచు దుఃఖిస్తారు. కాని ఇక్కడ ఈ భూలోక వాసము దినదిన గండముగా ఉంది, అలాగని అమ్మ శాపకారణంగానే భూలోకానికి పంపలేదు ఒకమారు భూలోకంలో 7 ఏడుమార్లు ఉండాలి. రెండు జన్మలే వివాహము, ముందు జన్మలు అతి సులభముగా దాటవచ్చు అని అన్నది. కాని అన్నీ తెలిసిపాలు నీరు వేరు చేసే హంసలా, స్వాతి వాన చినుకు కోసమే ఎదురుచూచే చకోర పక్షిలా, అమృత సరస్సులో క్రీడించే ముత్యాన్ని భూలోక సంసార సాగరంలో వేసిన చిరు చేపలా గిల గిలలాడుతు అనుక్షణం మురుపైనా రాదే ఈ లోకంలో ప్రతీచంద్రోదయం ఆనందం అమ్మకు చేరే శుభఘడియ కోసమే ఈ నా నిరీక్షణ.

## రత్నమణి వజ్ర వైఢూర్య ప్రాకరం : మహా మహాసరస్వతి మహోన్నత బ్రహ్మ దేవుడు :

ఇది ఒక అద్భుతమైన నాదం వేదం యోగం యజ్ఞ నిలయమై అన్నీ శ్వేతమయమై అత్యంత ప్రశాంతతగా ఉంటుంది. శ్రీ సరస్వతీ దేవి మూర్తీభవించిన శ్వేతపద్మ సూర్య కోట్లాది వేలాది ప్రభలతో శ్రీ సరస్వతీ దేవి బ్రహ్మ దేవుడు ప్రకాశిస్తూ ఉంటారు. వీణా నాదాలనేకరీతులు శ్రీ సరస్వతి దేవి బోధిస్తుంది. కిన్నెర కింపురుష వీణా, రుద్రవీణా, ముఖ వీణా వాయువీణా తుంబుర వీణ నారదవీణా, రావణ హస్త వీణాది రీతులు కాకుండా స్వయం శ్రీ సరస్వతీ దేవి. శ్రీ లలితా దేవి ప్రీతియైనవి వేదయుక్తంగా నాదయుక్తంగా నేర్పిస్తుంది. నవ్యాతి నవ్యరీతులు ఎప్పటికప్పుడు ప్రతీ వారు విద్యార్థులే. అలాగే బ్రహ్మదేవుడు వేదయుక్తమైన గానం గంధర్వుల క్రొంగ్రొత్త ఆలాపనలు, గయుగ, లయ, బద్ధంగా ఒక్కొక్కసా

మందస్థాయి, మరొకసారి తీవ్రవాయువు కన్నా మిన్నగా చేసే ఈ నృత్యా, గీత, వాయిద్య సమ్మేళనం, అన్నిటిని మించి అపురూప లావణ్య మూర్తి శ్రీ లలితా దేవిని మించిన ఆనందం అంటూ ఏదీలేదు ఆ అమ్మ క్రీగంట చూస్తేనే చాలు మాకు ఆనందం నిత్యము ఈ రీతి ఉసంట డోలోత్సవాలతో కోలాహలంగా ఉంటుంది. అయితే శ్రీ లలితా పరాభట్టారిక అచల ఆ తల్లిలోంచే ఆయా నాట్యాలకు తగిన రీతుల అలంకారములతో ఆవిర్భవిస్తుంది. ఇంతకన్నా మహోదానందము పరానందము ఏముంటుంది. భాషకందని ఆనందం.

## ఇంద్రనీల ప్రాకారము

మహేంద్ర నీల మణుల దివ్య అద్భుత పద్మం. మార్గశిర పౌర్ణమి సర్వోత్కై ఇంద్ర నీలాల మధ్య శేషతలముపై కృష్ణ రాధా దేవి, నీలయమునానది, పొన్నచెట్లు అమరికగా నుండు, సువిశాల ప్రాంగణము పచ్చని పట్టు వస్త్రంబునకు నీలాలతో చక్కని సరియంచు, గొల్లభామలు, గోవులు, మురళీ సహితముగా అతి మనోహరము, కౌస్తుభము ధరించి, మౌక్తికము, కంకణాల కింకిణీ రవళుల గోమేధికాలు, మణుల సహితముగా, గోమేధిక చిరుచిరు మువ్వల మణులు, రాధ ప్రత్యేక అలంకరణ శిరోజాలకు మహారాజ చిహ్నా తలపాగా పసుపుపట్టుది కట్టి మహేంద్రనీలాల ముద్రలనమర్చి జాలువారు మేలిమి ముత్యాల జాలరులకు నెమలి పింఛము విప్పినట్టుల, జాలర్ల జాలువారు మహా మోహనకృష్ణరూపము వీర లాంఛనాల భుజకీర్తులు మహేంద్ర నీలాల కేసరులు, కాళీయ మర్ధన నాగాలపై చిటికెనవ్రేలితో ఎత్తిన గోవర్ధనగిరి మోము భుజము, భుజకీర్తులతో, చేతనవరత్న మణిమయి మణుల నాదము, రాధమ్మ పసుపు పచ్చని పట్టు పావడా రవికె నీల వల్లె వాటు వేసికొని, పావడా రవికెకు మహేంద్రనీల అంచులు, నీల వల్లెవాటుకు గోమేధికాలు నాగువోలె సాగే జడకు మహా రతినాట్యమువ్వలు ఇరువది ఎనిమిది మహేంద్ర గోమేధిక రాధా కృష్ణుల ముద్రలు, బొటనవ్రేలిపై నిలువబడి కృష్ణుని పట్టిన పట్టు మాత్రమే రాధకే సాధ్యము అనేక హారాల నడుమునకు వడ్డాణము, ఆనంద కోలాహల వాయిద్యాల వేద వర్ణనా పాటల ఘల్లు ఘల్లుమను మణుల సవ్వడులు, మేము బంగారు కఱ్ఱకు మణులు, ఇక నాట్యము శంకనాదముతో మొదలై మహా శృంగార భరితమది సర్వముద్రలతో మహా మోధ మోహావేశమున

కురుల చెదర విరుల వాడ పయ్యెదలు చెదరి హారాలు చెదరి నా అపసవ్యముగా నైనా లయతప్పని ఆ నాట్యము కృష్ణవేణుగాన మందస్వరముతో స్వష్టి సృష్టిలో పుణ్యవతులకు సత్సాంతాన యోగ ఫలము. అతి మనోహర కోటి మన్మధాకార కృష్ణరాధా ప్రణయహేల.

## మరకతమణి ప్రాకారము : షట్ కోణ యంత్రం

శ్రీ లలితా దేవదేవికి యజ్ఞములన్నిటికి షట్కోణ దేవతలే, వేద శాస్త్రాది మహాఋషి మండలము, ముక్కోటి దేవతలు, చింతామణిద్వీప వాసులు ఒక్కొక్కరు ఒక అంశలోనైనా వచ్చి మాకు గురువు ఎందరో గురువులు ఉద్భవించిన ఈ మహాగురు పౌర్ణమి మానవకాలమున రాత్రి పన్నెండు గంటల ప్రాంతమున మరకత ప్రాకారములో ఋషులు యోగులు యజ్ఞ విధులు, యాగం, వేదం, నాదం, గానం, నాట్య శిల్పం, అలంకారం, సర్వ విద్యలు, ధ్యానం, తపము, సమాధి, ఘంటార్గళాది, మంత్ర, తంత్ర, సత్యం, సూర్య విద్యా, చంద్ర విద్యా, త్రైజసావస్థ, ఉన్న స్థలమునుండి పైన నాట్యగాన చిత్రలేఖ, నాదం చేయుట, వేయేల అరువది నాలుగు అమరకళల నాట్యం శ్వేతాంబరులమై మా గురు శ్రీ లిలితా పరాభట్టారికకు గురుపూజ, అమ్మామాత్రం ఎఱుపు రంగులతో అన్నీ ఆభరణాలతో మహారాజ్ఞీసింహాసనారూఢయై వరుస క్రమములో అందరికి పాదపద్మ ప్రణామము ఇచ్చి దీవించును. ఎల్లరు శ్వేత వర్ణమై, అమ్మ అరుణవర్ణము, మరకత మణులు, సర్వ దేవతా వర్ణములు, అమ్మ తేజస్సు ఎరుపు గోళాకారములో ఎవరి విధి వారు భక్తి శ్రద్ధలతోపూజించు కొందుము, శిల్పులు అనేక గురు పూజాముద్రలు అద్భుతముగా చేయుదురు, చిత్రకారుడు చిత్రములు అతి విచిత్ర చిత్రాలు, యక్షమాయలు, అప్సరసల అందము, కిన్నెర కింపురుష గంధర్వ గానాలు, గరుడజాతి నిరాశ్రయ భంగిమలు, నాగనాట్యములు, శివకాశవగణములు తాండవ రీతులు, హల్లీహాలస నాట్య భంగిమల మేము, గురు పూజావిధుల ఎట్టిని రంగు వస్త్రము ఎట్టిని ఆభరణములు ధరించి అతి కోమలాతి కోమలము మనోహరి, తీవ్రమైన మృదు మధురగాత్రి, సుగాత్రి, శ్రీలలిత అన్నే జగన్ మోహిని సౌందర్య అందాల రాశి, రణరంగధీర, సుమధుర లావణ్య రాశి సర్వ కళానిధి గురువుమాకు తొంబది తొమ్మిది రీతులు సాగే నాట్యము నవవిధ భక్తులు కాదనవాన వార్ణవాలు.

అమ్మలగన్న అమ్మదీవెసల ఫలమేమొ.

సహస్రానేక దివ్య తేజోబలశాలురమై నాట్యముసాగుతునే యుండు అమ్మకు పదునైదేండ్లు పరమ పరాశక్తి, ఇక అందరము పదహారు నాట్య వృత్తి, మిగిలిన వారు పదునెనిమిది ఏండ్లు దాటినవారుండరు. ఈ రీతి గురుపౌర్ణమి నాటి గురుముద్రాదులు ఎవరి రీతివారు నాట్యము సాగును. శ్రావణ నవమి నాటికి అమ్మ నవనిధుల నిచ్చున వారణ నవ వారణ దీక్షలకు వైష్ణవీ దేవి వలె మోహనరూపమున సౌమ్య రూపిణియై విష్ణు సోదరీ కృష్ణా, అద్భుత లావణ్య రీతి సంతుష్ట అయిన వేళ ఆనంద నాట్యము చేయుదుము.

**ప్రవాళ ప్రాకారము**

ఇందు భవనాలు, ఉద్యానవనాలు, తరులతానికుంజాలు అన్నీ పగడమాయలే. పంచభూతాల వలె ఐదుగురు పాంశాకుశాది ఆయుధ పాణులై దివ్య అందముతో చింతామణి ద్వీపానికి పంచభూతాల వంటి మహా విద్యుత్ సంపన్నులు, ఎప్పటికప్పుడు అరఘడియ కూడా ఆలస్యం చేయకుండా భువనేశ్వరి దేవికి సర్వవార్తలు అందచేస్తుంటారు. అనేక వివిధ రకములైన మహాబరువు బాధ్యతలు వీరి మీద ఉంటాయి. ఆ తల్లి చింతామణిలో స్థిరంగానే ఉంటుంది. కాని ఒకానొక ముగ్ధ మనోహర రూపముతో ఇచట కూడా మయూర ముఖాల ముత్యాల పగడాలతో ఐదుగా కలిసి ఉంటాయి. నెమలి పింఛములు, ఊయల అల్లికలు మనోహర నిజపుష్పాలలా భ్రమింప చేస్తూ ఉంటాయి. ఇచ్చట కూడా, వాయిద్య గంధర్వ, అప్సరసలు, ఐదుగురు ఉపమంత్రుడు ఎవరి అలంకారములతో వారు సంసిద్ధులై యుంటారు. అమ్మ శ్రీ లలితా దేవదేవి ఎఱ్ఱని పట్టు చీరతో బంగారు నూలునేతతో చీర అంచు ఉంటుంది. ఈ విధంగా నవరత్న వజ్ర వైఢూర్య రతనాలతో కూడి ఉంటాయి ఈ ముద్రలు పమెటి చెంగుకు, చీర పాదాలపై జీరాడునవి, రవికెకు వెల లేని ధగాధగా మెరిసే రతనాలు వ్రేలాడుతూ ఉంటాయి. మహా ముగ్ధ మోహన సమ్మోహనంగా, వయ్యారంగా పదునైదేండ్లు పరువాలతో ఉంటుంది. అనేక ఆభరణాలు పెట్టుకున్నా ఎంతో అందంగా ఉంటుంది. జడకూడా ఇలా దివ్య పరతత్వాల ముద్రలతో మహాద్భుతంగా ఉంటుంది. అశోక పున్నా పుష్పాల పెట్టుకుంటుంది. మహా దివ్య ముద్రల మొలనూలు జాలరులతో,

రత్న నవరత్న కింకిణి గాజులు రవళితో, మురిడిగొలుసు మధ్యగా దివ్య పరతత్వ చిహ్నంతో, పదివేళ్ళకు ఆయా అవతారాల అంగుళీయాలతో దివ్య మంజీరాలతో ఐదువేళ్ళకు దివ్య నిజ వైఢూర్య మణులతో మట్టెలు మరల మంజీరాలు కలుపుతు దివ్య ముద్ర పాదమధ్యగా ఉంటాయి. మోపు పాదాలతో, వంకీలు, భుజాలకు ఈ విధమైన మణుల అలంకారంతో, వంకీలు కూడా ఇటు వంటి పతకంతో పట్టుదారంతో కట్టి ఉంటుంది. ఈ విధమైన చందన కర్పూర కూడిత తిలకం తో మత్తెక్కించే సువిశాల నేత్రాలతో సోగకన్నుల కస్తూరి గంధకాటుకతో కొసలతో, సుదీర్ఘ నాశికతో, చక్కని చిరుపెదవులతో చిరునవ్వు కూడా కోటి మన్మథులకన్నా మత్తెక్కించే మోహంగా ఉంటుంది చిరునవ్వు, కర్ణాలకు ఈ విధమైన కర్ణాభరణాలు, చెంపస్వరాలు, జడకు ఐదు రతనాల జాలరులు జడపై ఇటువంటి చింతామణికి అమర్చబడి ఉంటాయి. జడకు ఐదువరుసల దేవతా సుగంధ పుష్పాలు ఉంటాయి. ఇవి ఒక్క శ్రీ లలితా దేవిమాత్రమే పెట్టుకుంటుంది. జడమధ్యలో దివ్య రతనాల కిరీటం అయినిటు సూర్యముద్రలతోఅకస్మాత్తుగా ఊయలలో ఆవిర్భవిస్తుంది ఆ తల్లి అందలకు అలా మైమరచి చూస్తూ ఉంటే మళ్ళీ ఆ తల్లి ప్రేరణతో అమ్మకిష్టమైన ముద్రలు పెట్టి హల్లీ హాలస నాట్యా అందరిలో కృష్ణనీలిమ ఉంటుంది చేస్తాము.

బంగారు వజ్ర వైఢూర్య గోమేధిక పుష్యరాగ
పద్మరాగ, నాగేంద్ర ప్రవాళ మౌక్తిక, స్ఫటిక
హేమ రత్న ఖచిత మరకత, కెంపుల, మహేంద్ర

**నీలాది, మణి ప్రాకరం :**

మహా అత్యంత అద్భుతాల అనేకానేక అలంకార ప్రధాన ప్రాకారము సర్వరాగ, గాన నాద వాయిద్య, నానా విధ తరుపుష్ప దివ్య శోభామయమణిమయ ప్రాకారం శ్రీ మహాలక్ష్మి, శ్రీ మహోన్నత విష్ణుమూర్తి. ఈ ప్రాకారము అత్యంత భోగ భాగ్యాలతో ఎచట చూచినా మహాఅలంకారయుక్తమై వైకుంఠానికి వేలాది కోట్ల దివ్య అప్రతిమాన ప్రభలతో శ్రీ మహాలక్ష్మి శ్రీ మహోన్నత విష్ణుమూర్తి దివ్య తేజోమయులై సౌందర్య అలంకార వాయిద్య నాదాల వీణలతో ఉంటుంది. వాయిద్య ఘోష్రానాదాలుకూడా అనేక రకాలుగా ఉంటాయి. శ్రీ లలితకు

వినోదము కోసమే అలంకారము చేయుటలో మహానిపుణులు శిల్ప శాస్త్రకోవిదులు ఇక్కడే ఉంటారు. అమ్మ శ్రీ లలితా దేవ దేవి ఆనందము కోసమే కేవలం లంకారములో విశ్వకర్మకన్నా ఎందరో మించినవారు నేకమంది అలంకారముచేసే వారితోచర్చలు జరుగుతూ ఉంటాయి. ప్రతీ నిత్యము వాయిద్య నాట్య గానము చేసేవారు ఇక్కడ కొంతసమయము ఉండి సాధన ప్రతీ నిత్యము కొంత సేపనీ ఉంటుంది. ఎప్పటికప్పుడు అందరు శ్రీ లలితా దేవ దేవి ఇష్టమైన విధంగా ప్రతి నిత్యము అన్ని రంగాల వారు కృషి చేస్తూ, నవ్యాతి నవ్యంగా మేధస్సుకు పదను పెడుతూ అందరు అప్రమత్తులై ఉంటారు. అలంకార ప్రియులే శ్రీలక్ష్మి సహిత విష్ణుమూర్తి వద్ద ఎందరో అసంఖ్యాకమై ఉన్నప్పటికి సర్వాంగ భూషితులైన వారే శ్వయంగా సమస్తము పరిశీలనా చూసి, సదా శ్రీ లలితా దేవికి ఆనందం కలిగించేలా కృషి పట్టుదలతో చేస్తూ ఉంటాము.

## ఓం, ఐం, హ్రీం, శ్రీం,

## చింతామణి ద్వీపము

చింతామణి ద్వీపమున, వేయి బంగారు నవరత్న స్థంభములతో, ముక్తి, జ్ఞాన, ఏకాంత, శృంగార మండపము, భువనేశ్వరునితో శ్రీ లలిత శృంగార మండపాన హల్లీహలస నాట్యము. ముక్తి మండపమున ఏకాంతముగాని యమతులైనవారితో ముక్తుల గూర్చి, జ్ఞాన మండపాన ఎవరికి ఏయే జ్ఞానముల ప్రసాదించవలయునో ఆజ్ఞాపించి, ఏకాంతమండపమున మంత్రిణులతో సర్వరాజ్య పరిపాలనా విధాలనేకాలు, సర్వము స్వయముగా చూచుకొనును.

**కాని ఒక ముఖ్య మహారహస్యము.**

మంచాధీశాయినీ: ఈ పీఠము అగోచరము. వేయిమండపాలలో మధ్యగా ఉన్నను ఎన్నడూ ఎవరికి చింతామణి ద్వీప వాసులకు సైతము కనుపించదు. మహామాయా లోకమదే. వాటంతటవే అమ్మ ఆజ్ఞ అయితే తెలుచుకుంటాయి. అన్నివేళల అక్కడ కనిపించద. అచలగానుండి శ్రీలలితా సహిత కామేశ్వరునితో, బ్రహ్మ విష్ణు మహేశ్వర రుద్రులు ప్రేతలై కోళ్ళుకు ఫలక భాగాన సదాశివుడు

అనేకమంది బ్రహ్మ విష్ణు మహేశ, వాణీ లక్ష్మీ శక్తి స్వరూపులు, అనేక చిదగ్ని సంభూత దేవతలు సర్వోపచారాలు చేస్తుంటారు. కొన్ని వేలాది గారెలు బూరెలు, చిత్రాన్నాలు, రసాలు, మహోన్నత మధురసాలు నివేదనలు చేస్తారు. తాంబూర వింజామర సేవతోసరి. శ్రీలలితా పరాభట్టారికా వేదాలు ఉపనిషత్‌లేకాదు చింతామణి ద్వీపవాసులే చెప్పలేరు. ఒక్కొక్కసారి ఒక్కొక్క రీతి కనిపిస్తుంది. మంచాది ధీశాయిని రూపము మాత్రము మహోన్నతము అంతా మహామాయగా అక్కడ ఏదీ చెప్పడానికి ఉండదు. అగోచరము శ్రీ లలితా దేవి పాదపద్మాల సాక్షిగా నిజముగ.

## ఓం

ఓం - బ్రహ్మవిష్ణు మహేశ్వరీ త్రిగుణాత్మక శక్తి

ఓం - సృష్టికి ప్రతి సృష్టి విశ్వామిత్రులు

ఓం - గోమాత అరువది నాలుగు పిండి వంటలతో ఎందరు వచ్చినా బ్రాహ్మణుడు బీదవాడు అయితే కూడా కాపాడుట

ఓం - రాఘవేంద్ర తీర్థులు మాంచాల గ్రామాధిపతికి అక్షర జ్ఞానం వచ్చేలా చేసి నూరు గ్రామాల్లో మాంచాలలో వెలసినది శ్రీరామచంద్రులు ఏడు ఘడియలు ఆ రాతిపై సేద తీరి తుంగభద్రలో నీరు త్రాగారట.

ఓం - భక్తకన్నప్ప శివుని కీర్తించుట, తెనాలి రామకృష్ణ వికటకవిని చేయుట, కాళిదాసు మహారచనలు సరస్వతీ ప్రదానం.

ఓం - శివాజికి వీర ఖడ్గమిచ్చిన దుర్గాదేవి.

ఓం - శ్రీరామకృష్ణ పరమహంస ఏనుగు దగ్గర నుంచి చీమ భాష వరకు అర్థం చేసుకొనుట, గజ దొంగలో మార్పు, వివేకానందునికి శక్తి పాతము, శ్రీ శారదామాతకు ధ్యానమార్గములో సమస్తము అనుగ్రహించుట.

ఓం - శ్రీ శంకరా చార్యులు బంగారు ఉసిరికాయలు, లక్ష్మీ దేవిని ప్రార్థించి చేయుట, పూర్ణానదిని తల్లి కొరకు కాలడి గ్రామంలో ఇంటి వద్దకు తీసుకొని రావటము అంత్యకాలములో గంగాస్తవం చేయుట,

ఓం - శ్రీ భగీరధుడు గంగనే హరి పాదాలనుండి శివుని జటాఝూటము, జహ్నుముని చెవిలోంచి వచ్చుటచే జాహ్నవి ఆ రీతి భగీరథ ప్రయత్నము.

ఓం - రాఘవేంద్ర తీర్థులు మృత్తిక (మట్టిని వస్త్రములో) కట్టి ఇచ్చిన

మహారాక్షసి సైతము రాలేక కొడుకు పుట్టి, ఆ ఇంటి పిల్లనే ఇచ్చి పెండ్లి చేయుట.

ఓం - ఐదేండ్ల వయస్సులో, భక్తపోతన, భక్త త్యాగరాజు, కృష్ణుడు, రాముడు వచ్చి పూరించి, త్యాగరాజు ఇంట సీతారాములు భుజించుట.

ఓం - అన్నమయ్య ముప్పై రెండు వేల కీర్తనలు వ్రాయగల్గుట

ఓం - షిరిడీ బాబా నిరక్షరాస్యుడైన మేఘశ్యాముడు శివ భక్తునితో త్రిశూల గ్రంథము వ్రాయించుట.

ఓం - ఏకలవ్యుడు శివభక్తుడు ద్రోణాచార్యుని విగ్రహము చేసికొని అర్జునునకు మించిన విలుకాడగుట.

ఓం - విశ్వామిత్రుని మహాశాస్త్రాలు బ్రహ్మర్షి వశిష్ట మహాముని కమండలమే ఆపుట.

ఓం - వేదవ్యాసుడు పుట్టగానే అడవులో అష్టాదశపురాణాలు వ్రాయుట.

ఓం - అష్టావక్రుడు మాయ ఏ విధముగా నుండెనన్న స్తంభము పట్టుకొని అది కొట్టి వేయుచున్నది అనుట.

ఓం - చ్యవన ప్రాశుని భార్య మహారాణి కూతురైన అశ్వని దేవతలదయతో మళ్లీ యవ్వనవంతుడగుట.

ఓం - సావిత్రి భర్త ప్రాణాలు కాపాడుకొనుట.

ఓం - అనసూయ త్రిమూర్తులనే పసిపాపలు చేయుట, ఇనుపగుగ్గిళ్ళు సెనగలు చేయుట.

ఓం - సుమతి సూర్యోదయమునే ఆపుట.

ఓం - బావాజీ రత్నకంకణము వేంకటేశునిది దొంగలించాడని చెఱసాలలో వేయ ఏనుగురూపంలో చెరకు కట్టెలు తినుట.

ఓం - గొడగూచి చిన్న బాలిక శివునిచే పాలు త్రాగించుట, చిన్నబ్రాహ్మణ కుమారుడు గోవు కొరకు శివుని గూర్చి తపముచేసి సర్వము పొందుట.

ఓం - ధ్రువుడు తండ్రి ఒడిలో కూర్చొనుటకు నారాయణ నామము చేసి శ్రీహరినే గాంచి, సర్వాధికారి అగుట

ఓం - కేవలగురు భక్తి శంకరుని శిష్యులు నీటిలో నడవగా పద్మాలు ఏర్పడి పద్మపాదుడు అను నామ సార్థకత, బలికి తీసుకు వెళ్ళిన శంకరులను

మహానరసింహమై గోళ్ళు కూడా వచ్చి కోయవారినందరిని ఎదురించుట.

ఓం - వీరబ్రహ్మేంద్రస్వామి అనేక అద్భుతాలు చేయుట, తురక వంశములో పుట్టిన తను నలుగురు కొడుకులు నా గురు పీఠము, సిద్ధయోగికి ఇచ్చుట, బండరాయిని ఖండ ఖండాలుగా చేయుట.

ఓం - రాజుకూతురు కుమారి మాంగల్య సిద్ధికి గౌరీ దేవిని పూజించి అల్పాయుడయిన భర్తను బ్రతికించుకొనుట.

ఓం - చారుమతి శుక్రవార పూజ చేసి భర్తను మహాసంపన్నుని చేసికొనుట.

ఓం - ఓంకార నామమూతో కుసుమ శ్రేష్టి వాసవి కన్యక దేవిని కూతురుగా పొందుట.

ఓం - మహారాజు కూతురై శ్రీమీనాక్షి దేవి పుట్టుట.

ఓం - భక్తపోతనను సరస్వతి దేవి అతిధులకు సకలపిండి వంటలతో భోజనము పెట్టుట, పోతన కొడుకు మల్లన ఎద్దులు లేకుండా నాగలితో భూమిని దున్నుట.

ఓం - నందనారు మాలవానిని చిదంబర లింగముతో సహా కైలాస మేగుట.

ఓం - ఓ పండితుడు గొర్రెల మేపుకొనువానిని నల్లని వాడా బొల్లి గద్దనెక్కి రమ్మని చెప్ప నిజముగా కృష్ణుడే వచ్చి సాయిద్యమిచ్చుట.

ఓం - గజేంద్రమోక్షం విష్ణువు వచ్చుట.

ఓం - గజనాగ సాలీడు సాయిద్యమిచ్చిన శివుడు

ఓం - గుహుడు పడవ వానికి ఇచ్చిన మాటకై భద్రా ది లో భద్రాద్రి అను అతని పేరున శ్రీరామ విష్ణ అవతారాల వెలయుట.

ఓం - శివుని ప్రార్ధించి, ఆంజనేయుని పుత్రునిగా పొందుట.

ఓం - ఒక అమాయకురాలువైధవ్యస్త్రీకి భీమేశ్వరుడు కుమారుడు పుట్టుట ద్రాక్షరామ నిదర్శనము.

ఓం - గజాసురుడు, భస్మాసురుడు, రావణబ్రహ్మ ఎందరికో రాక్షసులకు వరమిచ్చిన శివుడు.

ఓం - కుంభకర్ణుడు, బ్రహ్మదేవుడు వరాలిచ్చుట.

ఓం - చంద్రశేఖర మహారాజు పేరిట చంద్ర శేఖరుడగుట, స్త్రీ వక్షమే శివలింగమై ఆచంటలో పూజింపబడుట

ఓం -. మార్కేండేయుని గాచిన వాడు మృత్యువునుంచి యమునితో పోరాడి ఆయుష్మంతుని చేయుట.

ఓం - రుద్రాక్షలు సృష్టించేసి ఔషధారియై ధన్వంతరీరూపమున ఆయుర్వేద వైద్య విద్య నిచ్చిన వాడు.శివుడు.

ఓం - భృగు మహర్షి వశిష్ట మహాముని రామకాలాన గురువులు అగుట,

ఓం - జ్ఞాన ప్రసూనాంబ రాజుకు తన చేతి గాజుల చూపుట, గాజులు మారు వేషములో వేయించుకొని తిరుత్తణి వద్ద గాజులవాడ, పేరు పల్గెగా నగుట.

ఓం - కాళిదాసు అమావాస్య తిథినాడు పౌర్ణమి అని చదువ తనకంకణమును ఆకసమున వైచి మానవుల పున్నమిగా భ్రమింపచేయుట.

ఓం - సక్కుబాయిని, పండరీపురం పంపి, తాను సక్కుగా అత్త భర్తలతోనున్న కృష్ణుడు.

ఓం - ద్రౌపదికి భక్తికి కష్ణుడువస్త్రాల దానమిచ్చినవాడు.

ఓం - నమ్మనచోర భక్తుల దర్శనమిచ్చె హరి మీనాక్షి కల్యాణమందు. వారి అల్లుని అగుదునని మాట ఇచ్చినవాడు.

ఓం - చెంచులక్ష్మి నరసింహావతారాన పెండ్లి చేసికొని, యాదగిరి గుట్టపై యాదవులు కల్యాణములు కృష్ణుని చూడలేదన్నవారికి, శ్రీనివాస కల్యాణ వరము తాను లక్ష్మి సమేతుడై వెలయుట.

ఓం - బుద్ధుడు అంగుష్ఠమాళ్యుని దొంగను మార్చుట, అయ్యప్ప ఓవరు అను గజదొంగను మార్చుట.

ఓం - శిరిడి బాబా ఉప్పునీటిని మంచినీరు చేయుట, కామరూపుడుగా భక్తులను రక్షించుట.

ఓం - రాఘవేంద్రస్వామి, పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామి వేమన, ఎందరో మహాభక్తులు సజీవ సమాధి అగుట.

ఓం - దత్తాత్రేయులు పరశురామునికి గురువుగా జ్ఞానోపదేశ ధ్యానయోగం.

ఓం - మీరా, శబరి, పోతలమ్మక్క, మొల్లమాంబ, మీరా కృష్ణునే పెళ్ళిచేసి కొన్నది, శబరి, ఆ వంశమందే పోతలమ్మక్క, మొల్లమాంబ శ్రీరామ భక్తులు మొల్లమాంబ బలరాముని పెండ్లి చేసికొన్నది.

ఓం - అవయ్యారు శివునే ప్రార్థిస్తూ శిరస్సు కైలాసమునెక్కిన మహా భక్తురాలు.
ఓం - భక్త రామదాసు, కబీరు, తానీషా, ఏకనాథుడు, తులసీ, రవీంద్ర నాద్ ఠాగూర్, సమర్థ రామదాసు, పిచ్చయ్య శాస్త్రి అందరు, రాముని చూసిన రామభక్తులే.
ఓం ముత్తుస్వామి దీక్షితులు, వీణభగవత్ ప్రసాదించగా పొంది వాతాపి, గురుగుహానంద కీర్తనలు ముందు చేసారు.
వ్యాసరాయలు : శ్రీ వేంకటేశ భక్తులు మోకాలితో స్వామి కొండనెక్కి ఈనాటి పూజా విధానాలన్నీ నియమించినవారు.
ఓం: సర్వమానవ దేవ దానవులు చేసి ఫలము నొందిన వారు
ఓం: శంకరులు, మండన మిత్రుడు, చంద్రశేఖర సరస్వతి
ఓం: ఎందరో శివ, కేశవ భక్తాగ్రేశ్వర ముక్తులు.

## ఐం

ఐం = మహాసముయోచి శక్తి
ఐం = లోభనాశన శక్తి
ఐం = మహాసద్గుణ శక్తి
ఐం = చిదానందశక్తి
ఐం = లోభనాశు శక్తి
ఐం = అమృత బీజ శక్తి
ఐం = కష్టనష్ట నిర్వకార స్థితి
ఐం = అనుజ్ఞానము (పరాశక్తి)
ఐం = ఆగమవేద కతీతము
ఐం = సదా నిశ్చల మనస్సు
ఐం = ఆణిమాది శక్తులు
ఐం = సర్వ శస్త్ర విల్లంబులు పాశా అంకుశ సర్వ ఆయుధ విద్య
ఐం = పతంజలీ యోగము (పరకాయ ప్రవేశకి చచ్చిఉన్న దేహమున ఆత్మ ప్రవేశ పెట్టుట)
ఐం = పాద పద్మ శక్తి దైవశరణాగతి

ఐం = మహాయోగ శక్తి

ఐం = సర్వస్వ శరణాగతి,

ఐం = సదా భగవత్ సేవాశక్తి

ఐం = భావనోపషిత్, దేవీపాదసేవ

ఐం = భక్తియుక్తి, (అమ్మ రూపమగు మహామాయను
భక్తితో లలితా అనుగ్రహం సంపాదించుట)

ఐం = జ్ఞానవర్ణవ విద్య (శ్రీ లలిత శక్తి)

ఐం = ఆ – మంత్రములే మనువులు

ఐం = అహ శివశక్తి బీజము

ఐం = కౌళ విద్యా బలుల నిచ్చుట జాగ్రత్ స్వప్న సుషుప్తి తురీయావస్థ)

ఐం = కౌళిని – కుల రహితమైన ప్రతీ గుణ ప్రతివ్రత
సర్వదేహ, సర్వ దేశములందు అనేక
రకాల పూజలందుకొన్నది.

ఐం = పరావిద్య – సదాశ్రీ లలితా నామ సాధన శ్వాసలో శ్వాసయగుట

ఐం = శ్రీలలితా దేవిని స్తుతించుట

ఐం = షోడశ కళలు

ఐం = బ్రహ్మ జ్ఞానము

ఐం = సూర్య శక్తి జ్ఞానము

ఐం = పంచ దశా విద్య

ఐం = సత్పురుష శక్తి (బ్రహ్మ చర్యము పాటించుట)

ఐం = దేహమే కుళము కుళమునందు రసా స్వాదన

ఐం = ఇంద్రియ నిగ్రహం( బాహ్య అంతర్గత 10)

ఐం = కౌళవిద్య (బలుల నిచ్చుట)

ఐం = సమయాచరము(వైదికుల సత్వగుణం)

ఐం = శ్రీ విద్య (ప్రతివ్రతలాచరించునది)

ఐం = కుండలినీ శక్తి (వీపు వెనుక మూడు చుట్లతో
నాగ కుండలినీ శక్తి)

ఐం = సహస్రారము (సహస్రము జాన బెత్తెడు దూరంలో

బ్రహ్మ స్వరూపంలో శ్రీలలిత సహస్రకమలవాసి)

ఐం = మాయాభేదన

ఐం = మణిపూరాంతం (మణుల చక్రం శ్రీ లలిత నివాసం)

ఐం = ఆజ్ఞాచక్రము– కనుబొమల మధ్య గురుస్థానం

ఐం = షట్చాక్రాలు (1.స్వాధీష్టాన, 2.మూలాధార, 3.మణిపుర 4.అనాహత, 5.విశుద్ధక, 6.ఆజ్ఞా)

ఐం = తంత్రశక్తి

ఐం = మంత్రశక్తి

ఐం = యంత్రశక్తి

ఐం = బాలామంత్ర శక్తి

ఐం = బగళామంత్రశక్తి

ఐం = రణరంగ నీతి

## హ్రీం

హ్రీం= హ్రీం కారమే రూపముగా గలది.

హ్రీం= నామమే శ్రీ లలిత

హ్రీం= హ్రీంకార ఉద్యాన హంసి – ఎఱ్ఱి కాళ్ళతో నుండు ఆడహంస.

హ్రీం= హ్రీంకార ఉద్యాన నెమలి

హ్రీం= హ్రీంకార నామ సుస్థిర పీఠికపై స్థిరనివాసి

హ్రీం= హ్రీంకార ఉద్యాన లేడి

హ్రీం= హ్రీంకార పంజర చిలుక, ఎఱ్ఱికాళ్ళతో చిలుక

హ్రీం= హ్రీంకార ఉద్యాన పావురము (ఎఱ్ఱి కాళ్ళతో ఆడు పావురము)

హ్రీం= హ్రీంకార గుహనందు సింహిని

హ్రీం= హ్రీంకార గర్భ త్రిమూర్తుల మాత

హ్రీం= హ్రీంకార తీగకు పరాశక్తి

హ్రీం= హ్రీంకార నామము పరానందము

హ్రీం= హ్రీంకార హృదయ ప్రాంగణమునందు దీపము

( అచంచల మణి దీపము)

హ్రీం= హ్రీంకార పద్మము పై తుమ్మెద

హ్రీం= హ్రీంకార గృహనివాసి శ్రీలలిత

హ్రీం= హ్రీంకార నామ ప్రియ

హ్రీం= హ్రీంకారబీజమే శ్రీ లలితా

హ్రీం= హ్రీంకారమునకు బ్రహ్మ విష్ణు శివశక్తి స్వరూప పరాశక్తి

హ్రీం= హ్రీంకార అమృత తత్వము

హ్రీం= హ్రీంకార పుష్ప మధుఫలము.

హ్రీం= హ్రీంకార పద్మమునందు లక్ష్మీదేవి.

హ్రీం= హ్రీంకార అద్దమున ప్రతిబింబము శ్రీలలిత

హ్రీం= హ్రీంకార ఒరనందు వాడి ఖడ్గము

హ్రీం= హ్రీంకార నామ భక్తులకు నర్తకీ ముద్రలతో కనిపించను.

హ్రీం= హ్రీంకార ముత్యపు చిప్పనందు స్వాతివానముత్య పరాశక్తి

హ్రీం= హ్రీంకారమే పరాశక్తి

హ్రీం= హ్రీంకార శరీరముగా గల మూల మంత్రము

హ్రీం= హ్రీంకార బంగారు స్తంభ అచల పగడపు బొమ్మ

హ్రీం= హ్రీంకార విద్యయందు ఉపనిషత్తు

హ్రీం= హ్రీంకార నామ యజ్ఞమునకు దక్షిణ శ్రీ లలిత

హ్రీం= హ్రీంకార నందన వనమందు కల్పవృక్షము

హ్రీం= హ్రీంకార హిమ పర్వత మందు గంగాదేవి (శ్రీలలిత)

హ్రీం= హ్రీంకార సముద్ర కౌస్తుభమణి

హ్రీం= హ్రీంకార మంత్రము సర్వ సంపద ప్రదాయినీ శ్రీలలిత

హ్రీం= హ్రీంకార జప మంత్రులకు పరాబ్రహ్మానందము.

## శ్రీం

శ్రీం= ఇహవిద్య

శ్రీం= శ్రీ విద్య

శ్రీం= అణిమాద సిద్ధులు

శ్రీం=పతంజలీయోగము

శ్రీం=వశినీ మంత్రము

శ్రీం=వశినీ యంత్రము

శ్రీం=వశినీ తంత్రము

శ్రీం=క్షుద్ర దేవతా శక్తులు

శ్రీం=బలుల నిచ్చు కౌళవిద్యా

శ్రీం=సర్వలోకాధిపత్యము

శ్రీం=యజ్ఞముల ఫలము పొంది ఇంద్రపదవి.

శ్రీం=సర్వలోకాధిపత్యక్షణిక శక్తులు

శ్రీం=ఇహలోకాధిపత్యము

శ్రీం=సర్వలోక భోగములు

శ్రీం=మహా ధనపిపాస

శ్రీం=తీవ్రధన కాంక్ష కోరిక

శ్రీం=సర్వ ఐహికానందములు

శ్రీం=సర్వదేవతా ఆధిపత్యము

శ్రీం=రక్తము, బలులు హింసలుతో సర్వము సాధించుట

శ్రీం=సాధ్యముకాని చావు కోరుకొని చివరకు మరణించుట

శ్రీం=వాల్మీకి రామధన దైవము

శ్రీం=పోతన రామధనదైవము

శ్రీం=భారతం నన్నయ్య తిక్కన కోరుకొన్న విద్య

శ్రీం=వేదవ్యాసుడు అష్టాదశ పురాణసిరి

శ్రీం=ఆత్మానంద సిరి

శ్రీం=బ్రహ్మానందసిరి

శ్రీం=పరబ్రహ్మానందసిరి

శ్రీం=ధనకనక వస్తు వాహనసిరి

శ్రీం=ధనలక్ష్మి

శ్రీం=సామ్రాజ్య లక్ష్మి

శ్రీం=ధాన్యలక్ష్మి

సుడిగుండము ఒంటి నాభి మహామాయి, ఏటి[illegible]

అభీష్టము అదియే. తపోశక్తులు ధారవోసి, బ్రహ్మవిష్ణు మహేశులకు సమస్త దేవతలకు ఒక మాతృమూర్తిని, మహా శౌర్యమూర్తిని అందించ పరాతపస్సు చేసి, ఇరువురు ఏకబీజులై, సర్వులను సుఖశాంతుల చూచుటయే వారి అవతార విశేషము. కాది విద్యా పంచదశీ విద్య, జ్ఞానార్ణవ విద్య, శ్రీ విద్యా పదుహారు కళలు కస్తూరి తిలక అష్టమి అర్ధచంద్రాకార ప్రదేశున కామేశుల సమస్తము నిక్షిప్తపరచిరి, పరాబ్రహ్మ జ్ఞానము, కామేశు అస్త్రము, సంజీవినీ విద్య హంస మిత్రమున యోగ్యత కలవారికి జీవాత్మ హంస పరాహంసను చేరుట. శ్రీ లలిత, భగవతి రూపముగా, వీర్యము, యజసు శ్రీయము, జ్ఞానము వైరాగ్యము కామేశు మాంగళ్యతపః ఫలములు. లలాటమున నేత్రమున తెలుచుకున్న వారు మాత్రమే లలితా కామేశులగూర్చి తెలిసికోగలుగుతారు. అమ్మను సదా సర్వస్య శరణాగతి అనుష్ఠితిలో సాగుటయే క్షేమము. అంతకన్న వాస్తవమున పరమానందము వేరొకటిలేదు. ఈరీతి శ్రీ లలితా కామేశులు స్థిర సంకల్పులై పరిపాలించుట, పార్వతీ పరమేశులు, కాళి శివునిపై రీతిన తీరు, రాధా కృష్ణులు ఒకానొక ఇరువురు ఒకరుకొకరు వీక్షించుచురాధ బాటన వ్రేలిపై నిలబడునది. ఇది మానవవైవాహిక, వంశాభివృద్ధిని చేయుటకు, కాని ఆ రూపములు మాయ. సరస్వతీ బ్రహ్మలు విద్యనిత్తురు యోగ్యులైన వారికి మాత్రమే.



## చింతామణి ద్వీపంలో శ్రీ లలితా మంగళ స్వరూపం

నిరాధారమైన చింతామణి ద్వీపంలో చింతామణి ద్వీపంలో అమృత సరస్సులో బంగారు ముత్యాల, అనేకనేక, కల్పతరుపుష్పాలు, అనేకానేక ప్రాకార మధ్యగా దివ్యాతి దివ్య మహాసౌందర్య రాశి, చిదగ్నికుండ సంభూత మాతా మహారాజ్ఞికి, వ్యోమకేశికి పద్మరాగమణి కిరీటికి, నిడుపైన నల్లని త్రాచువంటి జడకు, రతనాల చింతామణి, రతనాల ముద్రల జడకు నవరత్నాల జడగంటల చిరునవ్వేడి మణి మహాకటక కిరీటికి చంద్రవంక, ఫాల భాగాన కస్తూరి గంధ సహిత తిలకము,

విశాల నేత్రాల సోగకన్నుమీన నేత్రి మీన నేత్రికి కస్తూరి చందన కాటుక సోగల, మంగళతోరణాలై విల్లువలె వంగిన కనుబొమ్మలు, విరిసీ విరియని సూటికా సొంపైన నాశికకు నత్తుబేసరి అడ్డబాసల, మౌక్తికమణి నక్షత్ర కాంతుల తిరస్కరించు చుండె, తాంబూల వొంపులు తిరిగిన ముద్దు అధరాల రంగు పద్మరాగ కెంపుల మేలు కలయికగా, తెల్లని పలువరుస తళుక్కుమనే మోహన చిరునగవుతో చుబుకమును పోల్చుటకు లేనేలేదు, అద్దాల పద్మరాగ చెక్కిళ్ళు, కర్ణము పైభాగాన కడిమి రతన గుత్తి కర్ణాలకు చంద్ర, సూర్యరతన కుండలలాలు, చతుర్భుజాల, రతనాల భుజకీర్తులు, వెనుక కుడి ఎడమల అంకుశ పాశ హస్తముందు భాగాన కుడివెంపున అంబుల పొది, ఎడమ భాగాన ఎఱ్ఱని చెఱకు విల్లు, హస్తాలకు రతనాల ముద్రలగాజులు, వేళ్ళకు రతనాముద్రల మురిడీ గొలుసుల ఉంగరాల కంకణాలు, శంఖాకార కంఠాన చింతామణి పతకము, ముత్యాలు జాలువార ముత్యాల హారము, కామేశ బద్ధ మాంగళ్యమణిమయ పవిత్ర చిహ్నాల మంగళసూత్రాల, అనేక రతన వజ్రవైఢూర్య హారాలు, ఉత్తుంగ వక్షస్థలి రతనాలు నూగారు బంగారు తీగలా సాగిన నడుము, భుజములకు రతనాల ముద్రికల వంకీలు చిరుధ్వని మణులు, నడుమునకు ముమ్మారు ఎఱ్ఱని పట్టు సుతిమెత్తని పట్టు వస్త్రము, ఎఱ్ఱని పట్టుచీర ఎఱ్ఱని రవికె రతనాల అంచులతో అనేకకోట్ల సూర్యకాంతుల మేలిమి కలయిక కలనేత పట్టుచీర, మొలల నూలుకు రతనాల ముద్రల మణిమేఖలాల జాలరులు, జాలరులకు మధ్య చిరు సవ్వడుల మణులు, పాద పద్మాలకు రతనాల ముద్రల జాలరుల చిరుసవ్వడుల మణులు, వజ్ర వైఢూర్య మణిఖచిత సింహాసనమున, నవరత్నాలు పొదగబడిన బంగారు పీఠికపై పాదముంచి, సాంబ్రాణి సువాసనా పరిమళాలతో, సాంబ్రాణి మేఘాల మధ్య మహోన్న అతిలోక సౌందర్యరాశి.



# సౌందర్యలహరి

శ్లో॥ శివ శ్శక్త్యాయుక్తో యది భవతి శక్తః ప్రభవితుమ్
న చే దేవం దేవో నఖలు కుశల స్పందితు మపి
అతస్త్వా మారాధ్యాం హరిహర విరించాదిభిరపి
ప్రణంతుం స్తోతుం వా కథమకృతపుణ్యః ప్రభవతి 1

శక్తి స్వరూపిణివైన పరమేశ్వరీ! శక్తియుక్తుడైన నాడే శంకరుడు సృష్టి కార్యాన్ని చేయుగలుగుతాడు. అలా కానినాడు అతడు చలించడానికి కూడా అశక్తుడే అవుతాడు, కనుకనే హరిహర హిరణ్య గర్భులచే ఆరాధించదగిన నిన్ను - పూర్వజన్మలో పుణ్యం చెయ్యనివాడు స్తుతించడానికి కూడా అసమర్థుడే అవుతాడు. 1

శ్లో॥ తనీయాంసం పాంసుం తవ చరణ పంకేరుహభవమ్
విరించి స్సంచిన్వన్ విరచయతి లోకా నవికలమ్
మహత్యేనం శౌరిః కథమపి సహస్రేణ శిరసామ్
హర స్సంక్షుద్యైనం భజతి భసితోద్ధూలనవిధిమ్ 2

అమ్మా! భవదీయ పాదకమల రజాన్ని లేశమాత్రంగా గ్రహించి బ్రహ్మ విశ్వాలన జగరూకుడై సృజిస్తున్నాడు. ఆధూళినే సదాశివుడు విభూతిగా శరీరమంత పూసుకుంటున్నాడు. 2

శ్లో॥ అవిద్యానా మంత స్తిమిర మిహిర ద్వీపనగరీ
జడానాం చైతన్య స్తబక మకరంద శృతి ఝరీ
దరిద్రాణాం చింతామణి గుణనికా జన్మజలధౌ
నిమగ్నానాం దంష్ట్రామురరిపు రాహస్య భవతి 3

ఓ మాతా! భవదీయ పాదధూళి అజ్ఞాన రూపాంధకారంలో పరిభ్రమించే వా భాస్కరుడు తేజరిల్లే నగరంగానూ, మూర్ఖులకు జ్ఞానం అన్న పుష్పగుచ్ఛా మధుధారా ప్రవాహంగాను, దరిద్రులకు చింతామణి సదృశంగాను, సంసా సాగరంలో మునిగిపోయినవారికి వరాహమూర్తియైన శ్రీహరి దంష్ట్రగా అవుతూన్నది.

శ్లో॥ త్వదన్యః పాణిభ్యా మభయవరదో దైవతగణ -
స్త్వమేకా నైవాసి ప్రకటిత వరాభీత్యభినయా

భయాత్ త్రాతుం దాతుం ఫలమపి చ వాంఛా సమధికమ్ .
శరణ్యే లోకానాం తవ హి చరణా వేవ నిపుణౌ 4

సమస్త జగత్తులనూ సంరక్షించేదానా! నువ్వు వినా అన్యులగు దేవతలు తమ హస్తాలతో వరాలను ప్రసాదిస్తూంటారు. నువ్వంటావా? వర అభయాలను ప్రకటించి అభినయించే దానవు కాదు. దానికి హేతువు ఏమందువా? నీ శ్రీచరణాలే భయాన్నుండి సంరక్షించడానికిని అభీష్టాలకు మించిన సత్ఫలాలను ప్రసాదించడంలోనూ నిపుణత్వం కలిగి ఉన్నాయి. 4

శ్లో॥ పూర్తి స్త్వా మారాధ్య ప్రణతజన సౌభాగ్యజననీమ్
పురా నారీభూత్వా పురిపుమపి క్షోభ మనయత్
స్మరోపి త్వాం నత్వా రతినయన లేహ్యేన వపుషా
మునీనా మప్యంతః ప్రభవతి మోహాయ మహతామ్ 5

జననీ! భక్తజనులకు సౌభాగ్యాలను ప్రసాదించే నిన్ను ఆరాధించియే - శ్రీహరి పూర్వం తాను సుందరాంగియై సదాశివుని కూడా కలవరపరిచాడు. నీకు వందన మాచరించియే - మదనుడు రతీదేవికి నయన మనోహరుడై, మహనీయులైన మహర్షుల మనస్సులను కూడా మోహింపజేశాడు. 5

శ్లో॥ ధనుః పౌష్పం మౌర్వీ మధుకరమయీ పంచ విశిఖా
వసంత స్సామంతో మలయ మరుదాయోధనరథః
తథాప్యేక స్సర్వం హిమగిరిసుతే కామపి కృపా
మపాంగా త్తే లబ్ధ్వా జగదిద మనంగో విజయతే 6

ఓ హిమగిరి తనయా!పూవింటితో, భ్రమర సముదాయమే నారి కాగా, పంచబాణాలతో, వసంతుడు – సామంతుడు కాగా మలయ మారుతం – రదన రథంగా ఉన్నప్పటికీ – నీ అపాంగావలోకనంకల – మన్మథుడు నీ కరుణకు పాత్రుడై – ఈ జగత్సర్వ స్వాన్నీ జయిస్తూన్నాడు ( తల్లీ! నీదయ ఉంటే ఎంతటి సుకుమారుడైనా ఏమైనా చెయ్యగలడని బావము) 6

శ్లో॥ క్వణత్కాంచీదామా కరికలభ కుంభస్తన నతా
పరిక్షీణా మధ్యే పరిణత శరచ్చంద్ర వదనా

ధనుర్బాణా న్పాశం సృణిమపి దధానా కరతలైః
పురస్తా దాస్తాం నః పురమధితు రాహోపురుషికా 7

మ్రోగుతున్న బంగారు మొలత్రాడు కలదీ గున్న ఏనుగు కుంభస్థలాల వంటి కుచాలతో వంగియున్నదీ, సన్నని నడుము కలదీ, శరత్పూర్ణిమా చంద్రునివంటి వదనారవిందం కలదీ, హస్తాలలో పాశాంకుశాలను ధరించి నదీ, త్రిపురహరుని అహంకార స్వరూపిణి అయిన పర దేవత మా సమక్షంలో (అంటే ధ్యానంలో) ఉండును గాక! 7

శ్లో॥ సుధాసింధో ర్మధ్యే సురవిటపి వాటీ పరివృతే
మణిద్వీపే నీపోపవనవతి చింతామణి గృహే
శివాకారే మంచే పరమశివ పర్యంకనిలయామ్
భజంతి త్వాం ధన్యాః కతిచన చిదానందలహరీమ్ ౮

అమ్మా! అమృతసాగర మధ్య ప్రదేశంలో కల్పతరు పరివేష్టితమైన చింతామణి సదనంలో శివస్వరూప మంచమునందు, పరమశివ పర్యంకంపై తేజరిల్లే నిన్ను చిదానంద (జ్ఞానానంద ప్రవాహ స్వరూపిణి) లహరివైన నిన్ను ధన్యాత్ములు కొందరు ఆరాధిస్తుంటారు. ౮

శ్లో॥ మహీం మూలాధారే కమపి మణిపూరే హుతవహం
స్థితం స్వాధిష్ఠానే హృది మరుత మాకాశ ముపరి
మనోఽపి భ్రూమధ్యే సకలమపి భిత్వా కులపథం
సహస్రారే పద్మే సహ రహసి పత్యా విహరసే ౯

ఓ పరమేశ్వరీ! మూలాధార, మణిపూర, స్వాధిష్ఠాన అనాహత, విశుద్ధ చక్రాలలో క్రమంగా గల భూత, జల, అగ్ని వాయు, ఆకాశ, మనస్తత్త్వాలను అధిగమించి నువ్వు సుషుమ్నా మార్గ సర్వస్వాన్నీ ఛేదించి సహస్ర దళ పద్మంలో ఏకాంతంలో నీ పతిదేవునితో వహరిస్తూంటావు తల్లీ. ౯

శ్లో॥ సుధాధారాసారై శ్చరణయుగళాంతర్విగళితైః
ప్రపంచం సించంతీ పునరపి రసామ్నాయా మహసః
అవాప్య స్వాం భూమిం భుజగనిభ మధ్యుష్టవలయం

స్వ మాత్మానం.కృత్వా స్వపిషి కులకుండే కుహరిణి 10

"ఓం"కార స్వరూపిణీ! నీ చరణయుగళం నుండి ప్రవహిస్తూన్న అమృతరస ప్రవాహంతో సమస్త విశ్వాన్నీ తడుపుతూ పునః చంద్రుని నుండి స్వస్థానాన్ని - అంటే మూలాధారం చేరి సర్పంపై( కుండలిని) గోళాకృతిని దాల్చి సూక్ష్మరంధ్రం కల అధారచక్రంలో శయనిస్తూంటావు తల్లీ. 10

శ్లో॥ చతుర్భిః శ్రీకంఠై శ్శివయువతిభిః పంచభి రపి
ప్రభిన్నాభి శ్శంభో ర్నవభి రపి మూల ప్రకృతిభిః
చతు శ్చత్వారింశ ద్వసుదళ - కళాశ్ర త్రివలయ
త్రి రేఖాబి స్సార్థం తవ శరణకోణాః పరిణతాః 11

మాతా! నాలుగు శివసంబంధమైన కోణాలతో శక్తి సంబంధమైన పంచ కోణాలతో, తొమ్మిది మూల కారణాలతో అష్ట, దశ, షోడశాలచే త్రిరేఖలతో కలిసి నలభైనాలుగుగా పరిణతి చెంది నీ శ్రీచక్రం ఉన్నది. 11

శ్లో॥ త్వదీయం సౌందర్యం తుహినగిరి కన్యే తులయితుం
కవీంద్రాః కల్పంతే కథమపి విరించి ప్రభృతయః
యధా లోకౌత్సుక్యా దమర లలనాయాంతి మనసా
తపోభి ర్దుష్ప్రాపామపి గిరిశ సాయుజ్య పవీమ్ 12

ఓ హిమాద్రిసుతా! అత్యంతం శ్రమించి చతుర్ముఖాది కవి పుంగవులు నీ సౌందర్య సామ్యానికై కల్పనలు చేస్తూన్నారు. తపస్సు వల్ల కూడా సాధ్యం కాని శివసాయుజ్యాన్ని అప్సరాంగనలు భవదీయ సౌందర్య సందర్శన మాత్రంచే పొందగలుగుచున్నారు. 12

శ్లో॥ నరం వర్షీ యాంసం నయనవిరసం నర్మసు జడం
తవా పాంగాలోకే పతిత మనుధావంతి శతశః
గళద్వేణీబంధాః కుచకలశ విస్రస్త చయా
హఠాత్తృట్యత్కాంచో విగళితదుకూలా యువతయః 13

ఓ తల్లీ! మానవుడు వృద్ధుడైనా, కురూపి అయనా ఆడడంలో జడుడైనా, సరే, నీ దృష్టి వానిపై బడితే చాలు శతాధిక సంఖ్యలలో యువతులు వీడిన

జడముడులతో, కుచాలపై గల పైటలు జారిపోతున్నా, మొలత్రాడులు తెగిపడిపోతున్నా, కట్టుకున్న వస్త్రాలు ఊడిపోతున్నా అట్టి వాని వెంట పడిపోతారు కదమ్మా (ఇక్కడ కామకళ అయిన 'ఈం' వైపు సంకేతము జరుగుచున్నది). 13

శ్లో॥ క్షితౌషట్పంచాశా ద్విసమధిక పంచాశ దుదకే
హుతాశే ద్వాషష్టి శ్చతు రధిక పంచాశ దనిలే
దివి ద్విష్షట్ త్రింశ న్మనసి చతుష్షష్టి రితి యే
మయూఖాస్తేషా మప్యు పరి తవ పాదంబుజ యుగమ్ 14

అమ్మా! పృథ్వీ తత్వంలో యాభై ఆరు జలతత్త్వంలో యాభై రెండు, అగ్ని తత్వంలో అరవై రెండు, వాయుతత్త్వంలో ఏభై నాలుగు, ఆకాశతత్త్వంలో డెబ్భై రెండూ మనస్తత్వంలో అరవై నాలుగు ప్రకాశాలూ తేజరిల్లే స్థానో పరిభాగంలో నీ చరణ కమలాలు రాజిల్లుతుంటాయి. 14

ఇక్కడ నుండి 3 శ్లోకాలలో వాక్సిద్ధి వర్ణన జరిగింది. 15వ శ్లోకంలో సాత్త్విక, 16వ శ్లోకంలో రాజసిక, 17వ శ్లోకంలో మిశ్రిత భావ యుక్తకవితా శక్తి వికాస వర్ణన జరిగింది.

శ్లో॥ శరజ్జ్యోత్స్నా శుద్ధాం శశియుత జటాజూటమకుటామ్
వరత్రాసత్రాణస్పటిక ఘటికా పుస్తకకరామ్
సకృన్నత్వా నత్వా కథమివం సతాం సన్నిదదధతే
మధుక్షీర ద్రాక్షామధురిమధురీణాః ఫణితయః 15

శరత్కాలంలోని వెన్నెలవలె శుభ్రమై, చంద్రునితో కూడిన జటాజూటా రూపకిరీటంతో, హస్తాలలో వర అభయ ముద్రలను దాల్చి, స్పటికమాలనూ, పుస్తకాలనూ ధరించిన నీకు ఒక్కసారి అయినా ప్రణమిల్లకపోతే – మధు, క్షీర, ద్రాక్షా సదృశ్యమైన మధుర వచనాలు కవులకు ఎలా సిద్ధిస్తాయి తల్లీ! (అంటే నీ కరుణ లేనివారు కవిత్వానికి అనర్హులని భావము) 15

శ్లో॥ కవీంద్రాణాం చేః కమలవనబాలాతప రుచిమ్
భజంతే యే సంతః కతిచి దరుణా మేవ భవతీమ్

విరించి ప్రేమస్యా స్తరుణతర శృంగార లహరీ
గంభీరాభి ర్వాగ్భి ర్విదధతి సతాం రంజన మమీ 16

కవీంద్రుల చిత్తరూపమైన కమలవనాన్ని వికసింప జేయడానికి బాల భాస్కర సదృశ అరుణ రూపిణివైన నిన్ను సేవించే మహాపురుషులే బ్రహ్మ ప్రియురాలైన సరస్వతి యొక్క తరుణ తర శృంగార లహరి నుండి బహిర్గతమైన గంభీర కవితల ద్వారా సద్పురుషులకు మనో రంజనం చేయుగలుగుతారమ్మా! ( ఇక్కడ కామకూట దేవి యొక్క ఇచ్ఛాశక్తి ధ్యానం వ్యక్తం చెయ్యబడింది. ) 16

శ్లో॥ సవిత్రీభి ర్వాచాం శశిమణి శిలాభంగ రుచిభిః
వశిన్యాద్యాభిస్త్వాం సహ జనని సంచింతయతి యః
సకర్తా కావ్యానాం భవతి మహతాం భంగి రుచిభిం:
వచోభి ర్వాగ్దేవీ వదన కమలామోద మధురైః 17

వశిన్యాది శక్తులతో చంద్రకాంతమణి స్థగిత శిలామూర్తి సదృశశోభగల ఓ మాతా ఈ విధంగా నిన్ను ధ్యానించ గలవాడు ఉచ్చకోటికి చెందిన కావ్యాలను రచించగలుగుతాడు. వాని సుందర కవిత్వం వాగ్దేవీముఖ కమలం యొక్క ఆమోదపూర్ణమయిన మాధుర్యంతో నిండి ఉంటుంది. ( ఇక్కడ వశిన్యాదిగా గల అష్టవాగ్దేవతలతో సహా భగవతీ స్తుతి ధ్యానోపదేశం జరిగింది. వాగ్దేవతల శోభచంద్రకాంతమణి శోభాసదృశంగా వర్ణితమయినది. ఇది శక్తి కూటదేవి అయిన జ్ఞానశక్తి ధ్యానంగా పరిగణింప బడుచున్నది. ) 17

శ్లో॥ తనుచ్ఛాయాభిస్తే తరుణ తరణి శ్రీ సరణిభిః
దివం సర్వా ముర్వీ మరుణిమ నిమగ్నాం స్మరతి యః
భవంతస్య త్రస్యత్వన హరిణశాలీన నయనాః
సహోర్వశ్యావశ్యాః కతి కతి న గీర్వాణ గణికాః 18

అమ్మా! బాలభాస్కర సదృశప్రభలతో నీదేహకాంతితో భూమ్యాకాశాలను అనుగుణంగా భావించగల వానికి – బెదరిన అడవి జింక కన్నులవంటి కన్నులు గల ఊర్వశి మొదలైన అప్సరసలు కూడ వశమవుతారు. 18

శ్లో॥ ముఖం బిందుం కృత్వా కుచయుగ మధస్తస్య తదధో

హరార్ధం ధ్యాయే ద్యోహరమహిషి తే మన్మథకలామ్
స సత్య స్సంక్షోభం నయతి వనితా ఇత్యతిలఘు
త్రిలోకీ మప్యాశు భ్రమయతి రవీందు స్తనయుగాన్ 19

జననీ! ముఖాన్ని బిందువుగా చేసి దాని అధోబాగంలో స్తనద్వయాన్ని, ఆక్రింది భాగంలో త్రికోణాన్ని - అంటే నీ కామకళనూ ధ్యానించే వాడు శీఘ్రంగా యువతుల చిత్తాలను మథింపజేస్తాడు. ఇది అల్ప విషయము. అంతేకాదు అట్టి సాధనకు సూర్య చంద్రులే కుచాలుగా గల జగత్రయాన్నే భ్రమింపజేసి వేస్తాడు. 19

శ్లో॥ కిరంతీ మంగేభ్యః కిరణనికురుంబామృతరసమ్
హృది త్వామాధత్తే హిమకర శిలామూర్తి మివ యః
స సర్పాణాం దర్పం శమయతి శకుంతాధిప ఇవ
ర్జ్వురప్లుష్టాన్ దృష్ట్యా సుఖయతి సుధాదారసిరయా 20

అమ్మా! నీ దివ్యాంగాల నుండి బహిర్గతమవుతూన్న అమృత రస రూ[illegible] కిరణజాలాన్ని వెదజల్లుతూన్న నిన్ను హృదయంలో ధ్యానించగలవాడు, నీ చంద్ర[illegible] కాంత శిలామూర్తిని వోలె మనసా ధ్యానించ గలవాడు, గరుత్మంతునివలె సర్ప[illegible] దర్పాన్ని అణచి వేసి, నిజామృత ధారలచే దృష్టి మాత్రంచే జ్వరసంతప్తులక[illegible] సుఖాన్ని చేకూర్చుతాడు. 20

శ్లో॥ తటిల్లేఖాతన్వీం తపనశశివైశ్వానరమయీమ్
నిషణ్ణాం షణ్ణా మప్యుపరి కమలానాం తవ కాలామ్
మహాపద్మాటవ్యాం మృది తమల మాయేన మనసా
మహాంతః పశ్యంతో దధతి పరమానందలహరీమ్ 21

ఓ పరమేశ్వరీ, విద్యుల్లతలవంటి శరీరంతో సూర్యచంద్రాగ్ని మయ[illegible] షట్కమలాలకు ఉపరిభాగంలో ఉన్న నీ కళను మహాపద్మారణ్యంలో మలమా[illegible] రహితమై విశుద్ధమైన మనస్సు ద్వారా సందర్శించే మహాత్ములు పరమానందలహ[illegible] ధారణచేస్తూన్నారు. 2[illegible]

శ్లో॥ భవాని త్వం దాసే మయి వితర దృష్టిం సకరుణా
మితిస్తోతుం వాంఛన్ కథయతి భవాని త్వ మితి యః

తదైవ త్వం తస్మై దిశతి నిజసాయుజ్య పదవీమ్
ముకుంద బ్రహ్మేంద్రస్ఫుటమకుట నీరాజితపదామ్ 22

అమ్మా! భవునిరాణీ! నువ్వు ఈ దాసునిపై కూడ నీ కరుణామయి దృష్టిని ప్రసరింపజేయుము. అని ప్రార్థిస్తూ నువ్వే దిక్కు అని పలికే వాణ్ణి నువ్వు శీఘ్రంగా హరిహర హిరణ్యగర్భుల కిరీటాలు స్పృజించిన శ్రీ చరణాలు గల నీ సామీప్య పదవిని ప్రసాదిస్తున్నావు. 22

శ్లో॥ త్వయా హృత్వా వామం వపు రపరితృప్తేన మనసా
శరీరార్థం శంభో రపర మపి శంకే హృద మభూత్
యదేతత్త్వ ద్రూపం సకల మరుణాభం త్రినయనమ్
కుచాభ్యా మానమ్రం కుటిలశసిచూడాలమకుటమ్ 23

ఓ జగన్మాతా! హేతువేదో కాని - భవదీయాకృతి సర్వస్వం అరుణ వర్ణంతోనూ, స్తనభారంచే వంగినదిగా, చంద్రరేఖ కిరీటంగా అమరి ఉండడం చూసి, - గతంలో గ్రహించిన శివదేవుని వామాంగంతో తృప్తిపడక శేషించిన దక్షిణాంగాన్ని కూడా అపహరించినట్లుగ సందేహిస్తున్నాను. 23

శ్లో॥ జగత్సూతే ధాతా హరి రవతి రుద్రః క్షపయతే
తిరస్కుర్వన్నేత త్స్వమపి వపు రీశ స్థిరయతి
సదా పూర్వ స్సర్వం తదిద మనుగృహ్ణాతి చ శివః
తవాజ్ఞా మాలంబ్య క్షణచలితయో ర్భ్రూలతిక యోః 24

ఓ పరమేశ్వరీ, హరిహర హిరణ్య గర్భులు సృష్టి స్థితి సంహారాలు కొనసాగిస్తూన్నారు. ఈశ్వరుడు ఈ కార్య సర్వస్వాన్నీ తిరస్కరించి స్వదేహంలోనే తనను స్థిరం చేస్తూన్నాడు. సదా శివదేవుడు నీ కనుసన్నలను అనుసరించి అనుగ్రహిస్తూన్నాడు. 24

శ్లో॥ త్రయాణాం దేవానాం త్రిగుణజనితానాం తవ శివే
భవే త్పూజా పూజా తవ చరణయోర్యా విరచితా
తథాహి త్వత్పాదోద్వహనమణి పీఠస్య నికటే
స్థితా హ్యేతే శశ్వ న్ముకుళితకరో త్తంస మకుటాః 25

ఓ శివానీ, త్రిగుణాలవల్ల ఉద్భవించిన బ్రహ్మ విష్ణు మహేశ్వరులకు చేయబడే పూజ - నీ పాదారవిందాలకే చేయబడితే అది సరి అయిన పూజ అవుతుంది.

హేతువేమందువా? ఈ ముగ్గురూ మణిఖచిమైన భవదీయ పాదపీఠ సన్నిధిని ముకుళితహస్తులై యుండువారే కదా! 25

శ్లో॥ విరించిః పంచత్వం వ్రజతి హరి రాప్నోతి విరతిం
వినాశం కీనాశో భజతి ధనదో యాతి నిధనమ్
వితంద్రీ మహేంద్రీ వితతిరపి సమ్మీలిత దృశాం
మహాసంసారేఽస్మి న్విహరతి సతి త్వత్పతిరసౌ 26

భువన జననీ! బ్రహ్మ మరణిస్తాడు, విష్ణువు విశ్రాంతి చెందుతాడు. యముడు నాశనమవుతాడు, కుబేరుడు అంతమవుతాడు, ఇంద్రాది బృందారకులు కూడా నాశనమవుతారు, కానీ ఈ మహాసంసారమందు నీ పతిదేవుడగు సదాశివ దేవుడు మాత్రం విహరిస్తూంటడా. 26

శ్లో॥ జపో జల్ప శ్శిల్పం సకలమపి ముద్రావిరచనా
గతిః ప్రాదక్షణ్య క్రమణ మశనాద్యాహ్యహుతివిధిః
ప్రణామ స్సంవేశః సుఖ మఖిలమాత్మర్పణ దృశా
సపర్యా పర్యాయ స్తవ భవతు యన్మే విలసితమ్ 27

అమ్మా! వాగడం, జపించడం, సకల కార్యాలనూ నిర్వహించడం గమనం, ప్రదక్షిణ చేయడమూ భోజనాదులూ, ఆహుతి విధీ, వంగడం, సాష్టాంగ నమస్కారం చెయ్యడం, సుఖం - ఈ సర్వ కార్యాలలో బ్రహ్మార్పణ బుద్ధ్యా నాకు సులభంగా చేయదగినదే నీకు పూజగా మారును గాక! 27

శ్లో॥ సుధా మప్యాస్వాద్య ప్రతిభ యజరామృత్యు హరిణీమ్
విపద్యం తే విశ్వే విధి శత మఖము ఖాద్యా దివిషదః
కరాళం యత్ క్ష్వేళం కబళితవతః కాలకలనా
న శంభోస్తన్మూలం తవ జనని తాటంక మహిమా. 28

పరమేశ్వరీ! బ్రహ్మ, ఇంద్రాది దేవతలందరి కందరూ వార్ధక్యాన్నీ మృత్యువునూ దూరం చేసే అమృతాన్ని పానం చేసి ఆపదలను పొందుతూన్నారు. కానీ భయంకరమైన కాలకూట విషాన్నే మ్రింగిన శివునికి మాత్రం మరణభం లేదు, ఇందులకు హేతువు? తల్లీ నీ తాటంక (చెవి కమ్మల) మహమయే 28

శ్లో॥ కిరీటం వైరించం పరిహార పురః కైటభభిదః
కఠోరే కోటీరే స్ఖలసి జహి జంభారి మకుటమ్

ప్రణమ్రే ష్వేతేషు ప్రసభముపయాతస్య భవనమ్
భవస్యాభ్యుత్థానే తవ పరిజనోక్తి ర్విజయతే 29

అమ్మా, స్వగృహానికి వచ్చే సదాశివునికి స్వాగతం చెబుతూ ఎదురు వెళ్ళే సమయంలో ముకుంద బ్రహ్మేంద్రులు ప్రణమిల్లుతూండగా - ఇది బ్రహ్మమకుటము తప్పుకో ఇది కఠినమైన హరి కిరీటము జారెదవు. ఇది మహేంద్రుని మకుటము అని పలికే పరిచారికల వచనాలు ప్రబలంగా విజయ నాదాలతో వినవస్తుంటాయి.

శ్లో॥ స్వదేహోద్భూ తాభిర్ఘృణిభి రణిమాద్యాభి రభితః
నిషేవ్యే నిత్యే త్వా మహ మితి సదా భావయతి యః
కి మాశ్చర్యం తస్య త్రిణయన సమృద్ధిం తృణయతో
మహా సంవర్తాగ్ని ర్విరచయతి నీరాజన విధిమ్ 30

నిత్యులారా! తల్లీ! నీ దివ్య దేహం నుండి ప్రాదుర్భవించి తేజరిల్లుతూన్న అణిమాది అష్ట విభూతులతో, సర్వే సర్వత్రా విరాజిల్లు తూన్న నిన్ను నేను సేవిస్తూన్నాను అని ఎవరు భావిస్తుంటారో! వారు ఈశ్వర విభవాన్ని గణించనివారు సంవర్తనామక ప్రళయాగ్నిని నీరాజన మివ్వడంలో ఆశ్చర్యం లేదు. 30

శ్లో॥ చతుష్షష్ట్యా తంత్రైః సకలమతి సంధాయ భువనమ్
స్థిత స్తత్తత్సిద్ధి ప్రసవపరతం త్రైః పశుపతిః
పునం స్త్వన్నిర్బంధా దఖిల పురుషార్థైకఘటనా
స్వతంత్ర తే తంత్ర క్షితి తల మవాతీతరదిదమ్ 31

సర్వతంత్ర స్వతంత్రురాలా! పశుపతి సిద్ధులను సృష్టించగల అరవైనాలుగు తంత్రాలతో సకల లోకాలనూ సమకూర్చినాడు. సర్వ పురుషార్థాలనూ సమకూర్చునట్టి నీ యీ తంత్రం పునః నీ నిర్బంధం వల్లనే భూమి అంతటా ఏర్పడి ఉంది.
31

శ్లో॥ శివశ్శక్తిః కామః క్షితి రథ రవి శ్శీతకిరణః
స్మరో హంస శ్శక్ర స్తదనుచ పరామారహరయః
అమీ హృల్లేఖాభి స్తిసృభి రవసానేషు ఘటితాః
భజంతే వర్ణాస్తే తవ జనని నామావయతామ్ 32

మంగళప్రదమైన "క" వర్ణమూ "శక్తి" ని బోధపరచే "ఏ" వర్ణమూ, కామప్రదమైన "ఈ" వర్ణమూ, పృధ్వీ ప్రతిపాదితమైన "ల" వర్ణమూ, తేజస్సుతో కూడిన "హ" వర్ణమూ, శీతలత్వాన్ని చే కూర్చే "స" వర్ణమూ తత్త్వాన్ని సూచించే (క) వర్ణమూ, సూర్య బోధితమగు "హ" వర్ణమూ, ప్రతిభను సువ్యక్తం చేసే "ల" వర్ణమూ, పరబ్రహ్మను సువ్యక్తం చేసే సకల వర్ణాలనూ హ్రాం, హ్రీం హ్రూం అన్న మూడక్షరాలు చివర చేర్చబడినవై నీ నామావయవము లవుతూన్నాయి. 32

శ్లో॥ స్మరం యోనిం లక్ష్మీం త్రితయ మిదమాదౌ తవమనో
ర్నిధాయైకే నిత్యే నిరవధి మహాభోగ రసికాః
భజంతి త్వాం చింతామణి గుణ ని బద్ధాక్షవలయాః 33
శివగ్నౌ జుహ్వంత స్సురభి ఘృదధారాహుతి శతైః

పరమేశ్వరీ! నిత్యులైన యోగీస్వరులు కొందరు – హ్రీం శ్రీం అనే కామబీజ, యోనిబీజ, లక్ష్మీ బీజాక్షర సంపుటితో, చింతామణులతో కూడిన జపమాలతో, కామధేను సంబంధితమైన ఘృతధారలతో శివరూపాగ్నిలో హోమం చేస్తూ నిన్ను 33
ఆరాధిస్తున్నారు తల్లీ.

శ్లో॥ శరీరం త్వం శంభో శ్శశిమిహిరవక్షోరుహయుగమ్
తవాత్మనం మన్యే భగవతి నవాత్మన మనఘమ్
అత శ్శేష శ్శేషీ త్వయ ముభయ సాధారణతయా 34
స్థిత స్సంబంధో వాం సమరసపరానందపరయోః

అమ్మా! సూర్యచంద్రులే స్తనయుగ్మంగాగల పరమ శివుని అర్ధాంగివి. ఆ కారణంచే నీ పరమ పావన రూపాన్ని నవ వ్యూహాత్మకంగా స్మరిస్తున్నాను. కావున సమరసులూ, పరమ ఆనంద దివ్య స్వరూపులూ అయిన మీ యిర్వురికీ శేష 34
శేషిత్వ సంబంధం సనాతనమైనది.

శ్లో॥ మనస్త్వం వ్యోమ త్వం మరు దసి మరుత్సారథి రసి
త్వమాప స్త్వం భూమి స్త్వయిపరిణతాయాం నహి పరం
త్వమేవ స్వాత్మానం పరిణమయితుం విశ్వవపుషా 35
చిదానందాకారం శివయువతి భావేన బిభృషే.

అర్ధనారీ స్వరూపిణీ! మన, ఆకాశ వాయురగ్ని జల పృథ్వీ తత్వాలుగా పరిణతి చెందుతన్నావు. నీ కంటే భిన్నమైన అన్య పదార్థం ఏదీలేదు. స్వాత్మను నువ్వే విశ్వరూపంగా మార్చుకోవడానికి భావన మాత్రం చే చిదానందం మూర్తిని ధరిస్తున్నావు.

శ్లో॥ తవాజ్ఞాచక్రస్థం తపన శశికోటి ద్యుతిధరమ్
పరం శంభుం వందే పరిమిళిత పార్శ్వం పరచితా
యమారాధ్య న్భక్త్యా రవిశశి శుచీనా మవిషయే
నిరాలోకేఽ లోకే నివసతి హి భాలోక భువనే. 36

అమ్మా! నీ అజ్ఞాచక్రంలో విరాజిల్లుతూ కోటి సూర్యచంద్రుల తేజంతో భాసిల్లే పరశివమూర్తిని ధ్యానిస్తున్నాను. అతని వామభాగం పరచితితో మిళితమై యున్నది. ఆరాధించేవారు సూర్య చంద్రాగ్నుల ప్రకాశానికి అతీతమైన లోకంలో నివశిస్తారు. ఆ పరమ శివదేవుడు సూర్య చంద్రాగ్ని ప్రకాశాలను అధిగమించిన మహత్తర తేజంతో భాసిల్లుతూంటాడు. అక్కడ విఘ్నబాధలేవీ ఉండవు. 36

శ్లో॥ విశుద్ధౌతే శుద్ధ తే శుద్ధ స్పటిక విశదం వ్యోమజనకమ్
శివం సేవే దేవీ మపి శివసమాన వ్యవసితామ్
యయోః కాంత్యా యాంత్యా శశికిరణ సారూప్య సరణేః
విధూ తాంతర్ధ్వాంతా విలసతి చకోరీవ జగతీ 37

అమ్మా! నీ విశుద్ధ చక్రంలో ఆకాశతత్వ జనకుడై, శుద్ధస్పటిక సదృశ్యంగా స్వచ్ఛంగా తేజరిల్లే పరమ శివునీ, అతనితో సమంగా సువ్యస్థితురాలవగు నిన్నూ నేను సేవిస్తాను. తల్లీ! మీ యిరువురి చంద్రకిరణ సదృశ్య ప్రకాశంతో అంధకారం దూరం కాగా చకోరివలె జగత్సర్వం ఆనందిత మవుతుంటుంది. 37

శ్లో॥ సమున్మీలత్సం విత్కమల మకరందైక రసికమ్
భజే హంసద్వంద్వం హిమపిమహతాం మానస చరమ్
యదాలాపా దష్టాదశ గుణిత విద్యాపరిణతి
ర్య దాదత్తే దోషా ద్గుణ మఖిల మద్భ్యః పయ ఇవ. 38

పరమేశ్వరీ! హృద్దేశంలో వికసితమై ఉన్న సంవిత్ కమలం నుండి స్రవించే మకరందానికి ఏక మాత్ర రసికులైన ఆ హంసద్వంద్వాన్ని నేను భజిస్తున్నాను.

అది మహాపురుషుల మనోరూప మానస సరోవరంలో విహరిస్తూంటుంది. దాని వార్తా లాప పరిణామమే అష్టాదశ మహా విద్యల వ్యాఖ్య. ఆ ద్వంద్వం జలమిశ్రిత క్షీరాలనుండి పాలను పూర్తిగా వేరు చేయునట్లు దోషాలనుండి గుణాలను వేరు చేస్తుంది. 38

శ్లో॥ తవ స్వాధిష్ఠానే హుతవహ మధిష్ఠాయ నిరతమ్
తమీడే సంవర్తం జనని మహతీతం తాం చ సమయామ్
యదాలోకే లోకాన్ దహతి మహాతి క్రోధ కలితే
దయార్ద్రా యా దృష్టి శ్శిశిర ముపచారం రచయితి 39

ఓ జననీ! ఏ నీ స్వాధిష్ఠాన చక్రంలలో అగ్ని తత్వాన్ని అధిష్ఠానంలో (ప్రభావంలో) ఉంచడానికి గాను సంవర్తాగ్ని తేజరిల్లుతూంటుందో - దానినీ, ఆ మహత్తర సమయా దేవినీ నేను స్తుతిస్తూన్నాను. మహాక్రోధంతో సంవర్తాగ్ని లోకసర్వస్వాన్నీ దగ్ధం చేయబూను నాడు సమయాదేవి నిజ దయార్ద్ర దృష్టితో శీతలోపచారాలు చేస్తుంది. 39

శ్లో॥ తటిత్వంతం శక్త్యా తిమిరపరిపంథి స్ఫురణయా
స్ఫుర న్నానా రత్నా భరణ పరిణద్ధేంద్ర ధనుషమ్
తవ శ్యామం మేఘం కమపి మణిపూరైక శరణమ్
నిషేవే వర్షంతం హరిమిహిర తప్తం త్రిభువనమ్ 40

అమ్మా! ఈ మణిపూరక చక్రాన్ని ఆశ్రయించిన శ్యామ మేఘాన్ని (కం జలాన్ని) కూడ నేను సేవిస్తాను. దానిలో అంధకారానికి శత్రువైన విద్యుల్లతల ప్రకాశమూ, ఆభరణాలలో పేర్చబడిన వివిధ రత్నాల ప్రకాశ సదృశ ప్రకాశమూ ఇంద్రధనుస్సు యొక్క రూపాన్ని దాల్చి ఉంది. అది సూర్యాగ్ని సంతప్తమై జగతుల్లపై శీతల జలధారలను వర్షింప చేస్తుంది. 40

శ్లో॥ తవాధారే మూలే సహ సమయయా లాస్యపరయా
నవాత్మానం మన్యే నవరస మహాతాండవ నటమ్
ఉభాభ్యామే తాభ్యా ముదయ విధి ముద్దిశ్య దయయా
సనాథాభ్యాం జజ్ఞే జనక జననీ మజ్జగ దిదమ్ 41

నీ మూలా ధారచక్రంలో లాస్య పరా అంటే నృత్యం చేసే సమయా దేవితో కూడి నవరస పూర్ణమైన తాండవ నృత్యం చేసే నటేశ్వర నవాత్ముడగు శివదేవుని

నేను చింతన చేస్తూన్నాను. ఈ జగతుత్కు జననీ జనకులవంటి మీ యిరువురి కరుణా కటాక్ష వీక్షణాలకు పాత్రులు కావడం వల అది సనాథంగా భావించబడు చున్నది. 41

మకుట ధ్యానము

శ్లో॥ గతై ర్మాణిక్యత్వం గగన మణిభి స్సాంద్రఘటితమ్
కిరీటం తే హైమం హిమగిరి సుతే కీర్తయతి యః
స నీడే యచ్ఛాయా చ్ఛురణశబలం చంద్రశకలమ్
ధనుః శౌనాసీరం కిమితి న నిబధ్నాతి ధిషణామ్ 42

ఓ హిమగిరిసుతా! నీ సువర్ణ కిరీటాన్ని వర్ణించువాడు - ఇంద్రధనుస్సు బహిర్గతమైనదా? అని ఏల భావించడు? కారణం? ఆ కిరీటం గగన మణులు అంటేతారాగణ రూపమణులతో పొదగబడి చంద్రశకలంతో నిర్మించబడ్డ పక్షి గూడులా కనిపిస్తూన్నది. అది ఉషః కాల ప్రకాశంతో చిత్ర విచిత్ర వర్ణాలతో ప్రకాశిస్తున్నది. 42

కేశ ధ్యానము

శ్లో॥ ధునోతు ధ్వాంతం న స్తులిత దళితేందీవరవనమ్
ఘనస్నిగ్ధశ్లక్ష్ణం చికురనికురుంబం తవ శివే
యదీయం సౌరభ్యం సహజ ముపలబ్ధుం సుమనసో
వసంత్యస్మి న్మన్యేవ లమథన వాటీవిటపినామ్. 43

మంగళాలను ప్రసాదించు ఓ దేవి! నందన వన వికసిత సుందర సుమాలు - సహజమైన నీ కురుల సుగంధాన్ని పొందడానికి నీ కేశ పాశాన్ని అలరించి వసించుచున్నవని భావిస్తూన్నాను. వికసించిన కలువలతో సమమై, సాంద్రమై మృదువైన నీ కేశపాశం మా అజ్ఞానాన్ని దూరం చేయును గాక! 43

సింధూర ధ్యానము

శ్లో॥ తనోతు క్షేమం న స్తవ వదనసౌందర్యలహరీ
పరీవాహ స్రోతస్సరణి రివ సీమంతసరణిః
వహంతీ సిందూరం ప్రబల కబరీ భారతిమిర
ద్విషాం బృందైర్బందీకృత మివ నవీనార్క కిరణమ్ 44

ఓ గిరి రాజనందినీ! నీటి జాలులా ఉన్న పాపటబాట, సాంద్రమైన కేశబంధం

యొక్క నల్లదనమనే వైరి బృందంచే బంధింపబడ్డ బాల భాస్కర కిరణాలవల ఉన్న సింధూర తిలకం గల నీ వదన సౌందర్య ప్రవాహం ఆకు క్షేమాన్ని ప్రసాదించును గాక! 43

అలకల ధ్యానము:

శ్లో॥ అరాళైస్స్వాభావ్యా దళికలభ సశ్రీభి రలకైః
పరీతం తే వక్త్రం పరిహసతి పంకేరుహరుచిమ్
దరస్మేరే యస్మిన్ దశనరుచికింజల్క రుచిరే
సుగంధౌ మాద్యంతి స్మరమథనచక్షు ర్మధులిహాః 45

సహజంగా వంకీలు తిరిగినదీ, మత్తభ్రమర కాంతియుక్తమైన అలకావళీ పరివేష్టితమైన నీ వదనం కమల శోభను పరిహసిస్తున్నది, స్ఫటిక సదృశ శోభగల దంతపంక్తితో యీ షన్మందహాసం చేసే వేళలో బహిర్గతమవుతూన్న సుగంధానికై – మదనాంతకుడగు పరమ శివదేవుని నేత్ర రూప భ్రమరాలు మత్తిల్ల సాగుతాయి. 45

లలాట ధ్యానము

శ్లో॥ లలాటం లావణ్యద్యుతి విమల మాభాతి తవ య
ద్ద్వితీయం తన్మన్యే మకుటఘటితం చంద్రశకలమ్
విపర్యాసన్యాసా దుభయమపి సంభూయ చ మిథః
సధా లేపస్యూతిః పరిణమతి రాక హిమకరః 46

విశ్వజననీ! లావణ్య కాంతితో కూడినదై, విమల ప్రకాశం కల నీ లలాటాన్ని నేను – కిరీట స్థగితమైన ద్వితీయ చంద్రకళగా భావిస్తూన్నాను. ఈ రెండూ క్రింద పైన ఉండడం వల్ల పరస్పరం మిళితమై అమృత లేపనం చేసిన పూర్ణ చంద్ర బింబంలా కనిపిస్తున్నాయి.

త్రినేత్ర ధ్యానము

శ్లో॥ భ్రువౌ భుగ్నే కించి ద్భువనభవభంగ వ్యసనిని
త్వదీయే నేత్రాభ్యాం మధుకర రుచిభ్యాం ధృతగుణం
ధనుర్మన్యే సవ్యే తరకర గృహీతం రతిపతేః

ప్రకోష్ఠే ముష్టౌ చ స్థగయతి నిగూఢాంతర మమే 47

అమ్మా! నీవు జగత్తులకు భయాన్ని ప్రసాదించే దానవు. నీ కనుబొమలు యించుక వంగి మన్మథుని దక్షిణ హస్తంలోని ధనుస్సుగా ఉన్నాయి. ఆ ధనస్సుకు నీ నయనాలే నారిత్రాడు. వాటిమధ్య బాగము పిడికిలికాగా ముంజేయి క్రింద దాగి ఉన్నది.

శ్లో॥ అహస్సూతే సవ్యం తవ నయన మర్కాత్మకతయా
త్రియామాంవామం తే సృజతి రజనీ నాయకతయా
తృతీయా తే దృష్టి ర్దరదలిత హేమాంబుజరుచిః
సమాధత్తే సన్ధ్యాం దివస నిశయో రన్తరచరీమ్ 48

అమ్మా! నీ దక్షిణ నేత్రం సూర్యాత్మకం కావడం వల పగలూ, వామనేత్రం చంద్రాత్మక మవడం వల్ల రాత్రీ ఏర్పడుచున్నవి. ఈషద్వికసిత సువర్ణ నిర్మిత కమల సదృశ శోభాయుక్తమైన నీ తృతీయ నేత్రం అహోరాత్రులకు మధ్య నుండు సంధ్య అగుచున్నది. 48

శ్లో॥ విశాల కల్యాణీ స్ఫుటరుచి రయోధ్యా కువలయైః
కృపాధారాఽఽ ధారా కిమపి మధురాఽఽ భోగవతికా
అవన్తీ సృష్టిస్తే బహునగర విస్తార విజయా
ధ్రువం తత్తన్నామ వ్యవహరణయోగ్యా విజయతే. 49

తల్లీ! నీ దృష్టి విశాలమైనది, కల్యాణప్రదమైనది, వికసిత కమల శోభను ఉపమానంగా యీయడం కన్న మిన్న అయినది. అజేయమైనది. కృపాధార సదృశ ధారానగరము, యీషత్మాధుర్యం కల మధురా నగరము, భోగవతి, సర్వులనూ సంరక్షించునట్టి అవంతిక, అనేక నగరాలను జయించునట్టి విజయ అయి ఉన్నావు. నిశ్చయంగా ఈ ప్రత్యేక నగర నామాలతో సంభోధితురాలవై నానార్థాలతో సందేహాలను హరించ యోగ్యురాలవై యున్నావు. అంటే ప్రత్యేక నామం భావసూచకమై ఉంది.

శ్లో॥ కవీనాం సన్దర్భస్తబక మకరన్దైకరసికమ్
కటాక్షవ్యాక్షేపభ్రమరకలభౌ కర్ణయుగళమ్
అముఞ్చన్తౌ దృష్ట్వా తవ నవరసాఽఽస్వాదతరళౌ

అసూయా సంసర్గాదలిక నయనం కిఞ్చిదరుణమ్॥ 50

జననీ! కవుల కవితారూప గుచ్ఛం నుండి బహిర్గతమగునట్టి సుగంధ రసికులు -- కర్ణస్థానాలను విడనాడకుండుటచే భయదీయ కటాక్ష విక్షేపయుక్త వక్రదృష్టితో చూడడం వల్ల - భ్రమర సదృశమై షడ్రసోపేతమైన రసాస్వాదన చేయుటకు విహ్వాలమగునట్టి చంచల నేత్ర ద్వయాన్ని చూసి ఈర్ష్యా సంసర్గంచే నీ (తృతీయ) మస్తకం కల నేత్రం యీషదరుణారుణమగుచున్నది. 50

శ్లో॥ శివే శృఙ్గారార్ద్రా తదితరజనే కుత్సనపరా
సరోషా గఙ్గాయం గిరీశ చరితే విస్మయవతీ
హరాహిభ్యో భీతా సరసిరుహసౌభాగ్య జననీ
సఖీషు స్మేరా తే మయి జనని! దృష్టిస్సకరుణా॥ 51

మాతా! శివుని యెడల నీ దృష్టి శృంగారార్ద్రమై, గంగపై రోషంగా, శివలీలలయందు విస్మయం ప్రకటించునట్టి, శివుడు దాల్చిన భుజగాలను చూసి భీతిల్లుచు, కమల శోభను పరాజితం చేయునట్టి, సఖుల ఎడ మందస్మితం కలిగి ఉన్నది, ఓ జననీ నా యందు కరుణాయుక్తమై నీ దృష్టి ఉన్నది. 51

శ్లో॥ గతే కర్ణాభ్యర్ణం గరుత ఇవ పక్ష్మాణి దధతీ
పురాం భేత్తుశ్చిత్త ప్రశమరస విద్రావణఫలే
ఇమే నేత్రే గోత్రాధర పతికులోత్తంస కలికే
తవాకర్ణాకృష్టస్మరశర విలాసం కలయతః॥ 52

పర్వత రాజవంశ ప్రముఖ కాళికా! బాణ సదృశమైన నీ నేత్ర ద్వయం ఆకర్ణాంతం వ్యాపించి భంగపరచే ఫలయుక్తమై ఉన్నది. ఆకర్ణాంతం [illegible] మదనుని శరాలవలె నీ నేత్రాలు పనిచేస్తున్నాయి. 52

శ్లో॥ విభక్తత్రైవర్ణ్యం వ్యతికరితలీలాఞ్జనతయా
విభాతి త్వన్నేత్ర త్రితయమిద మీశానదయితే
పునస్స్రష్టుం దేవాన్ ద్రుహిణ హరిరుద్రానుపరతాన్
రజస్సత్త్వం బిభ్రత్తమ ఇతి గుణానాం త్రయమివ 53

ఓ ఈశానుని అర్ధాంగివైన తల్లీ, నీ యీ త్రినేత్రాలూ త్రివర్ణ యుక్త అంజనాన్ని

అలంకరించుకోవడం వల్ల వేరు వేరుగా త్రివర్ణాలతో మెరసిపోతున్నాయి. మహా ప్రళయాంతంలో బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ఉపరతులైపోగా మరల సృష్టివేళలో వారిని ప్రాదుర్భవింపజేయుటకు ఆ వర్ణాలు రజస్సత్వతమో గుణాలను ధరించినట్లు ప్రతీతముగు చున్నవి. 53

శ్లో॥ పవిత్రీకర్తుం నః పశుపతి పరాధీనహృదయే
దయామిత్రై ర్నేత్రైరరుణధవల శ్యామరుచిభిః
నదశ్శోణో గంగా తపన తనయేతి ధ్రువమయమ్
త్రయాణాం తీర్థానా ముపనయసి స్భేద మనఘమ్॥ 54

పశుపతి అయిన శంకర భగవానుని పరాధీనంలో హృదయాన్ని సమర్పించినదేవీ! అరుణ, శుక్ల, శ్యామ వర్ణశోభతోకూడి దయాపూర్ణమైన స్వనేత్రాలలో శోణ, గంగ, యమునా నదులనే మూడు తీర్థాల సంగమస్థానాన్ని మమ్మూ పవిత్రం చేయడానికే నువ్వు పవిత్ర సంగమాన్ని నిర్మిస్తున్నావు. 54

శ్లో॥ నిమేషోన్మేషాభ్యాం ప్రలయముదయం యాతి జగతీ
తవేత్యాహుస్సన్తో ధరణిధర రాజన్యతనయే
త్వదున్మేషాజ్జాతం జగదిద మశేషం ప్రళయతః
పరిత్రాతుం శంకే పరిహృతనిమేషాస్తవ ధృశః॥ 55

ధరణీ ధర రాజన్య తనయా! అమ్మా! నువ్వు కన్ను మూయడం వల జగత్తుకు ప్రళయమేర్పడుచున్నది. కను తెరవడం వల్ల విశ్వ సృష్టి జరుగుచున్నది. ఈ జగత్తు అంతా ప్రళాయానంతరం ఉన్మేషం వల్ల ఉత్పన్నమైనది. జగత్తును రక్షించుటకొరకే నువ్వు కనురెప్ప వేయడం మానినావు. 55

శ్లో॥ తవాపర్ణే! కర్ణేజపనయన పైశున్య చకితా
నిలీయన్తే తోయే నియతమనిమేషాశ్శఫరికాః
ఇయం చ శ్రీర్బద్ధచ్ఛదపుటకవాటం కువలయమ్
జహాతి ప్రత్యూషే నిశి చ విఘటయ్య ప్రవిశతి॥ 56

ఓ అపర్ణాదేవీ! కనురెప్ప పాటులేని మీనాలు సర్వదా జలాల్లో దాగి ఉంటాయి. ఈర్ష్యా వశమై నీ కన్నులు తమర్ని గురించి నీ చెవులతో చెబుతాయేమో అనుకుంటున్నాయి. ఈ లక్ష్మీ తూర్పు తెల్లవారడంతో కవాటాలవలె బంధించునట్టి-

దళాలు కల కలువలను విడిచిఫోతుంది. రాత్రి పునః వాటిని తెరచుకుని ప్రవేశిస్తుంది.

భావమేమంటే - భగవతి యొక్క నిమిషోన్మేష వర్జితమగు నేత్రములు ప్రతిద్వంద్విగా మీనములున్నవి. కుముదిని, మీనాలు, జలాల్లో దాగొని ఉంటాయి. కుముదిని రాత్రివేళలోనే వికసించి ఉంటుంది. అంటే పగటివేళ ముకుళితమై పోవుటచే శ్రీ హీనమై - అనగా కాంతిహీనమై పోతుంది.

శ్లో॥ దృశా ద్రాఘియస్యా దరదలిత నీలోత్పలరుచా
దవీయాంసం దీనం స్నపయ కృపయా మామపి శివే
అనేనాయం ధన్యోభవతి న చతే హానిరియతా 57
వనే వా హర్మ్యే వా సమకరనిపాతో హిమకరః॥

హే! శివే! కించిద్వికసిత నీలోత్పల శోభాయుక్తమై, బహుదూరం ప్రసరించగల నీ దృష్టితో దయుదలచి దూరంగా ఉన్న దీనుడనగు నన్ను కూడ స్నానమొనరింపజేయి తల్లీ! తద్వారా వీడు ధన్యుడవుతాడు. అందులో నీకు కలిగే హాని ఏమీ లేదు కదమ్మా! ఏమందువా చంద్రకిరణాలు అడవిలోనూ 57
రాజభవనాలలోను సమసంగానే పడుతున్నాయి కదా!

శ్లో॥ అరాలం తే పాలీయుగల మగరాజన్యతనయే
న కేషామాధత్తే కుసుమశరకోదణ్డకుతుకమ్
తిరశ్చీనో యత్ర శ్రవణపథముల్లంఘ్య విలసన్ 58
అపాఙ్గవ్యాసంగో దిశతి శరసన్ధానధిషణామ్॥

ముఖ్యధ్యానమ :

జననీ! భాసిల్లే భవదీయ కపోలాలపై ప్రతిఫలించే కర్ణపుష్ప ద్వయంచే యుక్తమైన నీ వదనం కామదేవుని నాలుగు చక్రాల రథాన్ని స్ఫురింపజేస్తూన్నది. దాని నాశ్రయంగా చేసుకొని మహావీరుడైన మన్మథుడు సూర్యచంద్రులే చక్రాలుగా గల పృథ్వీరూపరథాన్నధిరోహించి యుద్ధార్థం సుసజ్జితుడై వచ్చిన శంకరుని విరుద్ధంగా 58
నిలబడ్డాడు.

శ్లో॥ స్ఫురద్గణ్డా భోగ ప్రతిఫలిత తాటఙ్కయుగళం

చతుశ్చక్రం మన్యే తవ ముఖమిదం మన్మథ రథమ్
యమారుహ్యాద్రుహ్య త్యవని రథ మర్కేన్దు చరణం
మహావీరో మారః ప్రమథపతయే సజ్జితవతే 59

వదనమే రథము, దానికి గల నాలుగు చక్రాలూ వ్రేలాడే రెండు కర్ణపుష్పాలూ రెండు బుగ్గలపై వాటి ప్రతిబింబాలు అయి ఉన్నాయి. శంకరుని రథం పృథ్వి. దానికి సూర్యచంద్రులే చక్రాలు దాని నధిరోహించియే పరమశివుడు త్రిపురాసురులను ఓడించాడు. కాని ఇక్కడ పరమేశ్వరి వదన రూప రథాన్ని ఆశ్రయించుకున్న కారణంగా మన్మథుడు శంకరునికి ఎదురై యుద్ధం చెయ్య సాహసించగలిగాడు. 59

శ్లో॥ సరస్వత్యాస్సూక్తీ రమృతలహరో కౌశలహరీః
పిబన్త్యాశ్శర్వాణీః శ్రవణచుళుకాభ్యా మవిరలమ్॥
చమత్కార శ్లాఘాచలితశిరసః కుణ్డలగణో
ఝణత్కారైః తారైః ప్రతివచనమాచష్ట ఇవ తే॥ 60

ఓ శర్వాణీ! అమృతలహరీ కౌశలాన్ని కూడ హరించునట్టి సరస్వతి సూక్తిని శ్రవణ రూపాంజలులతో అవిరళంగా పానంచేసే సమయంలో నీ కర్ణకుండలాలు చమత్కారోక్తులకు శ్లాఘాసూచకంగా అనుక్షణం మ్రోగుతూ ఓంకారోచ్చారణ సదృశంగా హుంకారం ద్వారా బదులు పలుకుతున్నాయా? అన్నట్లున్నాయి.

పురాతన కాలంలో అనుజ్ఞా సూచకశబ్దాలతో ఓం అని పలుకుతూండేవారు. ప్రస్తుతం ఆఁఊఁ అంటూన్న విధంగా ఉండేది. 60

శ్లో॥ అసౌ నాసావంశస్తుహినగిరి వంశధ్వజపటి
త్వదీయో నేదీయః ఫలతు ఫలమస్మాక ముచితమ్।
వహత్యన్తర్ముక్తాశ్శిశిరకర నిఃశ్వాసగలితం!
సమృద్ధ్యా యస్తాసాం బహిరపి నముక్తామణిధరః॥ 61

నాసికా ధ్యానం

హిమాచల వంశానికి గల ధ్వజాన్ని శోభిలజేసే పతాకామా! నీ నాసా భరణము – మాకు శీఘ్రంగా సముచిత ఫలాన్ని ప్రసాదించునది అగును గాక! కారణం? దాని లోపల నీ అతిశీతల నిశ్శ్వాసాల వల్ల ముత్యాలు తయారవుతూన్నాయి.

వామభాగంలోని ముక్కుపుడకలోని ఓ ముక్తామణి బయట కనిపిస్తున్నది.61

శ్లో॥ ప్రకృత్యాఽఽ రక్తాయాస్తవ సుదతి! దన్తచ్ఛదరుచేః
ప్రవక్ష్యే సాదృశ్యం జనయతు ఫలం విద్రుమలతా!
న బిమ్బం తద్బిమ్బ ప్రతిఫలనరాగా దరుణిమం
తులా మధ్యారోఢుం కథమివ న లజ్జేతకలయా॥ 62

సుందరమైన దంతాలు గల ఓ భగవతీ! సహజంగా అరుణవర్ణం కల నీ అధరాల శోభతో సాదృశ్యం కల వస్తువుల నామాలను వర్ణిస్తున్నాను. విద్రుమలతకు ఫలం వస్తే (అంటే అంత అందమైనదని చెప్పబడుతున్నది) కాని భింబఫలం మాత్ర కాదు, ఏమందువా? దాని అరుణిమ నీ బింబం యొక్క ప్రతిబింబితారుణిమ ప్రకాశ సదృశంగా ఉంటుంది. పోనీ ఏ విధంగానైనా నీ పెదవులను పోలుద్దామా, అంటేఅవి అధర సౌందర్యంలో ఒక్క కళతో కూడ సమానం కాకపోవడంతో 62
సిగ్గుపడవా?

శ్లో॥ స్మితజ్యోత్స్నాజాలం తవ వదన చన్ద్రస్య పిబితామ్
చకోరాణామాసీ దతిరసతయా చంచుజడిమా,
అతస్తే శీతాంశో రమృతలహరీ రామ్లరుచయః
పిబన్తి స్వచ్ఛన్దం నిశినిశి భృశం కాంచిక ధియా॥ 63

అధర ధ్యానము

అమ్మా! నీచంద్రవదనం నుండి బహిర్గతమైన మందస్మిత రూపమైన జ్యోత్స్న (వెన్నెలను) ధిక్యాన్ని పానం చేసి అతి మధురాలైన కారణంగానే చకోరాల చంచువులు అత్యంత రసాస్వాదనం వల్ల జడమైపోయాయి. అంటే తొలగిపోయాయి. అందులకే ఆమ్లరసాన్ని వాంఛించే చకోరాలు చంద్రికలను అమృతలహరులను కాంచీభావంతో గ్రహించి ప్రతిరాత్రి విశేషంగా పానం చేస్తూంటాము.

భావార్థము : చంద్రుని వెన్నెల ప్రకృతిదేవి మందస్మిత మాధు కాంచీ సమంగా ఆమ్లంగా ఉంటుంది.

శ్లో॥ అవిశ్రాన్తం పత్యుర్గుణగణకథాఽఽమ్రేడనజపా
జపాపుష్పచ్ఛాయా తవ జనని! జిహ్వా జయతి సా,
యదగ్రాఽఽసీనాయః స్ఫటిక దృషదచ్ఛచ్ఛవి మయీ

సరస్వత్యా మూర్తిః పరిణమతి మాణిక్య వపుషా॥ 64

జిహ్వా ధ్యానము

అమ్మా! పతిదేవుని గుణాలను కీర్తించడంలో అలసట చెందని దానవు, జపాకుసుమశోభను అధిగమించిన భవదీయారుణ జిహ్వాకు జయమగును గాక! దాని అగ్రభాగంలో ఆసీనమైనయున్న స్ఫటిక శిలాసదృశ శుద్ధ కాంతిమయ సరస్వతీ మూర్తి యొక్క శరీరవర్ణం మాణిక్య సదృశంగా పరిణతమైపోయింది. 63

శ్లో॥ రణే జిత్వాదైత్యా నపహృతశిరస్త్రైః కవచిభిః
నివృత్తైశ్చణ్డాంశ త్రిపురహరనిర్మాల్యవిముఖైః॥
విశాఖేన్ద్రో పేన్ద్రై శ్శశివిశద కర్పూర శకలా
విలీయన్తే మాతస్తవ వదనతామ్బూల కబలాః 65

ఓ మాతా! రణరంగంలో దైత్యులను జయించి అపహృత శిరస్త్రాణ కవచాలను విప్పి, శివుని నిర్మాల్యమందు విముఖమై చండుని భాగమైస్కంద, ఇంద్ర ఉపేంద్రులు ముగ్గురూ నీ ముఖపానగ్రాసాన్ని - చంద్ర సదృశ స్వచ్ఛకర్పూర ఖండాలు పడి ఉండగా - వారు వాటిని గ్రహిస్తున్నారు. 65

శ్లో॥ విపఞ్చ్యా గాయన్తీ వివిధమపదానం పశుపతే
త్వయాఽఽరబ్ధేవక్తుం చలిత శిరసా సాధువచనే!
తదీయైర్మాధుర్యైరపలపిత తన్త్రీకల రవామ్
నిజాం వీణాం వాణీ నిచులయతి చోలేన నిభృతమ్॥ 66

జననీ! పశుపతి యొక్క వివిధ అపాదానలు (మరచిన లోకోపకారాలను) వీణపై గానం చేసే సమయంలో - శిరస్సు నూపుతూ నువ్వు సరస్వతిని శ్లాఘిస్తూ పలుక ప్రారంభించగా - నీ వాఙ్మాధుర్యం వల వీణాకలరవ నినాదాలు కూడ పేలవం కాగా వాణి తన వీణను వస్త్రాచ్ఛాదితం చేసి వేస్తుంది.

అంటే భగవతి వాణీ మాధుర్యం ముందు సరస్వతి వీణానాదం కూడా పనికి రాకుండా ఉంటుందని అర్థము.

శ్లో॥ కరాగ్రేణ స్పృష్టం దుహినగిరిణా వత్సలతయా

గిరీశేనోదస్తం ముహు రధరపానాఽ కలతయా!
కర(గ్రాహ్యం శమ్భోర్ముఖముకురవృన్తం గిరిసుతే!
కథంకారాం (బ్రూమస్తవ చుబుక మౌపమ్య రహితమ్॥ 67

చుబుక ధ్యానము

ఓ గిరి సుతా! ఉపమారహితమైన నీ చుబుకమును మేమెలా వర్ణించగలము? దానిని నీ తండ్రి అయిన హిమావలుడు వాత్సల్య (పేమతో తన (వేళ్ళతో నిమిరాడు. గిరీశుడు అధర పానాకులత్వంతో నీ చిబుకాన్ని మాటిమాటికీ పైకి ఎత్తగా అది శంభుని హస్తాలతో మేము చూచుకోవడానికి ఎత్తిన దర్పణమా? అన్నట్లుంది. (ప్రకృతి ముఖం దర్పణ సదృశమైనది. అందులో మహాదేవుని వదనం (పతిబింబిస్తున్నది. 67

శ్లో॥ భుజాఽశ్లేషాన్నిత్యం పురదమయితుః కణ్టకవతీ
తవ (గ్రీవా ధత్తే ముఖ కమల నాల(శియమియమ్!
స్వతశ్శ్వేతా కాలాగురు బహుల జమ్బాల మలినా
మృణాలీ లాలిత్యం వహతి యదధో హారలతికా॥ 68

ఓ శివానీ! మహాదేవుడు నిన్ను ఆలింగనం చేసుకోవడం వల్ల కలిగిన పులకింత వల్ల పొందిన నీ మెడ ముఖారవిందానికి కాడవలె అవుతున్నది. ఆ (గ్రీవానికి అధోభాగంలో లతవంటి హారం కృష్ణ చందనమనే పంకంచే మలినమై తామరతూడగుచున్నది. 68

శ్లో॥ గలేరేఖాస్తి(స్రో గతిగమక గీతైక నిపుణే
వివాహవ్యానద్ధ (ప్రగుణగుణ సఙ్ఖ్యా (ప్రతిభువః॥
వరాజన్తే నానావిధమధుర రాగాకరభువామ్
(త్రయాణాం (గ్రామాణాం స్థితినియమసీమాన ఇవతే॥ 69

ఓం (త్రిభువన సుందరీ! గతి, గమక, గీతా గానాలలో నైపుణ్యం కలదానా! కళ్యాణవేళలో బంధితమై పేనినట్టి దారాలకు మారుగ నీ గళసీమలోని (త్రిరేఖలు అనేక రాగాలకు స్థానమైన (షడ్జ మధ్యమ గాంధారాలనే మూడు (గ్రామాలను స్థిరంగా ఉంచడానికి ఏర్పరచిన సరిహద్దుల వలె (ప్రకాశిస్తున్నాయి.

శ్లో॥ మృణాలీమృద్వీనాం తవ భుజలతానాం చతసృణామ్

చతుర్భి స్సౌన్దర్యం సరసిజభవ స్స్తౌతి వదనైః!
నఖేభ్యస్సన్త్రస్యన్ ప్రథమ మదనా దంధకరిపోః
చతుర్ణాం శీర్షాణాం సమ మభయ హస్తార్పణధియా! 70

ఓ పరమేశ్వరీ! బ్రహ్మ తన ప్రథమ శిరస్సును ఖండించిన పరమ శివుని నఖాలకు భీతిచెంది శేషించి న చతుర్ముఖాలకు అభయాన్ని ప్రసాదిస్తావన్న తలంపుతో నాలుగు మోములతో తామర తూడుల వంటి మృదువైన నీ నాలుగు భజాల సౌందర్యాన్నీ స్తుతిస్తున్నాడు 70

శ్లో॥ నఖనా ముద్ద్యోతైర్నవ నలినరాగం విహసతామ్
కరణాం తే కాన్తిం కథయ కథయామః కథముమే!
కయాచిద్వా సామ్యం భజతు కలయా హస్త కమలమ్
యది క్రీడల్లక్ష్మీ చరణతల లాక్షారసచణమ్॥ 71

ఓ గిరిజాకుమారీ! నవ్య పద్మ ప్రకాశాన్ని పరిహసించే నఖ కాంతితో తేజరిల్లుతూన్న నీ కర కాంతిని ఏమని వర్ణించగలమమ్మా? విహరించే శ్రీదేవి యొక్క చరణాలయందలి లాక్షారసానికే సాటికాని కమలము ఏ కళతో భవదీయ కర కాంతికి సాటి అవుతుందేమో? 71

శ్లో॥ సమం దేవీ! స్కన్ద ద్విప వదనం పీతం స్తనయుగమ్
త వేదం నః ఖేదం హరతు సతతం ప్రస్నుతముఖమ్।
యదాలోక్యాऽऽశంకాऽऽకులితహృదయో హాసజనకః
స్వకుమ్భౌ హేరమ్బః పరిమృశతి హస్నే ఝుటితి॥ 72।

ఓ మాతా! క్షీరాలు స్రవిస్తున్న నీ స్తనద్వయాన్ని చూసి తన కుంభాలేమోనని గణపతి తన కుంభాలను తడుముకుంటున్నాడు. కుమార గణపతులచే పానం చేయబడిన నీ స్తనద్వయం మా దుఃఖాలను దూరం చేయుగాక! 72

శ్లో॥ అమూతే వక్షోజా వమృతరస మాణిక్య కుతుపౌ
న సన్దేహస్పన్దో నగపతిపతాకే మనసి నః!
పిబన్తౌ తౌ యస్మా దవిదితవధూ సంగ రసికౌ
కుమారావద్యాపి ద్విరద వదన క్రౌఞ్చదలనౌ॥ 73

పర్వత రాజైన హిమవంతుని ధ్వజానికి పతాకం వంటి పార్వతీ! అమృత

భరితమైన మాణిక్య కలశ సదృశమైన భవదీయ కుచపానం చేస్తున్న కుమార గణపతులు స్త్రీ సాంగత్యాన్నెరుగని వారయి యిప్పటికీ బాలురుగానే కనిపిస్తున్నారు. 73

శ్లో॥ వహత్యమ్బ! స్తమ్బేర మదనుజ కుమ్భ ప్రకృతిభిః
సమారబ్ధాం ముక్తామణిభిరమలాం హారలతికామ్।
కుచాభోగో బిమ్బాధరరుచిభి రన్తశ్శబలితామ్
ప్రతాపవ్యామిశ్రాం పురదమయితుః కీర్తిమివతే॥ 74

అమ్మా! నీ వక్షః స్థలంలోని హారాన్ని గజాసుర కుంభ స్థలంలోని మణులతో గుచ్చబడి స్వచ్ఛమైనదై బింబాధరం వంటి అధరోష్ఠ కాంతితో చిత్రవర్ణం కలదైన ముత్యాలహారాన్ని మహాదేవ ప్రతాప యుక్త యశస్సువలె ధరిస్తున్నావు. 74

శ్లో॥ తవస్తన్యం మన్యే ధరణిధరకన్యే! హృదయతః
పయః పారావారాః పరివహతి సారస్వత మివ
దయావత్యా దత్తం ద్రవిడ శిశురాస్వాద్య తవయత్
కవీనాం ప్రౌఢానా మజని కమనీయః కవయితా॥ 75

ఓ పర్వత రాజనందినీ! కరుణతో నీ విచ్చిన క్షీరాలను ద్రావిడ బాలుడు (ఆచార్య శంకరులు) పానం చేసి మహాకవులకు సయితం మనోహరమైన కవిత్వాని చెప్పగలిగాడు. భవదీయస్తన్యం హృదయం నుండి పాల సముద్రంలా కవిత్వాన్ని విశేషంగా ప్రవహింప జేస్తుంది. 75

శ్లో॥ హరక్రోధ జ్వాలఽఽ వలిభిరవలీఢేన వపుషా
గభీరే తే నాభీసరసి కృతసంగో మనసిజః!
సముత్తస్థౌ తస్మా దచలతనయే! ధూమలతికా
జన స్తాం జానీతే జనని! తవ రోమావలిరితి॥ 76

ఓ అచల తనయా! హరుని క్రోధాగ్ని జ్వాలావళిచే ఆక్రమింపబడ్డ శరీరంగల మదనుడు సరోరూపమైన నీ నాభిని ఆశ్రయించాడు. కనుక జననీ! విజ్ఞులు మదనుని దేహబహిర్గతమైన ధూమాన్ని నీ నూగారుగా గ్రహిస్తున్నారు.

శ్లో॥ యదే తత్కాలిన్దీ తనుతరతరఙ్గాఽకృతి శివే!

కృశే మధ్యే కించత్తవ జనని! యద్భాతి సుధియామ్!
విమర్దా దన్యోన్యం కుచకలశయోర న్తరగతం
తనూభూతంవ్యోమ ప్రవిశదివ నాభిం కుహరిణీమ్॥ 77

తల్లీ! యమునా తరంగ సదృశంగా సన్నమైన నీనడుములో ఈషణ్మాత్రంగా ఉన్న నూగారు, కలశాలవంటి కుచమధ్యంలో వాని రాపిడిచే మిక్కిలి సన్నదైన బిలం వంటి నాభిదేశాన్ని ప్రవేశించినట్లుగా పండితులు భావిస్తూన్నారు. 77

శ్లో॥ స్థిరో గంగా వర్తస్తనముకుళ రోమావళిలతా
కళాఽఽవాలం కుణ్డం కుసుమశర తేజోహుతభుజం!
రతేర్లీలాఽఽగారం కిమపి తవ నాభిర్గిరిసుతే!
బిల ద్వారం సిద్ధే ర్గిరిశ నయనానాం విజయతే॥ 78

ఓ గిరుసుతా! నీ నాభి గంగావర్తం (సుడిగుండం) గానూ మొగ్గలవంటి కుచములకూ, నూగారులతకూ పాదుగాను, మన్మథుని శరాగ్నికి కుండం గానూ, రతికి విలాస మందిరంగానూ శివుని నయన సిద్ధికి గుహా ద్వారంగానూ, ఉండి ఇదియిదేనా? అని భావించడానికి వీలుగానిదై అలరారుతూన్నది. 78

శ్లో॥ నిసర్గక్షీణస్య స్తనతటభరేణ క్లమజుషో
నమన్మూర్తే ర్నారీతిలక శనకైః స్త్రుట్యత ఇవ!
చిరం తే మధ్యస్య త్రుటిత తటినీ తీరతరుణా
సమావస్థా స్థేమ్నో భవతు కుశలం శైల తనయే॥ 79

నారీ సమాజానికి అలంకార భూతురాలవైన ఓ పర్వతరాజ పుత్రీ! సహజంగా సన్ననిదీ. కుచభారంచే కృశించినదీ. మెల్లమెల్లగా జారే వంపు కలదీ తిరిగిన ఒడ్డులోనున్న తరువుతో సమంగా ఉన్నదీ అయిన నీ నడుము శాశ్వతంగా మాకు క్షేమాన్ని కలిగించునది అగునుగాక!
79

శ్లో॥ కుచౌ సద్యస్స్విద్యత్తటఘటిత కూర్పాస భిదురౌ
కషన్తౌ దోర్మూలే కనకకలశాఽఽభౌ కలయతా!
తవ త్రాతుం భగ్నా దలమితి వలగ్నం తనుభువా
త్రిధా నద్ధం దేవి! త్రివలి లవలీవల్లిభిరివ॥ 80

ఓ దేవీ! స్వేదానికి తడిసిన రవికెను పీల్చేది కక్షలను ఒరసేటట్లు చేసేదీ, సువర్ణ

కుంభాలతో సమానమైనవీ, అయిన నీ స్తనాలను రక్షించడానికై వాటిని పుట్టించిన మన్మథుడు ఏల కలతచే మూడు పేటలుగా బిగించినట్లు ఉదరంపై ముడతలు మూడు గోచర మవుతూన్నాయి.

శ్లో॥ గరుత్వం విస్తారం క్షితి ధరపతిః పార్వతి! నిజా
న్నితమ్బాదాచ్ఛిద్యత్వయి హరణరూపేణ నిదధే!
అతస్తే విస్తీర్ణో గురయ మశేషాం వసుమతీమ్
నితమ్బప్రాగర్భారః స్థగయతి లఘుత్వం నయతి చ॥ 81

శాస్త్రలను ఎరిగిన తల్లీ! గౌరీదేవి! ఊరువులతో నువ్వు గజతుండ, సువ: కదళీకాండాదులను జయించినావు. గోళాకృతి కలిగి, పతి దేవునికి ప్రణమిల్లడం: కాఠిన్యాన్ని పొందినవైన మోకాళ్ళతో దివ్య గజాల గుంభ స్థలాలను జయిస్తున్నావు
82 .

శ్లో॥ పరాజేతుం రుద్రం ద్విగుణశరగర్భౌ గిరిసుతే
నిషంగే జంఘే తే విషమ విశిఖో బాఢమకృత,
యదగ్రే దృశ్యన్తే దశశరఫలాః పాదయుగళీ
నఖాగ్రచ్ఛ ద్మాన స్సురమకుట శాణైక నిషితాః॥ 83

గిరిరాజ నందినీ! అనంగుడు పరమశివుని జయించే సంకల్పంతో నీ పిక్కలను రెండింతలు శరాలు గల అమ్ముల పొదులుగా చేశాడు. నీ పిక్కల కొనల పాదనఖరూప శరాలు దివ్యుల కిరీట స్థగిత మాణిక్యాలపై సానపెట్టబడిన 83
దశబాణాలుగా గోచరమవుతున్నాయి.

శ్లో॥ శ్రుతీనాం మూర్ధానో దధతి తవ యౌశేఖరతయా
మమాప్యేతౌ మాతః! శిరసి దయయా దేహి చరణౌ।
యయోః పాద్యం పాథః పశుపతి జటాజూటతటినీ
యయోర్లాక్షాలక్ష్మీ రరుణహరి చూడామణిరుచిః॥ 84

జననీ! నీ చరణాలు వేదాగ్రాలైన ఉపనిషత్తులకు శిరోలంకారాలుగా ఉన్నాయి.
పరమశివుని మస్తకో పరిభాగంలో తేజరిల్లే భాగీరథి నీకు
పాద్యమవుతున్నది. నీ చరణ రాజీవాలలోని లాక్షరసం శ్రీహరి
కిరీటస్థగిత మాణిక్యాలకు సయితం ప్రకాశాన్ని ప్రసాదిస్తూన్నది. అట్టి నీ

చరణాలను కరుణించి నా శిరస్సుపై ఉంచుము. 84

శ్లో॥ నమోవాకం బ్రూమో నయనరమణీ యాయపదయో

స్తవాస్మై ద్వన్ద్వాయ స్ఫుటరుచి రసాలక్తకవతే!

అసూయత్యత్యన్తం యదభిహననాయ స్పృహయతే

పశూనామీశానః ప్రమద వనకంకేళి తరవే॥ 85

శివానీ! భవదీయ చరణ తాడనాన్ని అభిలషించే ఉద్యానవనంలోని అశోక వృక్షాన్ని ఉద్దేశించి పరమశివుడు అసూయ చెందుతూన్నాడు పారాణి గల అట్టి భవదీయ చరణ కమలాలకు తల్లీ! నేను ప్రణమిల్లుతున్నాను. 85

శ్లో॥ మృషాకృత్వా గోత్రస్ఖలనమథ వైలక్ష్యసమితమ్

లలాటే భర్తారం చరణకమలే తాడయతి తే॥

చిరా దన్తశ్శల్యం దహనకృత మున్మూలితవతా

తులాకోటిక్వాణైః కిలికిలిత మీశాన రిపుణా॥ 86

శివానీ! ఏకాంతంలో నీ నామాన్ని పొరబాటుగా చెప్పి తరువాత వంగిన పతిని పాదంతో ఫాలతలాన తన్నగా తన్ను దహించిన కారణంచే క్రోధంతో ఉన్న మదనుడు కసితీరేటట్లు తన కాలి అందెల రవళితో పరమ శివుని పరిహసించినట్లున్నది.

శ్లో॥ హిమానీహన్తవ్యం హిమగిరి నివాసైక చతురా

నిశాయాం నిద్రాణం నిశి చరమభాగేచ విశదా!

వరం లక్ష్మీ పాత్రం శ్రియమతిసృజన్తా సమయినామ్

సరోజం త్వత్పాదౌ జనని! జయతశ్చిత్రమిహ కిమ్? 87

అమ్మా! హిమాలయ వాసానికి అర్హమైనవీ బ్రహ్మముహూర్తంలో సయితం విశదమైనవీ సర్వులకూ విశేష భాగ్యాన్ని ప్రసాదించేవీ, మంచు చేత కొట్టబడినవీ అయిన నీ చరణాలు నిశాసమయంలో మూసుకుపోయే సరోజాలను జయిస్తాయనడంలో సందేహం ఏముంది? 87

శ్లో॥ పదం తే కీర్తినాం ప్రపదమపదం దేవి విపదామ్

కథం నీతం సద్భిః కఠినకమఠీ కర్పరతులామ్!

కథం వా పాణిభ్యాముపయమన కాలే పురభిదా

యదాదాయ న్యస్తం దృషది దయామానేన మనసా॥ 88

ఓ దేవీ! యశస్థానమైనదీ, విపత్తులకు స్థానం కానిదీ నీ మీగాళ్ళు సత్పురుషులచే తాబేటి చిప్పలతో పోల్చబడినవి. అదెలా అవుతుంది? నీ మునంగాలును పరమశివుడు కల్యాణవేళలో హస్తంతో పట్టుకుని సన్నికల్లుపై ఎలా ఉంచాడు తల్లీ? 88

శ్లో॥ నఖైర్నాక స్త్రీణాం కరకమల సంకోచ శశిభి
స్తరూణాం దివ్యానాం హసత ఇవ తే చణ్డి చరణౌ
ఫలాని స్వస్థేభ్యః కిసలయ కరాగ్రేణ దదతామ్
దరిద్రేభ్యో భద్రాం శ్రియమనిశ మహ్నాయ దదతౌ॥ 89

ఓ చండీదేవి! దరిద్రులకు ఐశ్వర్యాన్ని ప్రసాదించే నీ చరణాలు అమరుల పాణిపద్మాల కాంతిని అధిగమించే నీ కాలిగోళ్ళు రివ్వుల అభీష్టాలను నెరవేర్చే కల్పతరువులను మించి ఉన్నవి. 89

శ్లో॥ దదానే దీనేభ్యః శ్రియమనిశమాశాను సదృశీ
మమన్దం సౌన్దర్య ప్రకరమకరన్దం వికిరతి!
తవాస్మిన్ మన్దార స్తబక సుభగే యాతు చరణే
నిమజ్జన్మజ్జీవః కరచరణ షట్చరణతామ్॥ 90

అమ్మా దుర్గా! దీనజనులకు తగిన విధంగా ఐశ్వర్యాన్ని విశేషంగా ప్రసాదించేవీ, రాశీభూత సౌందర్య మకరందాన్ని వెదజల్లేవీ కల్పతరు సుమగుచ్ఛా సదృశంగా సుందరమైన నీ శ్రీ చరణాలయందు లీనమైన నా జీవుడు షట్ చరణాలతో (షడింద్రియాలతో) షట్ పదత్వాన్ని (భ్రమర రూపాన్ని) పొందునుగాక! 90

శ్లో॥ పదన్యాస క్రీడాపరిచయ మివాఽఽరబ్ధమనసః
స్ఖలన్త స్తే ఖేలం భవన కలహంసా న జహతి
అతస్తేషాం శిక్షాం సుభగమణి మంజీర రణిత
చ్ఛలా దాచక్షాణం చరణకమలం చారుచరితే! 91

చక్కని నడతకల చారుశీలా! నీ సదనంలో సంచరించే హంసలు అడుగులు వెయ్య నేర్చుకోవాలన్న తలంపుతో తడబడుతూ నిలకడగా ఉండలేకపోతున్నాయి అందువల్ల భవదీయ పాదారవిందాలు మ్రోత - అనే వంకతో ఆ మరాళాలకు

నడక నేర్పుతూన్నాయి. 91

శ్లో॥ గతాస్తే మఞ్చత్వం ద్రుహిణ హరిరుద్రేశ్వర భృతః
శివః స్వచ్ఛచ్ఛాయా కపట ఘటిత ప్రచ్ఛద పటః।
త్వదీయానాం భాసాం ప్రతిఫలన రాగారుణతయా
శరీరీ శృఙ్గారో రస ఇవ దృశాం దోగ్ధి కుతుకమ్॥ 92

అమ్మా! అధికారులైన బ్రహ్మ విష్ణు రుద్రేశ్వరులు నీకు మంచం కాగా పరమశివుడు నిజధవళ ప్రకాశంతో నువ్వు అచ్ఛాదించుకునే అంబరమై కూడ భవదీయారుణ ప్రకాశ ప్రతిబింబం కారణంగా అరుణ శరీరుడై శృంగార రసం మూర్తీభవించినట్లు తోస్తూన్నది. 92

శ్లో॥ అరాలా కేశేషు ప్రకృత సరలా మందహసితే
శిరీషాఽభా చిత్తే దృషదుపల శోభా కుచతటే।
భృశం తన్వీ మధ్యే పృథురుసి వరారోహవిషయే
జగత్త్రాతుం శమ్భోర్జయతి కరుణా కాచిదరుణా 93

ఓ హిమాచలసుతా! భవదీయకుంతలాలలో కుటిలత్వాన్నీ, చిరునవ్వులో మృదుత్వాన్నీ, చిత్తంలో దరిశెనపూకాంతినీ, వక్షః స్థలంలో పాషాణ సదృశ కాఠిన్యాన్నీ నడుములో కృశత్వాన్నీ, కుచదేశంలో విశాలత్వాన్నీ, నితంబ ప్రదేశంలో విస్తారాన్నీ – అనిర్వచనీయమైన రక్తియందాసక్తీ కల పరమశివ కరుణా జగద్రక్షణార్థం సమర్థమవుతూన్నది. 93

శ్లో॥ సమానీతః పద్భ్యాం మణిముకురతామమ్బర మణిః
భయాదాస్యాదన్తః స్తిమితకిరణశ్రేణిమసృణః
దధాతి త్వద్వక్త్ర ప్రతిఫలనమ శ్రాన్తవికచమ్
నిరాతఙ్కం చన్ద్రా నిజహృదయపఙ్కేరుహమివ॥ 94

సూర్యుడు నీ చరణ సన్నిధానంలో ఉండడం వల్ల దర్పణ కార్యాన్ని నిర్వహిస్తున్నాడు. నీ ముఖభీతితో అతడు నిజకిరణాలను తనలో దాచుకుంటూన్నాడు. అతడు నిర్మలుడు కావడం వలన భవదీయ ముఖ ప్రతిబింబం అతని హృదయ కమల సదృశంగా సదా వికసించినది. అతనికి చంద్రుని భయంలేదు.

94

శ్లో॥ కలఙ్కః కస్తూరీ రజనికరబిమ్బం జలమయమ్
కలాభిః కర్పూరై ర్మరకతకరణ్డం నిబిడితమ్।
అతస్త్వద్భోగేన ప్రతిదినమిదం రిక్తకుహరమ్
విధిర్భూయో భూయో నిబిడయతి నూనం తవ కృతే॥ ౯౫

జగదేక సుందరీ! త్రిలోకజననీ! చంద్రునికళంకం, చంద్రబింబం కళలు క్రమంగా కస్తూరి , జల, కర్పూరాలు కాగా - వాటితో నింపినది మరకత మాణిక్యపుమంజూష, నువ్వు వినియోగించడం వల బ్రహ్మ దేవుడు యీ పెట్టెను మాటి మాటికీ నీ కోసం ఉపర్యుక్తవస్తువులతో నింపుతున్నాడు 95

శ్లో॥ పురారాతే రన్తః పురమసి తతస్త్వచ్చరణయో
స్సపర్యామర్యాదా తరలకరణానా మసులభా!
తథా హ్యేతే నీతాశ్శత మఖ ముఖాస్సిద్ధిమతులామ్
తవ ద్వారోపా న్తస్థితిభిరణిమాఽఽద్యాభి రమరాః॥ ౯౬

అమ్మా! నువ్వు పరమశివుని రాణివి. అందువల్ల చంచలాత్ములకు నీ చరణ రాజీవ సేవా భాగ్యం లభించదు. నీ గృహ ప్రాంగణంలో వసించే ఇంద్రాది దేవతలు – అణిమాది సిద్ధులతో మహత్తర లాభాలను పొందుతున్నారు. ౯౬

శ్లో॥ కలత్రం వైధాత్రం కతికతి భజన్తే న కవయః
శ్రియో దేవ్యాః కో వా న భవతి పతిః ధనైః
మహాదేవం హిత్వా తవ సతి సతీనా మచరమే
కుచాభ్యామాసఙ్గః కురవకతరో రప్యసులభః॥ ౯౭

ఓ గిరిరాజనందినీ! ఎందరో కవీశ్వరులు సరస్వతిని ఆరాధిస్తున్నారు. ఎందరో లక్ష్మికి అధిపతులవుతూన్నారు. పతివ్రతలలో ప్రధాన స్థానాన్ని అలంకరించిన తల్లీ మహాదేవునికి వినా నీ ఆలింగనం ఎర్రగోరింటకు కూడ దొరకదు. అంటే విద్యాధనాలు అనేకులకు లభిస్తాయి కానీ నువ్వు ఎవ్వరికీ వశురాలవు కావు. 97

శ్లో॥ గిరా మాహుర్దేవీం ద్రుహిణగృహిణీ మాగమవిదో
హరేః పత్నీం పద్మాం హరసహచరీ మద్రితనయామ్
తురీయా కాఽపి త్వం దురధిగమనిస్సీమమహిమా
మహామాయా విశ్వం భ్రమయసి పరబ్రహ్మ మహిషీ ౯౮

ఓ పరబ్రహ్మరాణీ! వేదాంతవేత్తలు నిన్ను సరస్వతీదేవిగానూ హరిపత్నియగు శ్రీ మహాలక్ష్మిగానూ, శివపత్నియగు పార్వతీదేవిగానూ వర్ణిస్తున్నారు. నువ్వు ఆ ముగ్గురినీ అధిగమించిన దానవై పొందరాని అంతులేని అపారమహిమా సమన్వితవై మహా మాయా ప్రకృతివిగా విశ్వాన్ని పరిభ్రమింపజేస్తూన్నావు. 98

శ్లో॥ కదకాలే మాతః కథయ కలితా లక్తకరసమ్
పిబేయం విద్యార్థీ తవ చరణ నిర్ణేజన జలమ్।
ప్రకృత్యా మూకానామపి చ కవితా కారణతయా
కదా ధత్తే వాణీముఖకమల తామ్బూల రసతామ్॥ 99

అమ్మా! పరబ్రహ్మను తెలియగోరే నేను పారాణిలా ఎర్రని నీ చరణాలను ప్రక్షాళనం చేసిన తీర్థాన్ని ఎన్నడు త్రాగుతానో కదా! జన్మతః మూగవాడైన వానికి కూడ కవిత్వ శక్తి రాగలగడానికి హేతుభూతమైన వాణి యొక్క ముఖారవిందంలోని తాంబూల రసాన్ని నేను గ్రహించ గలిగేది ఎన్నడో కదా!

99

శ్లో॥ సరస్వత్యా లక్ష్మ్యా విధిహరి సపత్నో విహరతే
రతేః పాతివ్రత్యం శిథిలయతి రమ్యేన వపుషా
చిరంజీవన్నేవ క్షపితపశుపాశవ్యతికరః
పరానందాభిఖ్యం రసయతి సరం త్వద్భజనవాన్॥ 100

అమ్మా! పార్వతీ నిన్ను సేవించేవాడు సరస్వతీ లక్ష్మీ సమేతులగు బ్రహ్మ విష్ణువులకు శత్రువు అవుతూన్నాడు. సుందరాంగి అయిన రతి పాతివ్రత్యాన్ని సయితం భంగపరచే వాడవుతూన్నాడు. చిరకాలం జీవించియు అవిద్య అంతం కాగా జీవునితో కలిసి బ్రహ్మానందం రసాన్ని పానం చేస్తున్నాడు. 100

శ్లో॥ ప్రదీప జ్వాలాభి ర్దివసకర నీరాజనవిధిః
సుధాసూతే శ్చంద్రోపల జలలవైరర్ఘ్య రచనా
స్వకీయై రంభోభి స్సలిల నిధి సౌహిత్య కరణం
త్వదీయాభి ర్వాగ్భిస్తవ జనని వాచాం స్తుతి రియం॥ 101

జననీ! భవత్ ప్రసాదలబ్ధమై వాగ్రూపమైన యీ నీ స్తుతి సూర్య నారాయణునికి సమర్పించే వెలుగుతూన్న హారతిలాంటిది. చంద్రునికి చంద్రకాంత మణుల సలిలాలతో సమర్పించిన జలార్ఘ్యం వంటిది. సముద్రానికి సాగర సలిలాలతో సౌఖ్యాన్ని చేకూర్చడంలా అవుతూన్నది.

సౌందర్యలహరి సంపూర్ణమ్.

## శ్రీ లలితామృతలహరి

శ్రీ విష్ణు సహస్రనామం ప్రణవం చూపిన పరమ పావన పుష్ప హాస మయితే, శ్రీ లలితా సహస్ర నామం శ్రీమాత చేసిన చిన్మయ చారుహాస మవుతుంది. ఆదివిష్ణువు కృష్ణచైతన్య రూపంలో చూపిన విశ్వరూపం దివ్యనామ సహస్రంలో గేయమయితే, అదే దేవీ నామ సహస్రంలో, ధ్యేయమయింది. రెండూ ఒక విధంగా విశ్వనామ సహస్రాలే. దివ్య సహస్రంలో...

సహస్రమూర్ధా విశ్వాత్మా సహస్రాక్షః సహస్రపాత్ అని కొనియాడబడిన విశ్వరూపమే.

దేవీ సహస్రంలో సహస్ర శీర్షవదనా సహస్రాక్షీ సహస్రపాత్‌గా సాక్షాత్కరిస్తుంది. నిజానికి శ్రీ మహావిష్ణువులోని దివ్యతత్త్వం. శ్రీమాతలోని దేవీతత్త్వం, ఒకే పరమ తత్త్వానికి రెండు రూపాలు. సాధకులకు సద్భావంలో సుగుణంగా, రెండూ వేరు

వేరుగా గోచరించినా, చిన్మయదృష్టితో తన్మయభావంతో తరిచి చూస్తే, రెంటిలోను ఒకే ఆనందమయ బిందువు కనిపిస్తుంది. ఆ పరమానంద బిందువే.

## శ్రీ లలితా పరమేశ్వరి

ఈ బిందువులో జడచేతన బేధం లేదు. ప్రకృతి పురుష భేదం కూడా లేదు. పరమేశ్వరుడు పరమేశ్వరికి పరాధీనుడై పారవశ్యాన్ని పొందుతాడు. పరమేశ్వరి పరమశివుని ప్రాపకంలో ప్రపంచ సారాన్ని తన బిందు చైతన్యంలో ఇముడ్చుకొని తన యిష్ట ప్రకారం, తోచినప్పుడు తోచినట్టుగా తనలో చైతన్యాన్ని, వైభవాన్ని, లావణ్యాన్ని, ఆనందాన్ని ప్రపంచానికి పంచి పెడుతుంది. ఈ పని పరమేశ్వరి స్వతంత్రంగా చేయుటలేదు. పరమశివుడు కూడా తనంతట తానుగా ఏ పని చేయలేడు. పరాప్రకృతి, పరమ పురుషుని సహకారంతో తనకు ప్రకృతిని, ప్రతిరూపాన్ని, ప్రతిబింబాన్ని ప్రపంచంలో వెలయిస్తుంది.

శ్రీ శివాత్మకమైన శివశక్తి సమైక్యంలో శ్రీ లలితా పరమేశ్వరి చిన్మయ బిందువులా ఆవిర్భవిస్తుంది.

తల్లిపుట్టుపూర్వోత్తరాలను బ్రహ్మాండ పురాణంలోని, లలితోపాఖ్యానం చిన్న చిన్న కథలలో లలిత లలిత పద బంధంలో వివరిస్తుంది. కాని కథల వెనుక దాగియున్న గంభీర భావాలను బోధపరచుకొంటేనేకాని, అసలు రహస్యం బయట పడదు. శ్రీమాత ప్రాదుర్భవాన్ని, ప్రాభవాన్నీ, చెప్పిన తర్వాత హయగ్రీవుడు అగస్తుని కోరికపై తల్లి నామాలను చెప్తాడు. ఇదే శ్రీ లలితా సహస్రం. దీనినే హయగ్రీవుడు.

రహస్యనామ సహస్రం అని అంటాడు. ఇవి మామూలు పేర్లు కావట! రహస్య నామాలట! ఒక్కొక్క నామాన్ని జాగ్రత్తగా పరిశీలించి చూస్తే, తల్లి ఉనికి, కలిమి, చెలిమి, వెలుగు తెలుస్తాయి. రహస్యం తెలుసుకొని, పరమేశ్వరిని ప్రతి వచనంలో భావిస్తూ, నామ సంకీర్తన చేస్తే తల్లి అనుగ్రహం లభిస్తుంది. పూర్తిగా రహస్యం తెలియకపోయినా, భక్తి తాత్పర్యాలతో నామాలను స్మరిస్తే తల్లి ప్రేమతో

పలుకుతుంది. ఒక తల్లికి పుట్టిన పిల్లలందరూ తెలివి గల వాళ్ళే ఉండరు. కాని తల్లికి అందరూ సమానులే. ఒక విధంగా తెలివి, కలిమి తక్కువగా ఉన్న పిలలల మీద తల్లికి మక్కువ ఎక్కువగా ఉండవచ్చును. తక్కువ మాత్రం ఉండదు. అమ్మా అని ఆప్యాయంగా, ఆర్తితో, పిలిస్తే పలుకని తల్లి ఉండదు. అందువల్లనే ఈ రహస్య సహస్రంలోని మొట్టమొదటి నామం **శ్రీమాతా**

ప్రపంచంలో తల్లికి మించిన దైవం లేదు. ప్రత్యక్షదైవమయిన ప్రభాకరుడు కూడా తల్లికంటె దూరమే. ధర్మసాధనకు ఆధారభూతమైన శరీరాన్ని ప్రసాదించిన తల్లికి మించిన తత్త్వం లేదు. కాని తల్లిదండ్రులందరూ పార్వతీ పరమేశ్వరులయితే ప్రపంచంలో దేవతా స్వరూపులు కాని వారెవరు? అనే అనుమానం రావచ్చు. మాతృదేవోభవ, పితృదేవోభవ అన్న ఆదేశవాక్యాల్లోని ఆంతర్య గమనిస్తే ఈ అనుమానం రాదు. తల్లిని, తండ్రిని ఆచార్యుని దేవతా స్వరూపులుగా భావించటం వల్ల మనలోని దివ్యత్వమే వ్యక్తమవుతుంది. భావజీవుల భావనా శక్తిలోనే భవాని నివసిస్తుంది. కన్నతల్లినే కాదు. ప్రతీ యువతినీ, ప్రతి స్త్రీ, మాతృమూర్తిగా చూడగలిగితే మనలో మరుగుపడియున్న శ్రీమాత వెలుగులోకి వస్తుంది.వెలుగు చూపిస్తుంది. నిజానికి శ్రీలలితా పరమేశ్వరి ప్రతివ్యక్తిలో ప్రచ్ఛన్నంగా దాగి ఉన్నది. భావనా శక్తితో ఆమెను ప్రసన్నం చేసుకోవచ్చు. ప్రాణికోటికి ఆశ్రయమైన పాంచభౌతిక శరీరమే పరమేశ్వరికి ఆలయం. ఇందులో నశ్వరమైన అనాత్మ తత్త్వాన్ని తొలగిస్తే మిగిలే ఆత్మ తత్త్వమే దేవీ స్వరూపం.

స్వాత్మైవ దేవతా ప్రోక్తా లలితా విశ్వవిగ్రహా అన్న భావనోపనిషత్సూక్తి ననుసరించి తనలోని ఆత్మ తత్త్వమే లలితా పరమేశ్వరి. విశ్వమంతా ఆమె విగ్రహమే. కదలే ప్రతి కణంలో, సాగే ప్రతి క్షణంలో, ప్రసరించే ప్రతి కిరణంలో, ప్రసరించే ప్రతి ప్రాణంలో పరమేశ్వరి లాలిత్యం వ్యక్తమవుతూ ఉంటుంది. అసలు లాలిత్య మంటేనే చలనం, స్పందనం. నర్తనం, ఆవర్తనం, చైతన్యం, లోకానతీత్యా లాలతే లలితా తేన సోచ్యతే!

లోకాలనుమించి అతిలోక లావణ్యంతో లాస్యం చేసే లలనామణి లలితాంబిక, లోకోత్తర లావణ్య భావాలతో చిన్మయ చైతన్యంతో, ఆనందాతిరేకంతో,

అణువణువులో ఆడిపాడి ఓలలాడే లీల-పతి లలితా పరమేశ్వరి. ఈ లలితాంబిక వెలయించే లాస్య లీలలకు లాలనా స్థలి లలాటం.

లలితాంబిక లీలలోని లాలిత్యమంతా లలాటంలో కనిపిస్తుంది. వెయ్యిరేకులతో వేవెలుగులతో జగజ్జేగీయమానంగా శోభిల్లే సహస్రారంలో చోటు చేసికొని, ఆటలతో పాటలతో ఆయుస్సును తపస్సుగా మార్చే తరుణ తపస్విని లలితాంగన, ఒక విధంగా చూస్తే సహజమైన లాలిత్యాన్ని అణువణువులో, అంగాంగంలో అలరించుకున్న అంగన లందరూ లలితా స్వరూపులే. ఆడుది అంటేనే లలిత. కనక శాబ్దికంగా చూచినా, ఆడవాళ్ళంతా లలితా స్వరూపులు. ప్రతిపురుషుడు పరమేశ్వరుడు, ప్రతి స్త్రీ పరమేశ్వరి. కాని వ్యక్తిలో అలాంటి శివబావన ఉదయించనిదే, తనలో దాగియున్న ఈ దివ్యశక్తి తనకు గోచరించదు. శివశక్తి సామరస్యం, ప్రతివ్యక్తి లలాటంలో తాండవిస్తూ ఉంటుంది. కాని యీ లాలిత్యాన్ని చైతన్యాన్ని మరుగుపరచి, వ్యక్తిలోని శివత్వాన్ని శక్తిని బయటకు రాకుండా అతన్ని ఒకానొక జడత్వం, భండత్వం ఆవరించి ఉంటుంది. మానవుడు సహజంగా భోగలాలసుడు. దిగులు లేకుండా తిండి తిని, నిద్రపోయే వసతి ఉంటే అతనికి ప్రపంచంతో ప్రమేయ ముండదు.... లేదు, హాయిగా, యుగాలను నిముషాలుగా గడుపుకుంటాడు. ఇది భండాసుర లక్షణం. భండాసురుని సంహరిస్తేనే గాని లోపలి లాలిత్యం బయటకి రాదు. బ్రహ్మాండం పురాణంలోని భండాసుర వధలో ఉన్న పరమార్థమిదే. పురాణ గాథల్లోని పరమార్థాన్ని అర్థం చేసుకోకుండా ఊరకవల్లె లేస్తే అవి పుక్కిట పురాణాలే అవుతాయి. డొక్క శుద్ధి కావాలంటే వాటి గూడార్థం కనుక్కోవాలి. శ్రీ మహాశంభువు శ్రీయాగం చేసి, చిదగ్నికుండంలో శ్రీమాతను ఆవిష్కరించుకున్నాడని పురాణ గాథ. శ్రీయాగం చేయగల ప్రతి వ్యక్తికీ, తన చిన్మయాకాశంలో శ్రీమాత సాక్షాత్కరిస్తుంది. ప్రపంచాన్ని పాలించి, ప్రాణికోటికి పరమానందం కలిగించే ప్రసాదించే పరమేశ్వరి, తనలోనే తన నేత్రోన్మీలనం కోసం ఎదురు చూస్తూ నుదుటి వెనుక దాగి యున్నదనే పరమార్థం ఎంత త్వరగా తెలుసుకుంటే, జీవి అంత త్వరగా తరిస్తాడు. దీనికి బాహ్య నేత్రాలు చాలవు. అంతశ్చక్షువులు తెరుచు కోవాలి. బాహ్య ప్రపంచాన్ని మించిన బ్రహ్మాండ మండలం. లోపలి బ్రహ్మ కపాలంలో ఉందనే పరమ రహస్యం.

బ్రహ్మాండ పురాణంలోని లలితోపాఖ్యానం వివరిస్తుంది. అందు వల్లన వివరంగా
అంత ర్యాన్ని వివరించే రహస్యనామ సాహస్రంలో ఆమెను.

అంతర్ముఖ సమారాధ్యా అనీ
బహిర్ముఖ సుదుర్లభా అనీ

వర్ణించడం జరిగింది. సహజంగా బహిర్ముఖమైన ఇంద్రియ సంతతిని అంతర్ముఖం చేసుకొని, అతీంద్రియమైన ఆంతరిక జగద్విలాసాన్ని ఒక్కసారి చవిచూస్తే, బయట కనిపించే పటాటోపమంతా సారహీనం, క్షణ భంగురం, సాధన మాత్రం అనే విషయం గోచరిస్తుంది. ఈ విషయం కథగా చెప్పిన తర్వాత, ఓపికగా విన్న అగస్త్యుడు లోపలి లాలిత్యాన్ని స్మరించేందుకు నామ తారకం అనుగ్రహించ వలసినదని హయగ్రీవుని కోరుతాడు. ఏ పేరిట పిలిస్తే ఆ తల్లి పలుకుతుందో ఆ పేర్లన్నీ హయగ్రీవుని అశ్వ కంఠం నుండి ఆశువుగా వెలువడతాయి. ఈ నామసంగ్రహమే లలితా సహస్రం రామరావణ యుద్ధంలో రామచంద్రుని విజయానికి సాధనంగా రామునికి ఆదిత్యహృదయం ఉపదేశించిన అగస్త్యుడు లలితా సహస్రంలో శ్రోత కావటం గమనించవలసిన విషయం అశ్వరూపాం రథమధ్యాం హస్తినాథ ప్రభోధినీం అని శ్రీ రహస్యాన్ని శ్రుతులు కీర్తిస్తాయి. అలాంటి అశ్వగంభీర కంఠంతో హయగ్రీవుడు వివరించే ఈ నామసహస్రంలో గాంభీర్యం వేరే చెప్పనక్కరలేదు. అసలీ నామాలను వశిన్యాది వాగ్దేవతల మొట్టమొదట పరమేశ్వరి యెదుట గానం చేశారట. వాగ్దేవి నోట వెలువడిన యి స్తోత్రం, సమస్త వాఙ్మయానికీ అమూల్యమైన అలంకారం. అందువల్లనే, కేవల సారస్వత దృష్టితో చూచినా శ్రీ లలితా సహస్రంలోని లాలిత్యం మరోచో కనిపించదు.

ఈ రహస్యనామ సాహస్రం పేరుకు లలితాసహస్రమే. కాని ఇందులో కామా రాజరాజేశ్వ పార్వతి, దుర్గ, మహాకాళి, సరస్వతి, భవాని, నారాయణి, కల్యాణి, రాజరాజేశ్వ మహాత్రిపురసుందరి, వైష్ణవి, మహేశ్వరి, చండి, విశాలాక్షి లాంటి అనే దేవీరూపాలు గోచరిస్తాయి. అసలు ప్రధానమయిన 'లలితాంబికా' నామం చి

చివర వినిపిస్తుంది. దేవిని ఏ రూపంలో ఆరాధిస్తే ఆ రూపంలో సాక్షాత్కరిస్తుంది. అన్ని రూపాలకు, అన్ని నామాలకు సారం (లలితాంబిక.)

## లలితాంబిక

సకలదేవీ దేవతల రహస్యాన్ని సంగ్రహంగా వివరించే శ్రీ లలితా సహస్రం కేవలం స్తోత్రంకాదు. గొప్ప శాస్త్రం కూడాను. శ్రీ విష్ణు సహస్ర నామం సామాన్య దృష్టికి నామ కీర్తన లాగానే కనిపిస్తుంది. దానిలో ఒక శాస్త్రీయ సంబంధ సూత్రం ఉన్నదనే విషయం, నిశితంగా పిశీలిస్తేనే కాని తెలియదు. కాని శ్రీ లలితా సహస్రం చదువుతూంటేనే అందులోని శాస్త్రశైలి గోచరిస్తుంది. భక్తితో పఠించేందుకు అది దివ్య స్తోత్రంగాను, పరమార్థచింతనతో పరిశీలించేందుకు శాస్త్రంగాను ఉపకరిస్తుంది. శాస్త్ర వివేచనకు కావలసిన విషయ పరిచ్ఛేదం అందులో స్పష్టంగా కనిపిస్తుంది. మొట్టమొదట శ్రీమాత ఆవిర్భావం, తర్వాత ఆమె. లోకోత్తర లావణ్యం, ఆ తర్వాత ఆమె పరాక్రమం, దుష్టశిక్షణ, శిష్టరక్షణ, తర్వాత సూక్ష్మరూపంలో పరమేశ్వరీ స్వరూపం, భావనామయ స్వరూపం షట్చక్రదర్శనం. ఇలా శారీరిక మీమాంసకు సంబంధించిన విషయాలు దేవీ పరంగా చెప్పుకుంటూ, చివరకు శివ, శక్తి, సామరస్యంతో, ఆత్మ సాయుజ్యాన్ని ప్రతిపాదించే యీ రహస్య నామసాహస్రం, పూర్వాపర సంబంధంతో పూసగ్రుచ్చినట్లు ఆత్మ తత్త్వాన్ని వివరించే శ్రీ రహస్య సర్వస్వం, బ్రహ్మజిజ్ఞాసను సూత్రీకరించిన బ్రహ్మసూత్రాలనూ శారీరక మీమాంస అన్నట్టుగా, ఆత్మతత్త్వాన్ని శాస్త్రీకరించిన యీ రహస్య నామసహస్రాన్ని ఆత్మానందలహరి అని అనవచ్చు. ఉందులో లావణ్య లహరి, వైభవ లహరి, భావనా లహరి, ఆనందలహరి, చైన్యలహరి, సాలోక్య లహరి, సామీప్య లహరి, సారూప్య లహరి, సాయుజ్య లహరి -- అనే తొమ్మిది తరంగాలు కూడా, ఒక దాని తరువాత మరియొకటి పొంగిపారలి, శ్రీ మాతృస్వరూపాన్ని వెలయిస్తున్నట్టు తోస్తుంది. ఈ తరంగాలలో ఒక్కొక్కటి దాదాపు 20 శ్లోకాల వరకు వ్యాపించినట్టు భావించవచ్చు. ఈ తొమ్మిది తరంగాలలో శ్రీ చక్రంలోని తొమ్మిది ఆవరణాలుకూడా తొంగి చూస్తున్నట్టు తోస్తుంది. అన్నింటికి బాహ్యమైన తొలి ఆవరణం లావణ్య లహరిలో కనిపిస్తుంది.

బ్రహ్మాది దేవతలచేత కొనియాడబడిన దేవి ఆత్మవైభవం, సర్వాశాపరిపూరక చక్రానికి ప్రతీకంగా కనిపిస్తుంది. ఇలా తొమ్మిది తరంగాలలో తొమ్మిది ఆవరణాలను పోల్చుకుంటూ పోతూ పోతే, అంతరాంతర కుహరంలో ఉండే సర్వానందమయ బిందువు సాయుజ్య లహరిలో ప్రతిబింబించి ఉంటుంది. శ్రీ సహస్రాన్ని సరిగా అవగాహన చేసుకొనేందుకు, శ్రీ చక్రాన్ని గురించి కొద్దిగా తెలుసుకొని ఉండాలి. శ్రీ చక్రానికి, శ్రీ విద్యకు కూడా సన్నిహితమైన సంబంధం ఉంది. శ్రీ విద్య మంత్రం.

## శ్రీచక్ర యంత్రం

శ్రీ లలితా సహస్రం, ఈ మంత్రానికి, యంత్రానికి సంబంధించిన తంత్రం.

తనోతి – ఇతి (వ్యాపించేది) తంత్రం. శ్రీ విద్యలో అక్షర రూపంలో ఉన్న లలితా పరమేశ్వరి, శ్రీచక్రంలో రేఖాకారంలోనూ, శ్రీ సహస్రంలో సూక్ష్మ రూపంలోను సాక్షాత్కరిస్తుంది. శ్రీ విద్యకు, శ్రీ చక్రాన్ని సేవించటం, అర్చించటం, అందరికి సాధ్యమైనదికాదు. కాని సహస్రనామాలను చదవటం, ఆ నామాలలో శ్రీ లలితా పరమేశ్వరిని, అర్చించటం అందరికీ సాధ్యమైన పని. ఈ వేయినామములో ఏ ఒక్క నామమైనా. శ్రీ పరమేశ్వరి అనుగ్రహాన్ని సాధించేటందుకు చాలునని హయగ్రీవుడంటారు. అన్ని నామాలను చదివితే శ్రీ పరమేశ్వరి పరిపూర్ణ కటాక్షం లభిస్తుంది. అసలీ నామాలన్నీ ఆత్మ నామాలు. శ్రీ పరమేశ్వరి పేరిట, మనం మనలోని పరతత్త్వాన్ని భావించి సేవిస్తున్నాం శ్రీ చక్రం కూడా శరీరంలోని ఆరుచక్రాలకు పైన వెయ్యిరేకులతో వెలిగే సహస్రారకాంతినే ప్రతీకాత్మకంగా నిరూపిస్తుంది.

మానవ శరీరంలోని షట్చక్ర సందర్శనమే సకల దేవతా సందర్శనం సహస్రారంలోని చిన్మయానంద బిందువేపరమేశ్వరిస్వరూపం. కాని, శరీరంలోని యీ చక్రాలు చర్మ చక్షువులకు గోచరించేవి కావు. శల్య పరీక్షకు అందేవి కావు. భావనా శక్తితో సాధించి, శోధించవలసిన చైతన్య సోపానాలు. ఈ చక్రకాంతులు. వీటికిమూలాధారంలో ఉన్న కుండలిని ఆధారం. మెలికలు తిరిగిన పాములా,

ఆసన స్థానంలో నిద్రాణంగా ఉన్న యీ కుండలిని మేల్కొని, మేరువు చివరకు పయనించి, లలాట స్థలం పైన ఉన్న సహస్రారాన్ని చేరి, అందులోని అమృతాన్ని ఆప్యాయంగా ఆస్వాదించినపుడు, మర్త్యుడు మృత్యుం జయుడవుతాడు. మరణించే శరీరం మరణించి నశించినా, మరణించని అమరత్వాన్ని దర్శించడమే ఆత్మ విద్య. ఈ విద్య శ్రీ లలితా సహస్ర నామంలో వివరంగా వెయ్యి మాటల్లో వివరించబడింది. ఈ రహస్య నామ సాహస్రాన్ని కూర్చిన మహర్షి, ప్రతినామం లోనూ ఆనామం తెలిపే తత్త్వాన్ని కూడా పొదిగి ఉంచాడు. కాబట్టి నామోచ్చారణ మాత్రం చేత సర్వాంత రంగిణియైన పరమేశ్వరీ స్వరూపం గోచరిస్తుంది. సాత్వికమైన సాధన, పరమ పావనమైన భావన, నిర్మలమైన హృదయము, నిశ్చలమైన మనస్సు. వీటితో ఈ నామాలను పఠిస్తే స్తోత్రానందంతో పాటు శాస్త్రజ్ఞానం కూడా లభిస్తుంది.

శ్రీ లలితా సహస్రం శాస్త్రమనేందుకు ఒక ప్రబల నిదర్శనం ఉంది. శ్రీ విష్ణు సహస్రనామంలో చాలా నామాలు మాటి మాటికీ వినిపిస్తాయి. అందులో నామం సంకీర్తన, స్తుతి ప్రభావం కాబట్టి, ముఖ్యమైన నామాలు వేరు వేరు చోట్ల వేరు అర్థచ్ఛాయలతో వస్తాయి. అది పునరుక్తి అయినా దోషం కాదు. కాని శాస్త్ర వివేచనలో పునరుక్తికి తావులేదు. చెప్పిన మాట మళ్లీ చెప్పటం శాస్త్ర విరుద్ధం. అందువల్లనే రహస్య నామ సాహస్రంలో ఏ నామంకూడా రెండు సార్లు రాదు. తానికి తోడు విష్ణు సహస్రనామాలలో లేని పూర్వాపర సంబంధం, లలితా సహస్రంలో గోచరిస్తుంది. ఈ పూర్వాపర సంబంధం విష్ణు సహస్ర నామంలో జాగ్రత్తగా పరిశీలిస్తే గాని గోచరించదు. ఈ పూర్వాపర సంబంధం విష్ణు సహస్ర నామంలో జాగ్రత్తగా పరిశీలిస్తే గాని గోచరించదు. లలితా సహస్రనామంలో అది సామాన్య దృష్టికి కనిపిస్తుంది.. నామ సహస్రాలకు రెండింటికి కొంత సామ్యం కూడా ఉంది. కొన్ని నామాలు స్త్రీ పురుష భేదంతో రెండింటిలో కనిపిస్తాయి. నారాయణి నారాయణులు, భవానీ భవులు ముకుందా ముకుందులు రెండింటిలోను సాక్షాత్కరిస్తారు. కొన్ని కొన్ని పంక్తులు కూడా రెండింటిలో సమానంగా వినిపిస్తాయి. విష్ణుపరంగా చెప్పిన "స్తవ్యః స్తవప్రియః స్తోత్రం – స్తుతిః స్తోతారణప్రియః" అనే నామాలిక దేవీ పరంగా చెప్పిన స్తోత్రప్రియా స్తుతి మతీ

శ్రుతి సంస్తుత వైభవా అన్న శ్రుతి సంస్తుత వైభవా" అన్న శ్రుతి హారానికి ఎంతో సమీపంగా ఉంటుంది. అలాగే "మహామాయా మహా సత్త్వా మహాశక్తి ర్మహారతిః" "చారురూపా చారుహాసా చారుచంద్ర కళాధరా" "రమా రాకేందు వదనా రతి రూపా రతి ప్రియా కలావతి" "కలాలాపా కాంతా కాదంబరీ ప్రియా".

ఇలాంటి నామ మాలికలు రాగా మాలికలుగా వినిపిస్తాయి. అసలు శ్రీ లలితా నామ సహస్రమంతా శ్రీరాగ రంజితమైన మహాగానం. ఈ గానం లోనే జ్ఞాన విజ్ఞానాలు మిళితమై ఉన్నాయి. ఇది గానానికి గానం. జ్ఞానానికి జ్ఞానం. స్తోత్రానికి స్తోత్రం. సాస్త్రానికి శాస్త్రం. అర్చనకూ, అధ్యయనానికీ, ప్రార్థనకూ, పారాయణానికీ, మంత్ర సారంగా యంత్ర సారంగా, తంత్రసారంగా ఉపకరించే విజ్ఞానసర్వస్వం. రహస్య నామ సాహస్రం. ఇందులోని భావ సౌందర్యానికి ముగ్ధులై శ్రీ శంకర భగవత్పాదులు సౌందర్యలహరి వెలయించారు. తల్లి లావణ్యం కీర్తించేతొలి ఇరవై శ్లోకాలలోని సారాన్ని గ్రహించి, సౌందర్యలహరి శివశక్తి సామరస్యాన్ని శతథా భావించింది. సౌందర్యలహరి ప్రతిశ్లోకం రహస్యనామ సహస్రంలోని అక్షర రమ్యతను, రుచిరార్థనిధిని స్ఫురింపజేస్తుంది. జగదేక మాత ఎవరిని కటాక్షిస్తే అతడే ఋషి అవుతాడు. ఆమె అవ్యాజ, అద్భుత, అపార కరుణ అనుగ్రహం కావాలంటే ఆమె నామాలను స్మరించాలి. ఆమె దివ్య రూపాన్ని ధ్యానించాలి.

నిజానికి నామరూపాలు మనవి. ఆమెకు నామం లేదు. రూపం లేదు. ఆమె నామరూప వివర్జిత. కాని నాదంలో ఆమె (శ్రీమాత వినిపిస్తుంది) "నారాయణ" నాదంలో నామపారాయణ ప్రీతితో ఆమె సాక్షాత్కరిస్తుంది. ప్రణవనాదమే పరమేశ్వరికి నిలయం. కనిపించే రూపం. వినిపించే నామం జీవ లక్షణాలు. ఈ నామరూపాలకు ఆధార భూతమైన అస్తిత్వం (ఉనికి) కాంతి (వెలుగు), ప్రేమ (చెలిమి) పరమాత్మ స్వభావాలు. కనిపించేది జీవాత్మ కనిపించే జీవాత్మకు ఆధారమైన ఉనికి పరమాత్మ. కనిపించే అవయవాలు పరమాత్మతో కూడి ఉన్నంతవరకే కనిపిస్తాయి, వెలుగుతాయి, వెలుగునిస్తాయి. పరమాత్మతో సంబంధం విడిపోగానే జీవాత్మకు దేహం మీద మమకారం పోతుంది.

రక్తమాంసాలు, అస్థి చర్మాలు, కరచరణాలు. క్రమంగా చైతన్య రహితమై పంచ భూతాల్లో లీనమై పోతాయి. కాని పోయిందేదో కనిపించదు. కళ్ళు సూర్యునిలో, మనస్సు చంద్రునిలో, వాక్కు అగ్నిలో, శ్వాస వాయువులో, చెవులు దిక్కుల్లో, శరీరం మట్టిలో, వెంట్రుకలు చెట్లు చేమల్లో, రక్తవీర్యాలు నీళ్ళల్లో, ఆత్మ అంతరిక్షంలో కలిసి పోయిన తర్వా మిగిలేది ఏమిటి? అదే చిరంతన చైతన్యం. దానికి ఎదుగు పొదుగులు లేవు. ఎప్పుడూ అది సంపూర్ణమే. అదే పరమేశ్వరి, లలిత, గాయత్రి, దుర్గ, పార్వతి, కల్యాణి కామాక్షి ఏ పేరుతో పిలిచినా పరాశక్తి, ఆదిశక్తి, మూలశక్తి, ఒకే చిచ్ఛక్తి. ఈ ప్రపంచమంతా ఆ చిచ్ఛక్తి విలాసం.

ఈ చిచ్ఛక్తిని వేదాలు గాయిత్రిగా గుర్తించాయి. ఉపనిషత్తులు ఉమా దేవిగా భావించాయి. పురాణాలు లలిత, కాళి అని పేరు పెట్టాయి. ఆగమాలు మహాత్రిపుర సుందరి, రాజరాజేశ్వరి, మహాకాళి, మహాసరస్వతి, మహాలక్ష్మి అని ఆరాధించాయి. ఏమీ తెలియని పామరజనులు అంకాళమ్మ, పోలేరమ్మ, నాంచారమ్మ అని ఏవేవో పేర్లతో జగజ్జనని తమకు తోచినట్లు భావించి సేవించారు. అన్నింటిలో శక్తి ప్రధానం. ప్రతిపదార్థంలో శక్తి ఉంది. పదానికి అర్థం శక్తి. సూర్యునికి వెలుతురు శక్తి. చంద్రునకు వెన్నెల శక్తి. అగ్నికి వేడిశక్తి. ఇలా శక్తిలేని పదార్థం లేనేలేదు.

యస్యయస్య పదార్థస్య
యా యాశక్తి రుదాహృదా
సాసా సర్వేశ్వరీ దేవీ
శక్తిమంతో మహేశ్వరః

**మంత్రపుష్పం**

జాతవేదసే సువామ సోమ మరాతీయతో నిదహాతివేదః సనః పర్షదతి
దుర్గావాణీవిశ్వానావేన సింధుం దురితా త్యగ్నిః, తామాగ్ని వర్ణాంతప
సాజ్వలంతీం, వైరోచనీలకర్మఫలేనజుష్టాం దుర్గాం దేవిగ్ం
కరణమహంప్రపద్యే సురతపితరసేనమః
లక్ష్మీంక్షీర సముద్ర రాజతనయాం శ్రీరఙ్గధామేశ్వరీం

దాసీభూతసమస్తదేవ వనితాం లోకైక దీపాజ్కురాం,
శ్రీమన్మన్ద కటాక్షలబ్ద విభవబ్రహ్మేన్ద్ర గజ్గాధరాం
త్వాంత్రైలోక్యకుటుమ్బినీం సరసిజాం వన్దేముకున్దప్రియామ్
శుద్ధలక్ష్మీ ర్మోక్షలక్ష్మీ ర్జయలక్ష్మీ స్సరస్వతీ,
శ్రీలక్ష్మీ ర్వరలక్ష్మీశ్చ ప్రసన్నామమ సర్వదా
పరాజ్కుశౌ పాశ మభీతిముద్రాం
కరైర్వహన్తీం కమలాసనస్థామ్
బాలార్కకోటిప్రతిభాం త్రినేత్రాం
భజేహ మమ్బాం జగదీశ్వరీం తామ్
సర్వమజ్గళమాజ్గల్యే శివే సర్వార్థ సాధకే,
శరణ్యే త్ర్యమ్బకే దేవి నారాయణి నమోస్తుతే.
(సరసిజనిలయే సరోజహస్తే ధవళతరే శుభగన్ధమాల్యశోభే, భగవతి
హరివల్లభే మనోజ్ఞే త్రిభువనభూతికరిప్రసీదమహ్యం)
మహాలక్ష్మీ చవిద్మహే, విష్ణుపత్నై చధీమహి. తన్నోలక్ష్మీః ప్రచోదయాత్.
శ్రీ మహాలక్ష్మీ దేవతాయైనమః సువర్ణదివ్యమంత్ర పుష్పం సమర్పయామి.

## శ్రీ లలితా పరాక్రమపాట

సర్వదేవతలు ప్రార్థింప మహాశక్తియై చిదగ్ని
గుండమునుంచి ఆవిర్భించె శ్రీ లలితా విశ్వ లోకేశ్వరి
భండాసురిని బాధలు ఓర్వలేని దేవతల చూచి
కోపోద్రిక్తయై మన్మద భస్మం నుండి జనించిన
మహాబల రాక్షసుడు సర్వ సైన్యముల ఆజ్ఞాపించె,
శ్రీ లలితా అంకుశము నుండి పుట్టినది "సంపత్కరి"
గజాయుధమునకు "రాణి కోలాగ జాధీరుష్టియై సంపత్కరి",
"అశ్వారూఢ" అను దేవత "అపరాజితా శ్వరూఢురాలై"
కోటానుకోట్ల అశ్వములను వాయు మనో వేగాలనడిపించె
శ్రీ చక్రమే "గేయ చక్రాధి దేవత శ్యామల మంత్రిణి",
శ్రీ చక్రమే "కిరి చక్రరధారూఢుని వారాహి"
వాహిసేనానాయకురాలు "కిరి చక్రరధారూఢుని వారాహి"

శ్రీ లలితా అచలలోనిదే "శ్రీదేవి" "మహావీర పరాక్ర శౌర్య
రణరంగ ధీరో", ఇరుప్రక్కల శ్యామల, వారాహి శ్రీదేవి ఆయుధాలకు
కావలియుండి విజయ పతాక రధరూఢిని
శ్రీదేవి, కిరి అన"వరాహరూపముల" గల రధారూఢిని "దండి నీదేవి"
"నిత్యాధిదేవతలు" పదునైదు "తిథి దేవతల దమనకాదుల"
సంహరింప, భండాసురుని పుత్రుల "ముప్పది మందిని" సంహరించె
"బాలా త్రిపుర సుందరీ శ్రీ లలితాద్భువ కాన పరాశక్తి 'తనయ' తొమ్మిది ఏళ్ళ
వయస్సుది" భండాసురుని సోదరుల సంహ
రించె "విషంగ విశుక్రులను" "శ్యామలా దండినీ దేవితో"
సంహరింపబడిన విశుక్రుడు కడసారిక జయ విఘ్న
అస్త్రము ప్రయోగింప పరాశక్తి కామేశుని ఆశ్చర్యమున జూడ
మహా వీరగణపతి ఉద్భవించె తక్షణమే విఘ్నశస్త్రములు దగ్ధము
చేసె భండాసుర సర్వ సంహారమునకు 'దశావతార
శక్తుల' తన 'చేతి గోళ్ళ కాంతులతో ఉద్భవింపచేసె'
శ్రీదేవి 'పాశుపతాస్త్రము', 'కామేశ్వరాస్త్రము' సంధింప
'శూన్యకమను పేరు భండాసుర నగర మెల్ల విధ్వంసమాయె'
దశావతారులు శ్రీదేవి మహారణరంగ శూరులై
సర్వ రాక్షస సంహారము గావించి సర్వదేవతలు అర్థింప
మన్మధ భస్మము సంజీవిని తో రతి దేవికి
మాత్రము అగుపడునట్లుగా చేసెను.
విశ్వశాంతినిలపె శ్రీ లలితా పరమేశ్వరి.

(కామేశుడు శ్రీ లలిత తపోశక్తినిచ్చె అందు కాది విద్యతో భస్మమైన మన్మధుని పునర్ జీవితునిచేసెను)

## మంగళ హారతి

శ్రీమాతా చిదగ్ని కుండమునుండి ఉద్భవించిన మము కనురెప్ప పాటే లేక కాపాడు అమ్మా మమతల మాణిక్యాల హారతి, భక్తిమమతల మాణిక్యాల హారతి.

మాతాపితరుల సర్వబంధువుల సర్వుల ప్రేమామృత వర్షిణీ, అమృత వజ్రాల

హారతి, ఆనంద వజ్రాల హారతి,

అమ్మా నిను నమ్మి భక్తులకు దివ్యశక్తుల ప్రసాదించి, దుష్టుల శిక్షించి,

సర్వప్రాణికోటి రక్షించు అమ్మా, నీకిదే వైఢూర్య హారతి, భక్తి వైఢూర్య హారతి.

పాపనాశనీ, భక్తి ప్రసాదినీ, విజ్ఞాన బోధిని, సర్వుల క్షేమానందాల

కోరుకొనువారికి, లోకానందము కోరేటి వారికి మనోవాయు వేగాల మించిన

విజయాలిచ్చు తల్లికి, నీకిదే నవరత్నాల హారతి, విజయ నవరత్నాల హారతి.

అమ్మా నిన్నే పూజించి మనసారా ఆరాధించితే, శ్వాసలో

శ్వాసగా పుత్రికలని, పుత్రులని ఎంచక అద్భుత శక్తితో కాపాడు అమ్మా

నీకిదే పద్మరాగాల హారతి, భక్తి పద్మరాగాల హారతి.

అమ్మా నీ పాద పద్మాల సేవలలో సదా మా సాధనలు సాగిపోనీ, అమ్మా నీ

దివ్య మహిమలే పదే పదే తలచి ధైర్యంబుగా నీదరి చేర్చుకోమ్మా (2)

3. నీకిదే అమ్మా శ్వాసలో శ్వాసవై వశించే నీకు మౌక్తిక మణి హారతి,

నవవిధ భక్తుల నమమౌక్తిక మణుల హారతి,

అమ్మా పట్టిన నీ భక్తుల చేతుల నెన్నడు వదలకమ్మా, అమ్మా అమ్మా అని

అనంత సంజీవినీ అక్షయ కరుణతో నీ పాదల చేర్చుకో,

నీకిదే భక్తి శరణాగతి హారతీ.

సరస్వ శరణాగతి హారతీ, నీ పాద పద్మాలకు అనేకానేక కోట్లాది వందనాల

హరిచందనాల హారతి, నీవే నమ్మా మాకు సర్వస్వము. అమ్మా నీకు

భక్తిహారతి, నీకు నవవిధ భక్తుల హారతి, అమ్మా నీకిదే అరువది నాలుగు

అమరకళల హారతీ, అమ్మా నీకిదే బ్రహ్మానంద హారతీ, అమ్మా, పరమానంద

హారతి, పరానంద హారతులమ్మా అమలగన్న అమ్మా.

## శ్రీ లలిత విజయ రణరంగ మంగళహారతి

సర్వదేవతలు అమ్మ అవతరించాలని బిడ్డలైన

తమను కాపాడమని, సర్వవిధముల ప్రార్థింపగా

మహాచిదగ్ని కుండము నుంచి అమ్మ అవతరించె

దివ్యాది దివ్యానేక అలంకారములతో జగన్మోహిని
అవతరించగా అమ్మా అని ఆనందముగా స్తోత్రములే
చేసి సుకుమారి కోమలాతి కోమలాంగిని శ్రీలలితా
అని అమ్మ పేరు బిడ్డలే పెట్టుకొని భండాసురుడను
మహారాక్షసుని వలన ఎన్నెన్ని వేదనలు
పడుతున్నారో అమ్మకు వివరించి చెప్పగానే
తన సంకల్ప మాత్రంతో అరువది నాలుగు కోట్ల
బలగంతో చింతామణీద్వీపమును నిరాధారంగా
నిర్మాణంచేసికొని మహా సుందరవదనుడు కామేశు
అర్ధాంగి అయ్యె ఇక విజృంభించె అమ్మ బిడ్డలబాధల
కాంచిన అమ్మ మహా అగ్నిగోళమై తీవ్రవాయుమనో
వేగాల మించి యుద్ధము ఆరంభించె, అంకుశమునుండి
సంపత్కరీ గజాల కధిపతి రణకోలాహలమను గజమును
అశ్వారూఢాది దేవత అపరాజిత అశ్వమును గేయ
చక్రమను రథమును మహాదండినీ దేవి 'శ్యామలాదేవి'
వరాహాకారమను రథచక్రములతో రథమును వారాహి
దేవి 'ఉపసేనాని', 'ఆనంద ధ్వజ పతాకముతో' పరా
నేకధిశక్తులతో నున్నది శ్రీదేవి రథము, ఇరుప్రక్కల
శ్యామలాదేవి, వారాహినిదేవి అమ్మ ఆయుధాల రథములతో
శ్యామలాదేవి విషంగ, విశుక్రులను, భండాసుర అనుజుల,
సంహరింప వారాహిదేవియును, ఇరువురు సేనాని, ఉపసేనాని,
మరియొక వంక పదునైదు తిథి దేవతలు దమనకాదులనే అనిత్య
దేవతలను బాలత్రిపుర సుందరి భండాసురుని ముప్పది పుత్రుల హత
మొనర్చె శ్రీలలితా మానస పుత్రీ విశుక్రుడు జమవిఘ్నశస్త్రమైన కామేశుని
శ్రీ లలిత చూడగా మహాగణపతి ఉద్భవించి జయవిఘ్నశస్త్రము దగ్ధము
చేసెను, రాక్షస సమూహాల విఘ్నయంత్రము లెల్ల సర్వనాశనమొనర్చె
భండాసురుడు విజృంభించె, శ్రీదేవి మహావీర శౌర్యప్రతాప జ్వాలా
మాలినియై మహానేక యుద్ధరీతి రణరంగధీర శస్త్రాల వర్షమే

కురిపించె, తన వేలిగోళ్ళతో దశావతారములు సృష్టించ
కామేశ్వర శస్త్రమును మించినది లేదు శ్రీదేవి ఆ శస్త్రముతో
పాశుపతాస్త్రము, రౌద్రిణి రుద్రిణి మహాకోపోజ్వాలాల కామేశ్వర
శస్త్రముతో శూన్యకనగర భండాసుర సహితాన దగ్ధంబుచేసెన్.
బ్రహ్మ విష్ణు మహేశ్వర సహిత సమస్త దేవతలు అమ్మ
ఆపదదలో ఆదుకొన్నావు అవ్యాజ కరుణామూర్తీ
అరువది నాలుగు కోట్ల రణ రంగ సమూహాలతో, స్వయముగా
అమ్మ నీవే స్వయంబుగా అనేకానేక జ్వాలామాలాంశ
లతో సంపత్కరీ, బాలా త్రిపుర సుందరీ, శ్యామలాదేవి, వారాహి
భగళాముఖి, అణిమాది శక్తులతో, బ్రాహ్మివై, వశిత్య సిద్ధివై
మతిభ్రమణమే కలిగించావు రాక్షసులకు, చిదగ్నిరూపోన్నతవై
వాయుమనో వేగాలకతీతమై అగోచరీ వేగాన, ఇచ్ఛాజ్ఞానక్రియా
శక్తుల మధ్య మహాత్రిఖండ ముద్రిణీ, సర్వమంత్రతంత్రమంత్రా
ధి దేవ దేవీ, కాలస్వరూపిణీ ఉడ్డీశ, షష్ఠీశాది దేవతలతో
షడమ్నాయ దేవతారూపిణీ, ఇరువది ఐదు మహాధిష్ఠాన దేవతల
అమ్మా సర్వ మహావీర మహోన్నత వీరాధివీర రణరంగ ధీశాలి
వీరమాతా కామ కళారూపిణివై శక్తివై పరాశక్తివై కామాక్షివై
మహాకామేశ్వరివై మము కాపాడిన మాతా నీకు సర్వోప
చారములు చేసి సర్వపూజల సర్వనివేదనల అనేకానేక పూజా
విధానాల పలురకాలుగా నిన్ను సేవించు కొనుటకు ఆజ్ఞనిమ్మా
అని సర్వోపచారములుచేసి శ్రీలలితా సహిత కామేశ్వరునికి
జయమంగళం విజయ మంగళం వీరమంగళం శూరమంగళం
జైమహామాతా జై మహావీర శూరమాతా జై శ్రీ లలితా మహారాణికి
జైయ్ జైయ్ జైయ్ అను జయపతాకోత్సవ కోలాహలమున
సర్వుల ఆనంద ఆత్మానంద బ్రహ్మానంద పరమానంద భరితులైరి.
జైయ్ శ్రీ లలితా మహారాణికి జైయ్.

1. శ్రీ మహాలక్ష్మి బీజము
2. శ్రీ లలిత కంఠమునుండి నడుమువరకు మోహనం
3. ఆత్మ చిద్రూప బీజము. కామరహిత.

అష్టదిక్పాలకులచే, అనేక దేవతలతో పూజింపబడి
స్తుతిచేయు అమ్మలగన్న అమ్మా, మానవులకు
నిను కీర్తించు వరమిచ్చావు, గంధర్వగానాలలో
అమర వాయిద్య ఘోషలలో, హల్లీహాలస నాట్య
లాస్యాలలో, వేదం, గానం, నాట్యం, తాళయుక్త
గతులలో గగనాగ్ర శిఖామణి, ఏమని నిన్నేమని
కీర్తించను, సర్వుల సమభావ ప్రేమామృతము వర్షించు
తల్లీ, వెన్నకన్నా మృదువైన మనస్సు, భక్తి, సాధనయే
కావ్యప్రియా, సాధనే కవ్వముగా చేసికొని నీ పాద పద్మాల
సేవనే నిరంతరము చేయనా, అంతరంగాల అలలో నిను
డోలలలూపి సేద తీర్చనా, ఏరీతి అమ్మా నిను కీర్తించను
లోపాముద్రా, అరుంధతీ ఆదిపతివ్రతలచే పూజింపబడు దానా,
వాణీ లక్ష్మి వింజామరలు వీచగా, ఏసేవనే చేయను, నిను
ఏరీతి కీర్తించి అఖండ జ్యోతినై నిత్య సత్య శాశ్వత
మంగళహారతినేనే నయి సర్వహారతులనిచ్చెదను.



లక్ష్మి విష్ణు, పార్వతీ పరమేశుల, వాణీ బ్రహ్మాది దేవత
లతో, గణపతి కుమారులతో, బ్రహ్మాదేవుని వేద సామగానాన
వాణీ వీణాశ్రుతిగా, శివకేశవుల నాట్యడోలలో, లక్ష్మి విష్ణు
గణపతి, కుమార తాళయుక్తల రక్తి కట్టించ,
లక్ష్మి విష్ణువులు, రాధా కృష్ణ స్వరూపులై
ఒకపక్క డమరుకము, మరొకవంక వాణీ వీణాశ్రుతి
కుమార గణపతులు రాగ తాళయుక్తరాగాలాపన, కృష్ణ మురళీ
సర్వమునధిగమించె, ఏమని వర్ణింపవలె అమ్మ ముగ్ధ
మనోహర చిరుమందహాసము ఆ మహోన్నత సంగమము
కాంచవలయునే గాని భాషలు వ్రాసి తెలుపంగలేము.
మంగళవాయిద్య ఘోషలు మారుమ్రోగగా భువనాలు

దద్దరిల్లా ఆయుధ పాణులు సమర విరులపైన చయు
వీర నాట్యహాస్య లాస్య లయబద్ధ రాగ తాళ యుక్త నాట్యము
శ్రీ లలితా మంగళాస్తుతి సుమంగళాస్తుతితో
ఎల్లరు మోదమందేటి వారు. అరుదుగా కానవచ్చేటి ఆనంద కోలాహలమది.

## మంగళ హారతి

అమ్మా కామేశ్వరునితో నీ వివాహము కాంచనేలేదు,
భూలోకముననే తల్లిదండ్రులపెండ్లి కాంచరు బిడ్డలు

ఊరేగింపుగా నైనా రారాదా బంగారు మహాసార్వభౌమ
సుగంధపూల రథము అలంకరించి శక్తికొలది చేసేము,

ఆనంద అమర భోగాల పరానంద స్వరూపులు విశ్వాలన్నియు
మీ దివ్య కాంతులలో కాంతి మంతమాయె,

అమ్మా నీ చెక్కుటద్దాలలో ఈశుని మేము కాంచినామని,
నీవు గ్రహింప నీ అరమోడ్పు సిగ్గు కన్నులు రేయిఆయె

రాజకొలువులో శ్రీ మహారాజ్ఞివై భువన సుందరుడు కామేశు
వామ భాగమున దర్శనమిచ్చే నీ మీన నేత్రాదృష్టి పగలాయె

అమ్మ కామేశు, నీవు యుగయుగాలకు నవ్యాతి నవ్య నూతన
పరాదివ్యకాంతుల నవ వధూవరులే,

మా శక్తి కొలదిబంగారు రథముకు,పచ్చల, కెంపుల వైఢూర్యాల
నీలాలు ముత్యాల జాలరుల రతములో

విహరించవే మా హృదయ సువిశాల భక్తి వీధులలో
కాంచని కామేశ బద్ధ మాంగల్యమును,

ధవళవర్ణంబునకే వన్నె తెచ్చే మహాకోట్లానేక శోభలతో
అర్ధాంగి అమ్మ లలితా దేవే కాగా ఇరు తేజాల

ఒక్కమారే ఆ వినీల వింత కాంతుల సొగసుల శోభలు
కాంచని జన్మ ఏల, ఒక్కమారు జగన్ మోహన దంపతీ

దర్శనమీయ వమ్మా, మా ఆత్మలే ఫలములుగా, మనో
పుష్పాల, నీ అనురాగ నవ హారతులిచ్చుకుంటాము.
భక్తి రాగ హారతులిచ్చుకుంటాము.

## మంగళ హారతి

హయగ్రీవులు తొలిసారి నినుస్తుతియింప, వశిన్యాది వాగ్దేవతలు
మలిసారి, వ్యాసాయ విష్ణవే ముచ్చట మూడోమారు నిన్ను స్తుతియించి
మానవులకు అవకాశమీయ శ్రీ అగస్త్య మహాముని మూడు వందల సం॥లు
హయగ్రీవులకు సేవచేసి, నిన్నే మెప్పించి త్రిలోకాతీతా త్రిశతినే
అందించారు పుణ్యదంపతులు లోపాముద్రా అగస్త్యులు
అరుంధతి, వశిష్ఠులు దంపతీ సమేతంగా పూజించి తరించారు,
అమ్మా మదిలో చెప్పలేని వ్రాయలేని మమతలున్నవి
నీకు సర్వసేవలు చేసి ప్రభాతసేవ నుండి పవళింపు సేవలు చేయాలని
నీవే సంకల్పించి దీవించిన కాని సఫలము కానేరదు
జడిలేని వరము వర్ష మొక్కటే తల్లీ
సదా నీ తలపులో, నిదుర మెలకువలో, ఇలలో
కలలో నీకై పరి తపించి నీ పాదపద్మాల బానిసగ
చేసికొంటానని దీవించమ్మ
ఇదియే నీ నామ ఫల తపోహారతి అందుకోమ్మా
భక్తి తపోహారతి అందుకోవమ్మా.



అమ్మా వాస్తవముగా నిన్నే చూసిన నేత్రములు మూత
పడుట అసంభవమ్మా అతిలోకఅత్యంత అద్భుత
అసమాన అప్రమేయ సర్వలోకాతీత ఊహాతీత
జగత్ సౌందర్యరాశి, జగన్ మోహినీ, జగదేక సుందరీ,
చింతామణి ద్వీపాన అసమానబంగారు నవరత్నాల
ప్రాకారాల కొలువైన అమ్మకుపద్మ రాగమణి ఖచిత
కిరీటికి, భక్తిచంద్రమణి నీరాజనం,

అనేక కోట్లాను సూర్యప్రభలతో ఎట్టిని చీర రతనాల
అంచులతో అనేక ఆభరణాల అమ్మకు
భక్తి సూర్యమణుల నీరాజనం
మహారాజ్ఞి రాజసరతనాల భుజకీర్తులకు, కామేశబద్ధ
మణుల మాంగల్యమునకు భక్తమమతల మాణిక్య నీరాజనం
జగాల అమ్మా అని ఉత్తుంగ వక్షస్థలికి, నూగారు నడువవు
హోయల రతనాల జాలరుల బంగారు నూలుకు భక్తి రతనాల నీరాజనం
మోహనమైన చంద్రానేక కాంతుల మోహ చంద్రముఖికి
ఎట్టిని అధరాలకు పండిన తాంబూల అధరాల చిరునగవుకు
పద్మరాగ కెంపుమేలు కలియిక కలనేత నీరాజనం
ఏలాలసుగంధ నీలల ముంగురుకు నీలాల నీరాజనం
మాలతీ, మల్లికా, పారిజాత మొల్ల మొగలి జపా పుష్పాల
అశోక, పున్నాగ, చంపక, సౌగంధికా గురువిందాది సుగంధ
మాలలతో నీ నీలాల కురులకు పుష్పమాలికలనే
సమర్పించి, కురులకు విరులందమా అమ్మా విరులకు నీ కురులందుమా,
అమ్మా ముజ్జగాల నీ బిడ్డలనందరినీ దీవించు నీ దివ్య
హస్తాలకు నమస్కారానేక వైఢూర్య నీరాజనం
సర్వుల సమరీతి రక్షించు నీ పాదపద్మమంజీరాలకు
అరువది నాలుగ కళల, అనేక నాట్యపాదాభివందనం
భక్తి పాదపద్మాల నీరాజనం, నవ విధ భక్తి నీరాజనం.



అమ్మా దివ్యాది దివ్య మహోన్నత జగత్ సౌందర్యరాశి
మానవులకు కూడా లలాట నేత్రమున గాని కాంచలేమమ్మా
ఒకపరి అనేకానేక సూర్యకాంతుల, మరొకపరి చంద్రకాంతుల
అనేకానేక ప్రాకారాల చింతామణీ భవన మధ్య హ్రీం మణివై
శ్రీమహారాజ్ఞ పద్మరాగమణి, లలాట రతనముత్యాలు వ్రేలాడే పట్టికతో

ఎఱ్ఱని వస్త్రంబు ధరించి అనేకానేక దివ్యాభరణాలతో,
వేలాది కోట్ల సూర్య కాంతుల, కామేశ బద్ధ మాంగల్య శుభాంగనా
బంగారు నూగారు లతసన్నని నడుమునకు
సన్నని బంగారు తీగెకు రతన ముద్రలతో జాలరులతో, హారాల ఉత్తుంగ
వక్షస్థలి, శంఖ కంఠ చింతాముత్యహారాలు
మోహనం చంద్రముఖికి, సుగంధ ముంగురులు మోహనం, మీననేత్ర
మోహనం, విల్లువలె వంగిన కనుబొమలు మోహనం
సొగసైన సంపెంగ నాసిక మోహనం, లలాట తిలకధారి మోహనం, అసమాన
లావణ్య చుబుక సొగసులు మోహనం,
కంఠము నుండి సన్నని నడుము హొయలు మోహనం, చిఱునగవు
తో అధర సుధామృతంబులు మోహనం,
హస్త పద్మాలు మోహనం, భుజకీర్తులు మోహనం, శోభాయమాన
విలాసం, మోహనం, పాదపద్మాలు మోహనం,
వజ్ర వైఢూర్య మణి ఖచిత సింహాసన కామేశు గూడిన
జగన్ మోహిని మోహాతి మోహనం
శ్రీ లలితా సర్వశాస్త్ర సాముద్రిక శుభలక్షణ సుగుణ వరశీల పతివ్రతాను తల్లికి
సుందర సుకుమార సులలిత లత లతాంగి శ్రీలలితాదేవ దేవికి.



మా అమ్మ సంకల్ప మాత్రాన సృష్టించే అనేకానేక ప్రాకారాల అత్యంత అద్భుత మహాశ్చర్య ఊహాతీత నిరాధార చింతామణి ద్వీపం మహా వీర రక్షక భట లోహమయ ప్రాకారం, తామ్ర ప్రాకారం, వసంత లక్ష్మీ నిలయం, సీసాప్రాకారం మనోహరం, ఇత్తడి ప్రాకారం వర్షఋతువుతో శరత్ కళాపంచలోహ ప్రాకారం, దేవీ భక్త రజిత ప్రాకారం, దేవి సిద్ధుల నిలయం బంగారు ప్రాకారం, బ్రహ్మాండ సంరక్షకులుండేదిపుష్యరాగ ప్రాకారం, మహారణరంగ ధీరవీరాధి వీర పద్మరాగ ప్రాకారం, మహాతీవ్ర యుద్ధనిపుణ అరుణనేత్ర నిపుణ గోమేధిక ప్రాకరం, సర్వలోకాల సమాచార సమర్థ భువనేశ్వరీ వజ్ర ప్రాకారం, ఈ ప్రాకార కావలివారు మహా యోధులున్న వైఢూర్య పాకారం, భువనేశ్వరి పరిపాలన దక్షులు మించి సుదర్శన చక్రపద్మ పదహారు రేకులతో మహేంద్రమణి మయమై ఉండు నీలాల

ప్రాకారం, విశ్వ వార్తలన్నీ భువనేశ్వరికి తెలిపేది ముత్యాల ప్రాకారం, షట్కో యంత్ర చక్రం, మరకతప్రాకారం, మహా ఆయుధాల ధరించి భువనేశ్వరి నివేదించు వారుండు ప్రవాళ ప్రాకారం, అదిదాట నవరత్న ప్రాకారం, శ్రీదేవి అత్యంత అద్భుత స్త్రీలు, చింతామణి ప్రాకారం వేయి బంగారు స్తంభా నవరత్నాలు పొదగబడి చంద్ర సూర్యమణులతో, ముక్తి జ్ఞాన ఏకాంత శృంగా మండపం చింతామణీ ద్వీపం అమ్మ అద్భుత సృష్టికి శతకోట్ల వందనా హరిచందనాలు.

వజ్ర వైఢూర్యమణిఖచిత సింహాసన శ్రీ లలితా సహిత కామేశులకు జగత్ సర్వులకు మాతా పితరులకు అనేకవందనాలు హరిచందనాలు.

అమ్మా సర్వజగాలు రక్షించు అభయ హస్తములకు
హస్తపల్లవాలకు భక్తి రతనగాజుల, భక్తి మురిడీలు కానా,
అమ్మా నీ అందాల భుజాల భుజ కీర్తులకు, సర్వుల రక్షించు,
నీకు భక్తి నక్షత్ర భుజకీర్తులవనా, ఇరు ప్రక్కల హంసల భక్తి ముత్యాలై
నీ ముగ్ధ మనోహర మోమునకు జగత్ సౌందర్యరాశి
అమ్మా నీ కన్నుల, కరుణ నై కరిగిపోనా, నీ చిరునగవు లో లీనమై పోనా
అమ్మా కంఠములో అరువది నాలుగు అమర కళలు,
నీ మధు అమృత పలుకులన్నీ నీ బిడ్డలకు పరమానందమమ్మా.
అదే మాకు పరమానందమై ఆనంద జ్యోతినై పోనా
అమ్మా సుకుమార కోమలాంగి లతాంగి లలితమ్మా
సుగంధసుమాల నేకాలై పోయి, నే, పూలంగి సేవలో పులకించి పోనా,
అమ్మా కామేశ బద్ధ మాంగల్యమునకు, సర్వ శుభాంగనకు
మంగళము పాడి నేనే భక్తి మంగళహారతినై
నంద కర్పూర మంగళ నీరాజనమునై
మీ పాద పద్మాలలో లీనమై పులకించిపోనీ అమ్మా.

అమ్మా సర్వ జనుల బ్రోచే నీ కరుణా సంద్రాన హంసనై
క్రీడించి, నీరాజనమై పోనా, ముగ్ధ మోహనాంగికి, భక్తిసర్వా

ఆభరణ ఆనందమై పోనా, అమ్మా అని
సంసార వ్యధలలో పిలిచే వేళ తళుక్కున
మెరసే నీ నవమౌక్తిక చిరునవ్వేనమ్మా
చింతలన్నీ దీర్చు దివ్య చింతామణి,
నీ ఉత్తుంగ వక్షస్థలి హారాలు మెఱుపు లే
మా హృదయాలలో అలుము కొన్న మేఘాల
నీలి నీడల నూగారు బంగారు నీ సన్నని నడుము వయ్యారాల
నీ దివ్య మెఱుపుల మొలనూలు మెఱుపులై
నీ మమతల తెల్పి అభయము అందించె
దివ్య సంజీవినికి భక్తి నీరాజనమై
నవరత్న భక్తుల, నీరాజన మైపోయెదను.

అమ్మా అధర సుధామృత పలుకులకు
ఏ మంగళహారతులు పాడవలెనమ్మా వాణీ వీణా తంత్రధ్వనియే
సిగ్గులొలికించె
మూర్తీభవించిన జగత్ సౌందర్యమా, మనోహర, మధుర సౌందర్య వాక్కులన్ని,
తలవంచ అమ్మా ఏరీతి మంగళ హారతి పాడాలమ్మా,
అరువది నాలుగు అమర కళలన్నీ
నీ గళమున అనేక ఆలాపనలుకాగా ఏ రాగంలో కీర్తించాలో, తెలియక
నే నీకే కీర్తన అయిపోవనా,
అమ్మా చెక్కుటద్దాలలో కామేశరూపు
నీ చిఱునవ్వులో ఈశు నగవు కనిపించె
మహాపతివ్రతామతల్లీ, పరమ పావనీ పరాశక్తి పరంపరాల
శుభ దివ్యమాంగళ్య మంగళహారతులమ్మా
నీ కస్తూరి తిలక శోభలకు
కుంకుమ కుంభాలమ్మా
పచ్చని బ్రతుకునిచ్చే నీకు పసుపు కుంభాలు
ఆకలి తీర్చే అమ్మకు అనేకానేక నివేదనలు
వేదనల తీర్చి వేడుకలిచ్చే నీకు
అఖండ బ్రహ్మానంద కర్పూర నీరాజనం

# శ్రీ లలితా మంగళ హారతులు

రావమ్మా కుసుమ కోమలాంగి బంగరు లత శ్రీ లలిత
విచ్చెయ్యమ్మా, మా హృదయ చింతామణి కోవెలలోనికి
రావమ్మా వెన్నెల బొమ్మ
ముద్దుల నీ నగవు, మోహ వశులై భక్తులకు నీ
చెక్కుటద్దాల చెక్కిళ్ళు మోహంపు బిగి,
సుదతి చక్కదనాలు స్త్రీలకే నిన్ను చూడనీ మోహంబు
వీడలేము చంద్రకాంతుల మోము
పడతి ప్రతివ్రతామ తల్లి పదపల్లవంబులు మాకు
దారిచూపు దైవబాట నీ అభయమే
తరుణీరో కామేశు అర్ధాంగి పాద పద్మాల మంజీరాల
నుండి మరల దేదృష్టి మరో దిక్కుకు
ఏ దిక్కు చూచినా నీ దివ్య కాంతులే అమ్మా నీ నిరుపమాన
అనురాగము అటునిటుట కదలనీయదు,
అందుకే అమ్మా మా నివేదనల దివ్య శుభ మంగళ
అందుకో చంద్ర సూర్యమణుల అఖండ ఆనంద హారతి

కురిపించు పలుకు తేనెల అమృత ధారల పలుకవమ్మా
వీణ తీగెల మాధుర్యంబు సరివచ్చేనా
చక్కని నీ మోముకు సుగంధ నీలాల ముంగురుల మధ్య చంద్ర బింబముఖి
నీలలాట రతన పట్టిక మరింత శోభకాగా
కమ్మని నీమేని తావి, సర్వ శ్రేష్ఠ పర పుష్పాల కలారి సుమబాలవే
అందుకో సుగంధ పరిమళ పుష్పాలు
నీ మోహంబు మోము కాంచ కన్నులచటనే నిలచు, అమ్మా నీ ఉత్తుంగ
వక్షస్థలి నూగారు పైడిలతవోలె
అమ్మా నీ సన్నని నాజూకు నడుము నూలు పోగుల రతనాల జాలరుల

వలపుల సొంపుల సొగసైన సోగ కన్నుల దాన,
అవ్యాజ కరుణా కుంభ వృష్టినే కురిపింతువు, నిను వదలి
మరలిరాదు మనస్సు మాట వినదమ్మ,
ఏరీతి భూలోక గృహిణి ధర్మంబులు చేయవలె, ఎఱ్ఱని కుంకుమ,
చూడనీ ఫాలభాగ కస్తూరి గంధ తిలక శోభలు
మమతల మాణిక్యమా రతనాల బొమ్మ కామేశు తపః ఫలమా
పచ్చగ నేది కాంచిన పసుపు కుంభాల
అమ్మా నీ వేయి బంగారు నవరత్న స్థంభ మండపమే గురుతు తెచ్చే
నివేదనల చేసి, కస్తూరి హారతి అనిపించె
కర్పూర నీరాజనముమాటయే మఱచి నీ కస్తూరి తిలక శోభలే
గురుతు వచ్చె, మనసా మహేంద్ర నీలమణి హారతి
ఆనంద భక్తి నీలాల హారతి.



అమ్మా నీ అనురాగ రంజిత జీవనము,
నీ కన్నుల కరుణామృతము,
అమ్మా నీలాలన నీ పాలనలో
పరానంద నందన మది,
అమ్మా నీ మధుర భావనలే
నీ నామమే శ్వాసగా
అమ్మా గణమే తలపులోకి వచ్చిన వేళల
నిలువ నీదమ్మా నీ వశమైన మనస్సు
అమ్మా దేవి దుర్గమ్మ వరమిచ్చె
ధైర్య ధ్యాన సాధన సాగిపోవుటకు
అమ్మా గాయత్రీదేవి
ఇహ పర విద్యలనిచ్చె
పవిత్రదేహమును దేవాలయముగా మలచే
అమ్మా సావిత్రిదేవి
తీవ్ర ఆత్మ సాహస శౌర్య విశ్వాసమునిచ్చె

అమ్మా శ్రీలక్ష్మీదేవి
సమయానుకూల ధన సంపదలిచ్చె
అమ్మా రాధాదేవి, నీకై వేచి చూసే ఓర్పు నిచ్చెగాని
అమ్మా గతమే తలచి చింతామణి ద్వీపాన అమ్మా శ్రీ లలితా
హల్లీహలాస నాట్యమే తలచి వగచెనమ్మా
అమ్మా నీకై నీ కృష్ణ నీలిమ నాట్యముద్రలు
పట్టే దివ్య దినమున నిశ్చయించమ్మా
అమ్మా వాయుమనో వేగాల మించిన
వేగాన నిన్నే చేరనీ శ్రీలలితా.



శ్రీ లలితా దేవి, రాధ, మహాలక్ష్మీదేవి, గాయత్రి సావిత్రి, దుర్గను సృష్టించింది. దుర్ఘటన కార్యసాధనకు పూజించి దయతో సఫలం చేస్తుంది. భక్తుల రక్షిస్తుంది శ్రీ దుర్గాదేవి. దుర్గాదేవి దుష్టశిక్షణ శిష్టరక్షణ చేసిన ఆశ్రిత పారిజాత భక్తజనుల పాలిటి కల్పతరువు.

దుర్గాదేవియే అష్ట శక్తులు సృష్టించి సాధు జన రక్షణ చేస్తుంది.

కౌమారి, చాముండి, వారాహి, మహావీర్యా, నరసింహి, ఈశ్వరి, బ్రాహ్మి, కాళీ, వారుణీ, సరస్వతి, కామాక్షి, భద్రకాళి, నలకూబరి, కామిని, భగవతి, కౌశికి, పార్వతి, జ్వాలాముఖి, కల్యాణి, త్రిమూర్తి, భైరవి, ఇలా అన్ని శక్తులు భక్త రక్షణార్థం అనేకరూపాలు ధరించి రక్షిస్తుంది.

దుష్టులపట్ల రౌద్రరూపియై, భక్తులను ఎంతో ప్రేమగా తనే స్వయంగా చూస్తుంది. సర్వభక్తులయందు బుద్ధి, నిద్ర, ఆకలి, తనప్రతిబింబమై, శక్తియై ఓర్పు, జాతిస్వరూపమై, నమ్రతయై, శద్ధాసక్తి, కాంతి అందము, లక్ష్మిరూపమై, కార్యస్వరూపమై, జ్ఞాపకం, దయారూపమై, తృప్తియై, తల్లిరూపమై, భ్రాంతియై, చిదానంద జ్ఞానియై భక్తులను తనకు తానే రక్షించే ప్రేమామృతమూర్తి, అనురాగ మయి, మాతృప్రేమావర్షిణి, క్షమా స్వరూపిణి కరుణా వృష్టి కురిపించి భక్తుల పాలిటి కల్పతరువై మహాశక్తియై, అప్రమేయ, అజేయ, అసమాన, అప్రతిభాన అద్భుత మహాదాశ్చర్యకర్యాములతో సదా భక్తుల సర్వకాల సర్వావస్థలయందు

కాపాడు తల్లి, భక్తుల పాలిటి దుర్గమా మహాప్రాకారమై దరికి చేర్చుకొను దేవి దుర్గాదేవి.

ఈ పవిత్ర భారతదేశంలో ఎన్నో రూపాల భగవంతుని రూపాలు, ఎన్నో మంత్ర నామాలు, ఆ భగవంతుని దయవల్ల ఏర్పడ్డాయి. ఏభాషయైనా ఏ రూపంలోనైనా భగవంతుని నామము చేసికొని, భగవంతుని వల్లనే మనమంతా విద్య ధనము సమస్త సౌఖ్యాలు మన కృషికి దీవించి ప్రసాదించాడని.

అపకారము వదలి సాధ్యమైనంత వరకు ఎవరికైనా ఉపకారముచెయ్యండి. అపకారము చేసి సంపాదించినా ఆ సుఖము కనురెప్పపాటు కూడా ఉండదు.

ఎవరినైనా ఎన్నడు కష్టపెట్టి కన్నీళ్ళు పట్టిస్తే ఆ ఫలానికి ఎంతటి బాధ పడాలో తెలియదు. ఎవరికైనా మేలు చెయ్యండి లేకున్నా కష్ట పెట్టవద్దు.

ఎవరి వృత్తి ధర్మ ంవాళ్ళుచేసి, ఒక్క మారైనా ఎవరి ఇష్ట దైవనామం ఒక్కసారైనా అనుకోండి. నిజానికి అంగవైకల్యముతో బాధపడేవారికి, నూరు రూపాయలకు ఒక్క రూపాయైనా దానం చెయ్యండి.

ఒకరిని ఇష్టపడక పోయినా సాటి మనిషిని బాధపెట్టవద్దు. మీకు ఇష్టముంటే సహాయం చెయ్యండి. ఎవరినీ కష్టపెట్టకుండా ఎవరి జీవితాలు వారైనా ప్రశాంతంగా జీవించాలని, అనేక రూపాల భగవత్ రూపాలు నామాలు ఆ దైవకృపతోనే వ్రాయించాడు.

మరల భారతదేశంలో దారిద్ర్య బాధలు పోయి, సుభిక్షంగా ఉండాలని కోరుకుంటూ వ్రాసాను.

ఎందరో భగవత్ రూపాలు, ఎందరో భక్తులు, ఎందరో దేశభక్తులు త్యాగ మూర్తులు ఈ పవిత్ర భారతదేశంకోసం ప్రాణాలొడ్డిన, ప్రాణాలు పణంగా పెట్టి పోరాడుతున్న భారతమాత వీరపుత్రులకు, దైవము కోసం ప్రాణాలే అర్పించిన ఎందరో భక్తులు, పుట్టిన ఈ పవిత్ర భారతదేశంలో పుట్టినందుకు ఎంతో గర్వపడుతూ, ఆ దైవ పాదపద్మాలు చేరే వేళ దైవకృపతో వ్రాయించిన దైవ శక్తుల అనేక నామాల రూపాల దైవశక్తియే వ్రాయించినదని, భావిస్తూ సర్వులలో వసించే విశిష్ట మహామహోన్నత శక్తి.

– దైవదాసి.

# శ్రీ దేవ్యపరాధ క్షమాపణ స్తోత్రరత్నమ్

శ్లో॥ న మంత్రం నో యంత్రం తదపి చ నజానే స్తుతి మహో
న చాహ్వానం ధ్యానం తదపి చ న జానే స్తుతి కథాః
న జానే ముద్రాస్తే తదపి చ న జానే విలపనం
పరం జానే మాతస్త్వదనుసరణం క్లేశ హరణమ్ 1

విధే రజ్ఞానేన ద్రవిణ విరహేణాల సతయా
విధేయా శక్యత్వాత్తవచరణయోర్యాచ్యుతి రభూత్
తదే తత్క్షంతవ్యం జనని సకలోద్ధారిణి శివే
కుపుత్రో జాయేత క్వచిదపి కుమాతా న భవతి 2

పృథివ్యాం పుత్రాస్తే జనని బహువః సంతి సరళాః
పరం తేషాం మధ్యే విరళతరలోఽహం తవ సుతః
మదీయోఽయం త్యాగ స్సముచిత మీదం నో తవ శివే
కుపుత్రో జాయేత క్వచితపి.కుమాతా న భవతి 3

జగన్మాతర్మాత స్తవ చరణసేవా న రచితా
న వా దత్తం దేవి ద్రవిణ మపి భూయస్తవ మయా
తథాపి త్వం స్నేహం మయి నిరుపమం యత్ప్రకుర్షే
కుపుత్రో జాయేత క్వచితపి కుమాతా న భవతి 4

పరిత్యాక్త్వా దేవా వివిధవిధి సేవాకులతయా
మయా పంచా శీతే రధిక మపనీతేతు వయసి
ఇదా నీం చేన్మాత స్తవ యది కృపానాపి భవితా
నిరాలంబో లంబోదర జనని కం యామి శరణమ్ 5

శ్వపాకో జల్పాకో భవతి మధుపాకోపమగిరా
నిరాతంకో రంకో విహరతి చిరం కోటికనకైః
తవాపర్ణే కర్ణే విశతి మనువర్ణే ఫలమిదం
జనఃకో జానీతే జనని జపనీయం జపవిధౌ. 6

చితాభస్మాలేపో గరళ మశనం దిక్పటధరో
జటాధారీ కంఠే భుజగపతిహారీ పశుపతిః
కపాలీ భూతేశో భజతి జగదీశైక పదవీం
భవాని త్వ త్పాణిగ్రహణ పరిపాటీఫల మిదమ్ 7

నమోక్షస్యాకాంక్షా భవ విభవ వాంఛాపి చ నమే
న విజ్ఞానాపేక్షా శశిముఖి సుఖేచ్ఛాపి న పునః
అతస్త్వాం యాచేఽహం జనని జననం యాతు మమవై
మృడానీ రుద్రాణీ శివశివ భవానీతి జపతః 8

నారాధితాసి విధినా వివిధోపచారైః
కిం రూక్షచింతనపరైర్నకృతం వచోభిః
శ్యామే త్వమేవ యది కించన మయ్యనాథే
ధత్సే కృపా ముచిత మంబ పరం తవైవ 9

ఆపత్సుమగ్న స్స్మరణం త్వదీయం
కరోమి దుర్గే కరుణార్ణ శివే
నైతచ్ఛఠత్వ మ భావ యేథాః
క్షుధాతృషార్తా జననీం స్మరంతి 10

జగదంబ విచిత్రమత్రకిం
పరిపూర్ణాకరుణాస్తి చేన్మయి
అపరాథ పరంపరావృతం
న హి మాతా సముపేక్షతే సుతమ్
మత్సమః పాతకీనాస్తి పాపఘ్ని త్వత్సమానహి
ఏవం జ్ఞాత్వా మహాదేవి యథాయోగ్యం తథాకురు 12

